

# బుద్ధభూమి

## బౌద్ధ ధమ్మపత్రిక

బు.శ. ఆశ్వయుజం, కార్తీకం 2556
క్రీ.శ. అక్టోబరు, నవంబరు 2012

సంచిక - 5, 6

విడి ప్రతి : రు.75/-

సమ్రాట్ అశోక ప్రత్యేక సంచిక

భిక్షు ఆచార్య ఉపగుప్తుని నుండి ధమ్మ దీక్షను స్వీకరించి
ఛండాశోకుడు-ధమ్మాశోకుడైన సన్నివేశం (క్రీ.పూ.3వ శతాబ్దం)
చిత్రకారుడు : ధమ్మమిత్ర జి.గోవిందస్వామి, తిరుపతి



సమ్రాట్ అశోకుని అభీష్టం మేరకు మూడవ బౌద్ధ సంగీతికి సన్నాహకంగా
భిక్షువులకు సూచనలిస్తున్న ఆచార్య మొగలిపుత్త తిస్స
(చిత్రం : విపశ్యనా ధ్యానకేంద్రం ముంబయ్ గ్లోబల్ పగోడాలోని చిత్రమాలిక నుండి)

# బుద్ధభూమి

సబ్బే ధమ్మా నాలం అభినివేసాయ

**సంపుటి-1 సంచిక : 5, 6**

**అక్టోబరు - నవంబరు 2012**

గౌరవ సంపాదకుడు :

**అన్నపరెడ్డి బుద్ధఘోషుడు**

సంపాదకుడు :

**బి.బోధచైతన్య**

వర్కింగ్ ఎడిటర్ :

**గోలి సీతారామయ్య**

99491 45650

సంపాదక వర్గం :

చెన్నూరు ఆంజనేయరెడ్డి

డి.చంద్రశేఖర్

డా॥ వావిలాల సుబ్బారావు

పి. అబ్బాయి

డా॥ రాయదుర్గం విజయలక్ష్మి

బొర్రా గోవర్ధన్

జె. ఎస్. రఘుపతిరావు

ప్రింటర్ & పబ్లిషర్

**రేకా కృష్ణార్జునరావు**

రచనలు, చందాలు, విరాళాలు
పంపించవలసిన చిరునామా :

**రేకా కృష్ణార్జునరావు**, పబ్లిషర్
**D.No. 11-450-సి1, NCC రోడ్,**
**మంగళగిరి - 522 503,**
**గుంటూరు జిల్లా.**
సెల్ : 98481 99098, 99491 45650
Email:telugusanghamithra@gmail.com

విడిప్రతి : రూ. 15/-
సంవత్సరం చందా: రూ. 150/-

## లోపలి పేజీల్లో......



(తరువాయి 2వ పేజీలో...)

### ముఖచిత్రం వివరాలు

**ధర్మచింతనలో సమ్రాట్ అశోకుడు**

ముఖచిత్రాన్ని, కొన్ని రేఖాచిత్రాలను రచయిత మధుకర్ పిప్లాయన్ హిందీలో రాసిన **అశోకా ది గ్రేట్** గ్రంథం నుండి స్వీకరించడమైనది.
ఈ గ్రంథాన్ని ప్రచురించిన సమ్యక్ ప్రకాశన్, న్యూఢిల్లీ వారికి కృతజ్ఞతలు.

## కృతజ్ఞతలు

*ఈ సంచికలో 'బుద్ధభూమి బృందం' సేకరణగా ప్రచురితమైన అశోకుని విశేషాలు 1. కలకత్తా వారు ముద్రించిన 'అశోక-2003' సంచిక నుండి, 2. బేతపూడి లక్ష్మీకాంతారావు గారు రచించిన 'అశోకుని చరిత్రము' నుండి, 3. ఎస్.వీరనారాయణరెడ్డి గారి ఆంగ్ల గ్రంథం 'అశోక' నుండి, మరియు ఇంటర్‌నెట్ ద్వారా తీసుకోవడమైనది. వీరందరికీ బుద్ధభూమి కృతజ్ఞతలు తెలియజేస్తుంది.*

# ఉత్తరాలు

*శ్రీ బుద్ధఘోషుడు గార్కి నమస్కారములతో...*

బుద్ధభూమి సెప్టెంబరు సంచిక చదివాను. ముఖచిత్రం చక్కని ఫోటోగ్రఫీతో అద్భుతంగా వుంది. మనదేశంలోని బుద్ధవిగ్రహాల పోలికలు ఒకే రకంగా వుంటాయి. ఇతర దేశాలలోని బుద్ధుని పోలికలు ఆయా జాతుల ముఖకవళికలకు దగ్గరగా వుంటాయి. ఇదేవిధంగా మరికొన్ని ప్రాంతాల బుద్ధ విగ్రహాల చిత్రాలు ప్రచురిస్తే బాగుంటుంది.

బుద్ధభూమి వయసులో పిన్నదైనా, సైజులో చిన్నదైనా సామాన్యులకు అర్థమయ్యే విధంగా విలువైన రచనలతో వస్తుంది. మిళింద-నాగసేనుల సంవాదం ద్వారా, మీరు బుద్ధధాతువుల ప్రాముఖ్యాన్ని వివరించడం వల్ల మాలాంటివాళ్ళ సంశయాలకు సమాధానం లభించింది. చాలా సంతోషం. ఇంకా మీరు తగిన ఆరోగ్యంతో బహుకాలాలపాటు బౌద్ధ ధమ్మ ప్రచారానికి మీ సేవలు లభించాలని కోరుకుంటాను.

మనలాగ వయసు పైబడినవారు యాత్రలకు వెళ్ళలేకపోయినా, బుద్ధుని జన్మస్థలం, బౌద్ధనాథ్ దేవాలయం బొమ్మలు చూసి సంతృప్తిపడతాం. సింహళంలో బుద్ధధాతువులకు ఇస్తున్న ప్రాముఖ్యాన్ని మనం ఇవ్వలేకపోతున్నామనే విచారం పొందవలసి వస్తున్నది. దాతల నుండి విరాళాల రూపంలో పత్రికకు మంచి స్పందన వస్తున్నందుకు సంతోషం.

**-కె. శేషగిరిరావు**, చెన్నయ్

❋ ❋ ❋

*గౌరవనీయులు శ్రీకృష్ణార్జునబోధి గారికి బుద్ధవందనాలు!*

తమరు కుటుంబ సమేతంగా ది.28-4-2012న మా కుమారుడు చైతన్య అంబేడ్కర్-రజనీల వివాహానికి వచ్చి, పరిణయం జరిపించి, ఆశీర్వదించినందుకు మా కుటుంబ సభ్యులం దరం కృతజ్ఞత తెలుపుకుంటున్నాం. నేను 37 సంవత్సరాలకు పైగా బిహెచ్‌పివి విశాఖపట్నంలో ఉద్యోగం నిర్వహించి, అందరి మన్ననలను పొంది పర్సనల్ ఆఫీసర్‌గా బాధ్యతలను తృప్తిగా నిర్వహించి ది.31-7-2012న ఉద్యోగ విరమణ చేశాను.

ఈ శుభ సందర్భాలను పురస్కరించుకుని మా సంతోషంగా మన బుద్ధభూమి పత్రికకు పదివేల రూపాయలు విరాళంగా పంపుతున్నాను. దయచేసి స్వీకరించ మనవి.

ధమ్మపథంలో... **-గొంది నవీన్-లక్ష్మీదేవి**, విశాఖపట్నం

❋ ❋ ❋

*మాన్యశ్రీ రేకా కృష్ణార్జునరావుగారికి బుద్ధవందనాలు!*

బుద్ధభూమి పత్రికకు నేను పంపుతున్న చెక్కులో విరాళం మరియు సంవత్సర చందా వున్నది. మీరు, మీ సంపాదకవర్గం సంఘానికి చేస్తున్న సేవ ప్రశంసనీయం. ఈ పత్రిక ద్వారా జరుగుతున్న కృషి కేవలం బౌద్ధవ్యాప్తి మాత్రమే కాదు. మానవాళి పవిత్ర జీవనం కోసం బౌద్ధం ఒక్కటే మార్గమన్న విషయాన్ని ప్రపంచ మానవాళి గుర్తించే రోజు తప్పక వస్తుందని ఆశిస్తున్నాం. బౌద్ధసాహిత్య లోకంలో శ్రీయుతులు సవేరా, కె.ఎస్.ఆర్ మూర్తి, రాంబాబుగార్లు ధమ్మప్రభ పత్రికను చాలా దీక్షతో నడిపారు. అనివార్య కారణాల వల్ల కొద్దికాలం నడిచి ఆగి పోయింది. ఆ లోటును భర్తీ చేస్తూ 'బుద్ధభూమి' ఇలా రావడం ఎంతో సంతోషదాయకంగా వుంది. బుద్ధభూమికి కనీసం ఒక లక్ష చందాదారులు చేరాలని మనసారా కోరుకుంటున్నాను. మీ ఆశయ సాధనలో మీరు చేస్తున్న కృషికి నా హృదయపూర్వక అభినందనలు.

**-ఎమ్. ఎన్. మూర్తి**, హైదరాబాద్

# ధర్మవిజేతకు అక్షర నివాళి !

భారతదేశ చరిత్రకు మహోదాత్తతను సంతరించిపెట్టిన వ్యక్తి సమ్రాట్ అశోకుడు. స్వధర్మమే కానీ, పరధర్మం మచ్చుకైనా లేని నిరంకుశ రాచరికపు ధర్మాన్ని తిరగరాసిన మాన్యుడతడు. ప్రజలంతా నా కన్నబిడ్డలని, ప్రజామాటను పాలనాబాటగా తీర్చిదిద్ది ధర్మ పాలనకు నాందీ పలికిన ధర్మాశోకుడతడు. బౌద్ధాన్ని జీవన విధానంగా, బుద్ధబోధనల సారాంశాన్ని శాసనాలుగా దేశమంతటా చెక్కించాడు. ప్రజలు తమకు నచ్చిన మతాన్ని అవలంబించుకునే సంపూర్ణ స్వేచ్ఛను ఇచ్చి, మతసహనం పాటించిన ఆదర్శ ప్రజా పాలకుడు.

కళింగ యుద్ధంలో జరిగిన జనహననాన్ని చూసి చలించిపోయి, పశ్చాత్తాపంతో దుఃఖాగ్నిలో ఆయన పునీతుడయ్యాడు. తనమీద తాను యుద్ధం ప్రకటించుకుని ధర్మ విజేతయైనాడు. ధర్మానికి ప్రతీకగా, ధర్మానికి పర్యాయపదంగా నిలిచాడు. చండాశోకుని చరిత్ర ప్రపంచం మరిచిపోయేలా నడుచుకున్నాడు. కనుకనే 'అశోకుడేలిన ధర్మప్రదేశం– బుద్ధుడు వెలిసిన శాంతిదేశం' అని కవులు ప్రస్తుతించారు.

వేల సంవత్సరాలు గడిచినా అశోకునిలోని బహుముఖ ధర్మలక్షణాలు, ప్రజా పాలనా విశిష్టతలు, నాటికీ నేటికీ ఏనాటికీ ధృవతారలుగా మార్గం చూపుతూనే వుంటాయి. కారణం–మానవాళి చిర నిరంతర తత్వాన్వేషణ, ఆర్తి, ఆకాంక్షలు బౌద్ధంగా విలసిల్లాయి. మానవునికి పుట్టుకతో వచ్చే స్వాభావికమైన నిర్మలత్వం, సహజ స్వభావాలు మలినం కాకుండా వాటిని పెంపొందించుకునేందుకు పంచశీల, అష్టాంగ మార్గాలను అందించింది బౌద్ధం. మానవీయత అనేది కేవలం మానవ సమూహానికే పరిమితం కాక, సకల జీవ జాలానికి సంబంధించినదిగా వుండాలనే విశాలభావనను చాటి చెప్పింది బౌద్ధం.

అశాంతిమయమైన జగతికి అవసరమైన కరుణ, ప్రేమ, త్యాగం బౌద్ధంలో వున్నాయని అశోకుడు గ్రహించాడు. తన యావత్ శక్తియుక్తులను, రాజ్య సంపత్తినే కాక కుమారుడు, కుమార్తెలను కూడా సమాజశ్రేయస్సుకి అంకితం చేసిన మానవోత్తముడు. త్రిశరణాలను భరతావనిలోనే కాక, ఆసియా అంతటా మారుమ్రోగేలా చేశాడు. జాతి ప్రజలు సాగించాల్సిన సత్యమార్గాన్ని, చేరవలసిన గమ్యాన్ని దిశానిర్దేశం చేసిన ధర్మదార్శనికుడు అశోకుడు. మానవీయ ఆచరణకు అనుగుణ్యమైన ధర్మచింతనను సమాజ ప్రధాన స్రవంతిలోకి ప్రవహింపజేసిన వ్యక్తులనెన్నడూ ప్రజలు మర్చిపోరు. అటువంటి అరుదైన వ్యక్తులలో అగ్రగణ్యుడు అశోకుడు. ఆ మహనీయుడు ప్రజల హృదయాల్లో, దేశ చరిత్రలో చిరస్థాయిగా నిలిచి వుంటాడు. ఆ మహనీయునికి బుద్ధభూమి అక్షర నివాళి అర్పిస్తుంది.

* * *

బుద్ధభూమిని అశోకునిపై ప్రత్యేక సంచికగా తీసుకురావాలనే ఆలోచనకు శ్రీకారం చుట్టిన వ్యక్తి శ్రీకృష్ణార్జునబోధి గారు. మొదటగా బొర్రా గోవర్ధన్ గారితో ఈ విషయం చెప్పారు. తర్వాత అన్నపరెడ్డి బుద్ధఘోషుడుగారికి చెప్పగా, ఆయన ఎంతో సంతోషం వెలి బుచ్చారు. సంపాదకవర్గ సభ్యులు, పత్రిక శ్రేయోభిలాషులు తమ హర్షామోదాల్ని తెలిపారు.

అశోకునిపై వివిధ కోణాల్లో వ్యాస సంచిక తెలుగులో రావడం బహుశా ఇదే ప్రథమం

కావచ్చని పలువురు మిత్రులు అభిప్రాయ పడ్డారు. ధర్మదీపం ఫౌండేషన్ వ్యవస్థాపకులు, పెద్దలు చెన్నూరు ఆంజనేయరెడ్డిగారికి విషయం తెలుపగా– "అశోకునిపై ప్రత్యేక సంచిక చాలా మంచి ఆలోచన, వ్యయం గురించి ఆలోచించవద్దు, దాని విషయం నాకు వదిలి, సంచిక రాశి– వాసిలో నాణ్యతగా వచ్చేలా దృష్టి పెట్టండి" అని చెప్పారు. వారు చెప్పిన మాటలు మాకు కొండంత ధైర్యాన్ని, ఉత్సాహాన్ని కలిగించాయి. అడగందే అమ్మయినా పెట్టదని లోకోక్తి. కానీ ఆంధ్రా అశోకుడైన ఆంజనేయరెడ్డిగారు మేము అడగకుండానే అభయమిచ్చారు. ఇంత సైజులో, ఈ రూపంలో ఈ ప్రత్యేక సంచిక రావడానికి ప్రధాన కారణం– ఆయన వితరణ హృదయమే.

ఇక ప్రత్యేక సంచిక రూపురేఖలకు కావలసిన సరంజామాల గురించి గోవర్ధన్ గారితో శ్రీకృష్ణార్జునబోధిగారు సెల్‌ఫోన్‌లో యుద్ధం ఆరంభించారు. అది ఎడతెరిపిలేని జడివానలాంటి యుద్ధం. బోధిగారికి ఒక చెవికి వినికిడి లోపముంది. అయినా ఎక్కడా మినహాయింపు లేకుండా అదే ధ్యాసతో నిరంతరం సంభాషణలు జరిపేవారు. గోవర్ధన్ గారు కూడా ఇదే పద్ధతి. ఈ అక్షరయజ్ఞం దిగ్విజయంగా పూర్తి చేయాలనే తలంపుతో ఇరువురూ తపన పడ్డారు. రచయితల నుండి వ్యాసాల కోసం ఎంతో కుతూహలంతో ఎదురు చూడటం, అవి అందగానే జిరాక్సులు తీయించి వెంటనే గోవర్ధన్‌గారికి కొరియర్‌లో పంపించడం, మరలా ఆ వ్యాసాలపై యధాప్రకారం చర్చలు జరిగేవి. పత్రిక ఒక స్థాయిలో రావాలనే ఆలోచనతో నిత్యం అదే వ్యాపకంతో వుండేవారు. ఇదంతా ఒక పక్క...మరోపక్క గోవర్ధన్ గారు పత్రికకు కావలసిన రచనలు చేస్తూనే–వ్యాసాల కోసం రచయితలతో ఫోన్‌లో నిత్య సంబంధాలు, ఇంటర్నెట్‌లో అశోకుని గురించి సమాచారం, బొమ్మలు, శాసనాలు వగైరాల కోసం అన్వేషణ. కావాల్సిన అంశాలపై రచయితలతో రాయించడానికి గంటల తరబడి సెల్‌ఫోనుల్లో చర్చలు...వివరణలు.. విశ్లేషణలు...ఇలా మూడు నెలలపాటు ఎంతో శ్రమించారు.

ప్రముఖ బౌద్ధ పండితులు శ్రీ ఎస్.వీరనారాయణరెడ్డిగారు ఈ సంచిక గురించి ఎంతో ఆసక్తిగా గోవర్ధన్‌గారితో అనేకసార్లు ఫోన్‌లో మాట్లాడారు. అశోకునిపై ఇంగ్లీషులో వున్న పుస్తకాలు, రిఫరెన్స్ కోసం కావల్సిన సమాచారం గోవర్ధన్ గారికి అందించి, తగు సూచనలు, సలహాలు ఇచ్చారు. ఏ అంశాలపై వ్యాసాలు వస్తున్నాయో అడిగి తెలుసుకుంటూనే, కొన్ని వ్యాసాలలో కలిగే పలు సందేహాలను నివృత్తి చేయడంలో ఎంతో ఓపిగ్గా భాగస్వాము లయ్యారు. వృత్తిని– ప్రవృత్తిని ఒకటిగా చేసుకున్న ప్రముఖ బౌద్ధ రచయిత, రాష్ట్ర పర్యాటక శాఖ ప్రత్యేకాధికారి డా॥ఈమని శివనాగిరెడ్డిగారు అశోకుని పూర్తి శాసనాలను అందించ డంతో పాటు, విలువైన చిత్రాలను పంపించారు.

మా అభ్యర్థనను మన్నించి వ్యాసాలు పంపించిన రచయితలకు, గేయాలు, కవితలు, పద్యాలు పంపిన కవులకు ధన్యవాదాలు. పత్రికకు విరాళాలందిస్తున్న దాతలకు, చందాలను చేర్పిస్తున్న శ్రేయోభిలాషులకు, చందాదారులకు, బౌద్ధమిత్రులందరికీ ధమ్మవందనాలు. మా శక్తిమేరకు శ్రమించి ఈ సంచికను మీ ముందుంచాం. దీనిపై మీ అభిప్రాయాలను అవి ఎలాంటివైనా ఉత్తరాలు, ఈమెయిల్ ద్వారా తెలియజేయ వలసిందిగా మనవి చేస్తున్నాం.

**–గోలి సీతారామయ్య,** వర్కింగ్ ఎడిటర్
సెల్ : *99491 45650*

# దేవానాం ప్రియుడు అశోకుడు



దేవానాంప్రియము అంటే మేక, దేవానాం ప్రియుడు అంటే మూర్ఖుడు- మీరు ఏ ప్రామాణిక తెలుగు నిఘంటువును (శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు) తెరిచినా మీకు ప్రత్యక్షమయ్యే అర్థం ఇదే. దేవానాం ప్రియ అంటే దేవతలకు ప్రియమైన వాడు అని అర్థం చెప్పాలి. మరి మూర్ఖుడు అని ఎందుకు చెప్పారు? కారణం అశోకుడు బౌద్ధుడు. బౌద్ధం మీది ద్వేషంతో బ్రాహ్మణ వర్గం రాసిన కుటిలరాత అది.

నిజంగా అశోకుని లాంటి చక్రవర్తి ప్రపంచ చరిత్రలో మరొకరు కానరాడు. అలాంటి చక్రవర్తి పేరును పురాణాలు భారతదేశాన్ని ఏలిన వందలాది చక్రవర్తుల జాబితా నుంచి తొలగించాయి. రాజులందరి పేర్లుంటాయి కాని, అశోకుని పేరు మాత్రం ఉండదు. బౌద్ధం మీది బ్రాహ్మణ ద్వేషం చరిత్రనే తప్పుదోవ పట్టించింది.

మహాచక్రవర్తులు ప్రపంచంలోనే ముగ్గురే ముగ్గురంటాడు హెచ్.జి.వెల్స్ (?) అలెగ్జాండర్ ది గ్రేట్, అశోకా ది గ్రేట్, అక్బర్ ది గ్రేట్ ఆ ముగ్గురు. అంతటి అశోకా ది గ్రేట్‌ని జంబూద్వీప చరిత్ర నుంచే తీసివేశాయి బ్రాహ్మణ పురాణాలు.

అంతటి మహాచక్రవర్తి వెలుగు చూసిన తీరు గూడ అనేక యాదృచ్ఛిక సంఘటనల మీదే ఆధారపడింది. అశోకుని చరిత్ర వెలుగు చూసిన తరువాతే, భారతదేశ చరిత్రకు ఒక స్థిరమైన పునాది లభించింది. అశోకుడు ఏలిన సంవత్సరాలు ఆధారంగా, అటు ముందుకు, ఇటు తరువాతకు జరిగిన చారిత్రక సంఘటనలకు తేదీలు నిర్ణయించడం మొదలు పెట్టారు. అంతకు ముందు భారత చరిత్ర అతుకుల బొంత. రామాయణ భారతాదుల కాలం చెప్పమంటే కొన్ని వేల సంవత్సరాలు అటు ఇటు చెబుతుంటారు. భారతీయ మునులకు, దార్శనికులకు కావలసింది సత్యం తేదీలు కావు, రామరావణ యుద్ధం జరిగిన లగ్నాన్ని గురించి ఆలోచించారు. ఆ సంవత్సరాన్ని గురించి పట్టించుకోలేదు. బుద్ధుని జీవితాన్ని గురించి మనకు వివరాలు చాలా తక్కువ లభిస్తాయి. ఆయన బోధనల గురించి లభించే వివరాల కన్నా బుద్ధుని కాలం గూడ అశోకుని కాలం ఆధారంగానే నిర్ధారితమైంది.

దాదాపు 2000ల సంవత్సరాలుగా విస్మృతమైనా అశోకుని పేరు ఎలా బయటకు వచ్చింది? 1837కు ముందు అశోకుని శిలాశాసనాలు బ్రాహ్మీ లిపిలో లిఖితమై లభిస్తున్నాయి. కాని గమ్మత్తు ఏమిటంటే అవి అశోకుని శిలాశాసనాలని ఎవరికీ తెలియదు. దీనికి రెండు కారణాలున్నాయి. ఒకటి అవి మాగధి ప్రాకృతంలో బ్రాహ్మీ లిపిలో రాయబడ్డాయి. ఆ భాష తరువాత అంతరించింది. ఆ లిపిని చదవడం గూడ ఎవరి వల్ల కాలేదు. అంతేకాదు ఆ శాసనాల్లో ఎక్కడా అశోకుడనే పేరు లేదు. దేవానాం ప్రియదస్సి రాజా ఏవంతహ (This spoke devanampriya) దేవానామ్ ప్రియరాజు ఇలా చెప్పాడు అనే శాసనాలలో ఉంది.

ముందు లిపి చదవటం తెలియాలి. దీనిని 1837లో కలకత్తాలో మింట్ ఆఫీసరుగా పని చేస్తున్న జేమ్స్ ప్రిన్‌సెప్ బ్రాహ్మీలిపి రహస్యాన్ని ఛేదించాడు. అంతా బాగానే ఉంది. ఈ దేవానాం ప్రియరాజు ఎవరో అతడు చెప్పలేకపోయాడు. ఆయన అదృష్టమో మన భారతదేశ చరిత్ర అదృష్టమో, 1836 జార్జిటర్నర్ అనే ఆంగ్లేయ అధికారి శ్రీలంకలో 'మహావంశ' అనే గ్రంథాన్ని ఆంగ్లంలోకి అనువదించాడు. అందులో అశోకుని పేరు దేవానాంప్రియతో అనుసంధితమై ఉండడంతో ఆ "రాజు" ఎవరో తెలిపోయింది. దానితో భారతదేశ చరిత్ర ఒక నమ్మదగిన విశ్వసనీయమైన తేదీ మీద నిలబడింది. క్రీ.పూ. 269-232 అశోకుడు ఏలిన కాలం. ఈ కాలం నుంచి కొన్ని ఆధారాలతో వెనక్కు లెక్క గట్టి బుద్ధుని జయంతిని క్రీ.పూ 563గా తేల్చారు. అయితే ఆ తేదీని అందరూ ఆమోదించలేదు.

అశోకుని శిలాశాసనాలు ఎన్ని లభించినా, వాటిలో అశోకుని వ్యక్తిగత జీవిత విశేషాలు ఏమీ లేవు. ఏమైనా అశోకుడంటే శ్రీలంక వాసులకు ఎనలేని అభిమానం. దీనికి కారణం శ్రీలంకకు బౌద్ధాన్ని అందించినవాడు అతడు కావడమే. ఆయన కూతురు సంఘమిత్ర, కొడుకు మహేందులను శ్రీలంకకు పంపి అక్కడ బౌద్ధవ్యాప్తికి దోహదం చేశాడు. సంఘమిత్రయే మూల బోధివృక్షం శాఖను తీసుకువెళ్ళి, శ్రీలంక అనూరాధపుర విహారంలో నాటింది. ఆ వృక్షమే నేటికీ నిలిచి ఉంది. ప్రపంచంలోని అన్ని వృక్షాల కంటె ఇదే పెద్దది (వయస్సులో) అంటారు. ఇప్పుడు మనం బోధగయలో చూస్తున్న బోధివృక్షం ఆ మూల వృక్షం కాదు. అశోకుడు తనను విస్మరించి, బోధివృక్షానికే అంకితమయ్యాడనే కినుకతో, అతడి మూడవభార్య తిష్యరక్షిత ఆ వృక్షాన్ని నరికించి వేసింది. ఇప్పుడు మనం చూస్తున్న బోధివృక్షం అసలు బోధివృక్షం సమీపంలో మొలిచిన మొలకలలో ఒకటి.

పోతే బౌద్ధంతో అంతగా పరిచయం లేని కొందరు అశోకుడు బౌద్ధుడేకాని, అసలు ఆయన దీక్ష తీసుకొన్నాడా? దీక్ష తీసుకోకుండానే బౌద్ధస్ఫూర్తితో రాజ్యపాలన చేశాడా? అని నన్ను ప్రశ్నించారు మరి కొందరు, దీక్ష తీసుకొంటే ఎప్పుడు తీసుకొన్నాడు? కళింగ యుద్ధానికి ముందా, వెనకా! ఏ తేదీన తీసుకొన్నాడు? విజయదశమినాడా? ఇలా అనేకమంది అనేక రకాలుగా ప్రశ్నించారు. ఇప్పుడు మనకు లభిస్తున్న పాళీ సాహిత్యం- మహావంశ, దీపవంశ వీటి అట్టకథలు (వ్యాఖ్యానాలు) వినయ పిటక మీద బుద్ధఘోషుడు రాసిన సమంత ప్రాసాదిక గాని, ఇంక చైనా యాత్రికులు రాసిన గ్రంథాలు గాని, అశోకుడు రాయించిన శిలాశాసనాలు గాని- ఏవీగూడ అశోకుని వ్యక్తిగత జీవిత విశేషాలను తెలియజేయవు. వాటి నిండా నమ్మశక్యం గాని కట్టుకథలు ఉన్నాయి. వాటి ఆధారంగా పై ప్రశ్నలకు ఇదమిత్థమైన సమాధానాలు చెప్పలేము.

శిలాశాసనాలు ఆయన 34వ యేట క్రీ.పూ 269లో పట్టాభిషిక్తుడయ్యాడని తెలుపుతున్నాయి. 13వ శిలా శాసనంలో, దేవానాంప్రియ పట్టాభిషిక్తుడైన ఎనిమిదో సంవత్సరంలో కళింగను జయించాడు అని ఉంది. దీనిని బట్టి క్రీ.పూ 261లో కళింగ యుద్ధం జరిగినట్లు అర్థమవుతుంది. కొంతమంది క్రీ.పూ 265 అన్నారు. ఆ శాసనం దేవానామ్‌ప్రియ పడిన మానసిక క్షోభను వివరంగా వర్ణించింది. కళింగ విజయం ఒక విజయం కాదన్నాడు. ధర్మవిజయమే విజయం అన్నాడు.

అశోకావదాన ప్రకారం- సముద్రం అనే పేరుగల ఒక యవపర్యాటక భిక్కు ఏమరుపాటున రాజుగారు నిర్మించిన హింసా గృహంలోకి ప్రవేశించి, అక్కడి హింసను చూసి చలించి, శరీరం అనిత్యమని, నీటి బుడగ అని గ్రహించి, తన జన్మకిది అంతమని గ్రహించి, ఆద్యంత అయి, తాను విసరివేయబడిన అగ్నిగుండంలోంచి పద్మాసనంతో పద్మం మీద కూర్చొని బయటకు

వచ్చాడు. ఈ అద్భుతాన్ని విన్న అశోకుడు హింసాశాలకు వచ్చి, సముద్రుని నుంచి బుద్ధవచనం విని, అక్కడికక్కడే బుద్ధుని, ధమ్మాన్ని, సంఘాన్ని శరణ పొందాడని ఒక కథ. మరొక కథ ప్రకారం అంతోసారాన్ని (Inner essence) అన్వేషిస్తూ, అశోకుడు కలిసిన అనేకమంది భిక్షులతో సామణేర నిగ్రోధను కలిసినప్పుడు "అప్రమత్తత అమర్త్యతకు దారి తీస్తుంది, ప్రమత్తత మృత్యువుకు" అని ఆ సామణేర పలుకులతో అశోకునికి నూతన దర్శనమైంది. అదే క్షణంలో అశోకుడు బుద్ధుని, ధమ్మాన్ని, సంఘాన్ని శరణుజొచ్చాడు. ఆ సామణేర భిక్షు నిగ్రోధ అశోకునిచే హతుడైన అన్న కొడుకే అని తరువాత తెలిసింది.

అయితే ఈ కథలను బట్టి మనం అశోకుడు ఎప్పుడు దీక్ష తీసుకొందీ, కళింగ యుద్ధానికి ముందా, తరువాత విజయదశమినాడా, మరొక రోజా అనేది చెప్పలేము.

లక్షలాదిమంది నిహతులను చేసిన, వికలాంగులను చేసిన, బందీలను చేసిన శోకం లేని అశోకుని హృదయాన్ని కలతపెట్టి, అతనిని పూర్తిగా మారిన మనిషిగా చేసిన ఆ కళింగ యుద్ధం ఎప్పుడు జరిగిందో తెలిసింది గాని, ఆ యుద్ధంలో పాల్గొన్న కళింగరాజు ఎవరు? అతని నామధేయం ఏమిటి? అనే విషయాలు ఇంతవరకు చరిత్రకారులకు తెలియరాలేదు. అంతగా జరిగిన మహా యుద్ధంలో ఒక రాజు పేరు తెలిసింది గాని రెండో రాజుపేరు తెలియలేదు. ఇది చరిత్రకారులకు పురాశాస్త్రవేత్తలకు పెనుసవాలు.

## మూడో సంగీతి

అశోకుడు ధర్మస్వీకారం చేశాక, ఒకసారి తన రాజ్యంలోని బౌద్ధమత పరిస్థితి ఎలా ఉందో పరిశీలించాడు. బౌద్ధ ధమ్మానికి ఆయువు పట్టు అయిన భిక్షు సంఘం గాడి తప్పి నడుస్తున్నది. భిక్షువులెవరు ఉపోసధను పాటించడం లేదు. వినయం ప్రకారం నెలకు నాలుగు సార్లు నెలలో 8, 15, 22, 30 తేదీలలో ఒక ప్రాంతంలోని భిక్షులంతా దాని కేంద్రస్థానంలో కలిసి, ఆయా వారాలలో తాము చేసిన మంచి చెడులను గురించి తాము గావించిన అకృత్యాల గురించి, నైతికంగా పతనమైతే ఆ పతనాల గురించి నలుగురిలో ప్రకటించి పశ్చాత్తాపం ప్రకటించి, అవసరమైతే దండనను స్వీకరించి, తమను తాము సరిదిద్దుకొంటారు. ఇదీ ఉపోసధ పర్వదినాలలో జరిగేది. ఈ ఉపోసధలను భిక్షువులు పాటించక పోవడాన్ని, తాను కల్పించిన సౌకర్యాలతో వారు సోమరులు కావడాన్ని అశోక చక్రవర్తి గమనించాడు. అంతేకాదు భిక్షులు బౌద్ధధర్మానికి తప్పుడు వ్యాఖ్యానాలను చేయడాన్ని గూడ ఆయన చూచాడు. ఇక ఏ మాత్రం ఉపేక్షించ రాదనుకొన్నాడు.

ఆ వెంటనే తన హితాభిలాషి, గురువు అయిన మొగ్గల పుత్తతిస్స మహాథేరతో చర్చించి బౌద్ధ భిక్షులను క్షాళనం చేయాలనుకొన్నాడు. ఫలితంగా పాటలీపుత్రంలో మూడో బౌద్ధ సంగీతి జరిగింది. భిక్షులను రావించారు. వారిని పరిశీలించారు. పరీక్షించారు. కొందరు పెడసరంగా జవాబులు చెప్పారు. తాము చెప్పిందే బౌద్ధం అన్నారు. అటువంటి వారినందరిని బౌద్ధం నుంచి సాగనంపారు. ఈ సంగీతిలో లేవనెత్తిన ఐదువందల ప్రశ్నలను, వాటికి సమాధాలను ఏర్చి కూర్చి "కథావత్తు" ను మొగ్గలి పుత్తతిస్స ప్రకటించారు. ఈ సంగీతిలోనే త్రిపిటకాలలో మూడోదైన అభిధమ్మ పిటక నిర్మితి గూడ జరిగింది. అభిధమ్మం అంటే ఉన్నత ధర్మం. అంతకు ముందర ఉన్న పిటకాలలో బీజరూపంలో ఉన్న బౌద్ధ ధర్మ సూక్ష్మంశాలను తీసుకొని విపులీకరించడం జరిగింది.

ఈ విధంగా అశోకుడు ఏర్పాటు చేసిన మూడో బౌద్ధసంగీతి అవాంఛనీయ అంశాలను పోకడలను ఏరివేసి, బౌద్ధాన్ని ఒక స్థిరప్రాతిపదికపై నిలిపింది.

బుద్ధుడు చెప్పిన దశరాజ విధులను (దాన, శీల, పరిత్యాగ, అజ్జవ (నిజాయితీ) మద్దవ (దయ,మృదువు) తపస్సు, అక్రోధ, అహింస, క్షాంతి, అవిరోధాలు) ధైర్య సాహసాలతో తన రాజ్యపాలనలో అమలు చేసిన, కనీసం ఒక చక్రవర్తి అయిన చరిత్రతో నిలిచి ఉన్నాడనే సాంత్వనంతో మానవత ఉన్న ప్రతి మనిషి ఆనందిస్తాడు.

అశోక ధమ్మవిజయం ఎప్పుడు జరిగినా, అది అక్టోబరు మాసంలో దసరాకే జరిగినా, జరగకపోయినా, విజయదశమినాడే జరిగినా, జరగక పోయినా, ఏదో ఒకనాడు జరిగిందనేది నిర్వివాదాంశం. ఆ రోజు ఏదైనా అటువంటి మహాచక్రవర్తి ప్రతీకగా నిలిచిన ధమ్మ పాలనను మననం చేసుకొందాం.

ఇటీవల కొంతమంది బౌద్ధపండితులు, నవబౌద్ధ నిర్మాత డా॥అంబేద్కర్, ఆచార్య గోయెంకాలాంటి కొందరు అశోకుడు విజయదశమినాడు దీక్ష తీసుకొన్నాడన్నారు. ఇటువంటి ఒక విజయదశమి నాడు దీక్ష తీసుకొన్నట్లు ఏ పాళీ గ్రంథంలోను, అటు శ్రీలంక దీపవంశ, మహావంశ గ్రంథాలలో గాని, అశోకావదానంలో గాని నాకు తెలిసినంత వరకు ఎదురు కాలేదు. మరి అంతగా బౌద్ధాన్ని మథించిన, అంబేద్కర్, గొయెంకా గార్లు తాము ఆ నిర్ణయానికి ఎలా వచ్చారో, ఏ మౌలిక గ్రంథం లేదా శిలాశాసనం లేదా ఇంక ఏ ప్రాచీన గ్రంథం ఆధారంగా అలాంటి నిర్ణయం చేశారో, ఆ సాక్ష్యాలను ప్రకటించలేదు.

అయితే అంబేద్కర్ మహాశయులు, అశోకుడు విజయదశమి రోజుననే ధర్మ స్వీకారం చేశాడని భావించి, తాను 1956 అక్టోబరు విజయదశమినాడే 5,00,000ల మందితో ధర్మస్వీకారం చేశారు. నాటినుంచి భారతదేశంలోని అంబేద్కరీయులంతా విజయదశమినే దీక్షాదినంగా భావించి వేడుకలు జరుపుకొంటున్నారు.

విజయదశమి- రాముడు రావణుని జయించిన పండుగ. దుర్గ మహిషాసురుని జయించిన పండుగ. విజయుడు (అర్జునుడు) జమ్మిచెట్టు మీద నుంచి అస్త్ర శస్త్రాలను క్రిందికి దించిన పండుగ. చెడును మంచి జయించిన పండుగ. కాని అశోక ధర్మవిజయం అలాంటి పండుగ కాదు. అది అశోకుడు ఎవరినో జయించిన పండుగ కాదు. తనను తాను జయించిన పండుగ. ఇతరులను జయించినవాడు నిజమైన విజేత కాడు. తనను తాను జయించినవాడే నిజమైన విజేత. అశోకుడు అటువంటి విజేత. నిజమైన విజేత. ఆ విధంగా చూస్తే రాముడు, దుర్గ, విజయులు ఎవరూ గూడ నిజమైన విజేతలు కాదు. వీరెవ్వరూ అశోకునికి సాటిరారు.

అశోకుడు ధర్మాన్ని స్వీకరించడాన్ని అశోకధర్మ విజయంగా పేర్కొనవచ్చు గానీ, అశోక విజయదశమిగా పేర్కొనడానికి వీలులేదు. విజయదశమి అసలు మౌలికంగా హిందువుల పండుగ. శ్రీరామ విజయం, దుర్గా విజయం లాంటి విజయాలను అధర్మంపై ధర్మం జయించిన వేడుకలుగా జరుపుకొంటారు. అశోకుని ధర్మ స్వీకార విజయంలో దేవతల, దయ్యాల, వీరుల, యుద్ధాల ప్రసక్తి లేదు.

ఎవరైనా బౌద్ధ ధర్మ స్వీకారం చేస్తే ఒక బౌద్ధ పండుగ రోజున చేస్తారు. ప్రతిపూర్ణిమ బౌద్ధులకు పండుగే. అలాంటప్పుడు అశోకుడు విజయదశమినాడు ఎందుకు ధర్మ స్వీకారం చేస్తాడు? పౌర్ణమి రోజున చేయాలి కాని.

ఏదైనా కాదనరాని సాక్ష్యం లభించేవరకూ, అశోకుని ధర్మ స్వీకారంపై చేసేవన్నీ వట్టి ఊహలే. అంతవరకు వివృత మనస్కులమై (open minded) ఉందాం.

❈

–అన్నపరెడ్డి బుద్ధఘోషుడు

సెల్ : 94412 74960

# అశోకుని శాసనాలు- మానవత్వ ప్రతీకలు

-డా॥ రాయదుర్గం విజయలక్ష్మి

**మేత్తం చ సబ్బ లోకస్మిం మానసం భావయే అపరిమాణమ్**
**ఉద్ధం అథోచ తిరియం చ అసంబాధం, అవేరమసపత్తమ్॥** (కరణీయ మెత్తసుత్త-8)

-సమస్త విశ్వశాంతికై అపరిమితమైనది, అమోఘమైనది, ద్వేషరహితమైనది, శతృత్వము లేనిది అయిన మైత్రీ భావనను పెంపొందించుకో- అన్న మైత్రీ సూత్రాన్ని చెప్పిన బౌద్ధంలోని మానవత్వాన్ని ఆచరణ సులభం చేసిన అశోక చక్రవర్తి క్రీ.పూ. 304లో భారతదేశంలో జన్మించాడు. తన 36వ యేట రాజ్యపాలన చేపట్టిన అశోక చక్రవర్తి, 38సం॥రాలు రాజ్యపాలన చేసి క్రీ.పూ. 232లో కీర్తి శేషుడయినాడు.

క్రీ.పూ. ఆరవ శతాబ్దం, మనిషిని మనిషిగానే గుర్తించి, గౌరవించి, మానవాభ్యుదయానికి పాటుబడిన మహా మానవుడు అయిన బుద్ధుని ఈ ప్రపంచాని కందించగా, క్రీ.పూ. మూడవ శతాబ్దం, ఆ బుద్ధుడుపదేశించిన సద్ధర్మాన్ని స్వయంగా ఆచరించడమే గాక, ఆ ధర్మాచరణ ద్వారా తాను పొందిన చిత్తశాంతిని, తన ప్రజలందరూ పొందాలనే మానవతా ధ్యేయంతో తన రాజ్యమంతటా శాసనాలు చెక్కించిన అశోక చక్రవర్తిని మనకందించింది.

ప్రాచీన బౌద్ధ సాహిత్య గ్రంథాలైన అవదాన కల్పలత (దివ్యావదాన, అశోకావదాన యితివృత్తాలు) మహావంశం- వలన చండాశోకుడుగా, కౄరాశోకుడుగా భావింపబడుతున్న అశోక చక్రవర్తిలోని కరుణ, త్యాగాల సమ్మిశ్రిత రూపమైన మానవత్వాన్ని అద్దంపట్టి చూపిస్తాయీ శాసనాలు. క్రీ.పూ. మూడవ శతాబ్దంలో భారత దేశాన్నేలిన అశోకుని సామ్రాజ్యం నేటి నేపాలు, పాకిస్తాను, ఆఫ్ఘనిస్తాన్‌లకు వ్యాపించి వుండేదని అక్కడ దొరికిన శాసనాలు చెబుతున్నాయి.

తాను పట్టాభిషిక్తుడైన ఎనిమిదవ సం॥రం కళింగ యుద్ధం చేసిన అశోకుకు తాను పొందిన విజయానికి సంతోషించడానికి బదులు, ఆ యుద్ధ బీభత్సాన్ని చూచి దుఃఖావేదనను పొందాడు. బౌద్ధ భిక్షువైన ఉపగుప్తుని వలన బౌద్ధ ధర్మాన్ని స్వీకరించి, తర్వాత మూడు దశబ్దాల పాలనను సద్ధర్మాచరణతో పరిఢవిల్లజేశాడు. కళింగ యుద్ధానికి రెండు సంవత్సరాలకు మునుపే అశోకుడు బౌద్ధధర్మం పట్ల ఆసక్తి పెంచుకున్నాడని చరిత్ర చెప్పే సాక్ష్యాలు కూడా అశోకుని మానసిక పరివర్తనకు బౌద్ధం తోడ్పడిన అంశంగానే మనం గ్రహించాలి.

దేవానాంపియ, పియదస్సి అనే పేర్లతో మాత్రమే వెలువడిన శాసనాలు, తర్వాత క్రీ.పూ.1915లో ఢిల్లీ శాసనంలో ఉన్న పియదస్సి అశోక చక్రవర్తి అనే పేరును గుర్తించడం వలన, పియదస్సి అంటే అశోక చక్రవర్తేననే నిజాన్ని చరిత్రకారులకు వివరించాయి.

"ప్రపంచ చరిత్రలో లక్షలాది చక్రవర్తులు కన్పించినా, ఎవరితోనూ పోల్చడానికి వీల్లేని ప్రత్యేకంగా ప్రకాశించే నక్షత్రం అశోక చక్రవర్తి మాత్రమే"(H.G.Wells) అని ప్రఖ్యాతి పొందడానికి యీ శాసనాలే ఆధారం.

దాదాపు మూడు పదులకు పైబడిన అశోకుని శాసనాలలో, శిలా శాసనాలు (పెద్దవి+చిన్నవి) స్తంభ శాసనాలు (ఇనుము, రాగి, మొ॥లోహములతో చేసినవి) కూడా ఉన్నాయి. స్థూలదృష్టితో పరిశీలించినపుడు ఈ శాసనాలలో రెండు ప్రధాన అంశాలను గమనించగలం. మొదటిది అశోకుని మతదృష్టి. బౌద్ధాభిమానం, పరమత సహనంతో కూడిన మతదృష్టి. రెండవది, బౌద్ధం

ఉపదేశించిన మానవతావాదం. కానీ సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే, మనిషి మానవతావాదిగా మారే క్రమంలో బౌద్ధధర్మ సహకారాన్నీ; అటువంటి మానవతామూర్తి అయిన మనిషి వలన సమాజాని కెంత ప్రయోజనం కలుగుతుందో చెప్పే ఏకైక అంశమే యీ శాసనాలన్నిటా కనిపిస్తుంది. అశోకుని రాజ్యపాలన, ప్రజల్ని చూసుకున్న తీరు, సద్ధర్మాచరణ వలన కలిగే లాభాలు, పెద్దల పట్ల చూపించవలసిన గౌరవం, మున్నగు విషయాలు వెరసి, మనిషికి ఉండవలసిన సామాజిక బాధ్యతల్ని యీ శాసనాలు వివరిస్తాయి. ముప్పైయెనిమిది సంవత్సరాలు పాలనలో మొదటి ఆరేళ్ళు వదిలి పెట్టినా, బౌద్ధధర్మ పరిచయానంతరం సాగిన ముప్పైరెండేళ్ళ పాలనలో, "బౌద్ధం అంటే ఒక జీవన విధానమే" అని అశోకుడు నిరూపించిన విధానానికి యీ శాసనాలు సాక్ష్యాలు పలుకుతున్నాయి.

బౌద్ధతత్వాన్ని గురించి అశోకుని శాసనాలు వివరించవు. కాని బౌద్ధధర్మం ఆచరణీయ జీవన విధానమని చెబుతాయి. బౌద్ధం చెప్పే మహా కరుణను ఆచరించే విధానాన్ని చెబుతాయి. వందలాది జంతువులను ఆహారార్థం సంహరించే తన వంటశాలలో, ఇక మీదట మూడు జంతువులు, రెండు లేళ్ళు, అప్పుడప్పుడు ఒక్క జింకను మాత్రమే వధించాలనీ, భవిష్యత్తులో యీ జంతువధ కూడ నిషేధింపబడుతుందని, పండుగలలో జరిగే జంతుబలిని గమనించి, తాను కొన్ని పండుగలను జరుపుకునేందుకు మాత్రమే అనుమతినివ్వడం జరిగిందని (శిలాశాసనం-1) చెప్పే అశోకుడు, అహింసకు ఇచ్చిన ప్రాధాన్యం గమనింపదగినది.

మనుష్యులందరూ సమానమనడమే గాదు, మనుష్యులతో బాటు పశుపక్ష్యాదులు ప్రాణరక్షణ, ఆరోగ్య పరిరక్షణ కూడ మన బాధ్యతే అన్న విషయాన్ని గుర్తుచేస్తాయి యీ శాసనాలు.

తన రాజ్యంలోనే గాక, చోళ, పాండ్య, కేరళ, సింహళ, గ్రీకు మున్నగు పొరుగు రాజులు కూడ రెండు రకాల రోగ నివారణ పద్ధతుల్ని అనుసరించాలని అశోకుడు రెండవ శాసనంలో విజ్ఞప్తి చేశాడు. మొదటిది మనుష్యుల రోగ నివారణ పద్ధతికాగా, రెండవది మానవేతరాలైన పశుపక్ష్యాదుల రోగ నివారణ పద్ధతి. దీనికై తాను స్వయంగా చికిత్సాలయాలను నిర్మించడమే గాక, ఔషధ మొక్కలు, వేళ్ళు, పువ్వులు తగినంతగా దొరకనపుడు, వాటిని దిగుమతి చేసుకోవాలని, తన రాజ్యంలో ఔషధ మొక్కల్ని సాగు చేస్తానని చాటాడు. బాటల ప్రక్కన బాటసారులకు నీడనిచ్చేవి, పక్షులకు ఆశ్రయమయ్యేవి అయిన రావి, మర్రి, మొదలగు మొక్కలను నాటించడమే గాక, యెనిమిది క్రోసుల దూరంలో నీటి వసతికై బావులు త్రవ్వించడం, బాట సారుల ఆకలి తీర్చేందుకు మామిడి తోటల్ని పెంచడం, విశ్రాంతి గృహాల్ని నిర్మించడం (శి.శా.-2, స్తంభ శాసనం- 7) వంటివి మానవత్వానికి అచ్చమైన ఉదాహృతులు కావా!?

తన ప్రజలు తల్లిదండ్రుల్ని గౌరవించాలని స్నేహితులు, ఇరుగు పొరుగువారు, బంధువులు, బ్రాహ్మణులు, ఋషుల పట్ల ఔదార్యంతో ప్రవర్తించాలని పరిమితంగా ఖర్చు చేయాలని, వీలైనంత పొదుపు చేయాలని (శి. శా.-3) చెప్పడమే గాదు, యాత్రల ప్రాముఖ్యాన్ని కూడ వివరించాడు. తన క్రింది ఉద్యోగులు, ప్రాంతీయాధికారులు. రాష్ట్రాధికారులు సంవత్సరాని కొకసారి తప్పక దేశయాత్రలు చేయాలని తద్వారా ప్రజల కష్టసుఖాల పట్ల అవగాహన పెరగడంతో బాటు, రాజ్యాంగ విధానాన్ని మెరుగుపరుచుకొనే అవకాశాలున్నాయని చాటే యీ శాసనం, జంతుబలిని తప్పక నిషేధించాలని కోరుతుంది.

పూర్వం రాజులు వేటాడటం కోసమో, సరదా కోసమో మాత్రమే యాత్రలు చేసేవారని, తను చేస్తున్న, ఉద్దేశించిన యాత్రలు అంతకన్నా భిన్నమైనవని అశోకుడంటాడు. బుద్ధ గయను

సందర్శించిన యాత్రలో బ్రాహ్మణులకు, ఋషులకు పెక్కు బహుమతు లిచ్చానని, వృద్ధులకు, పేదవారికి పసిడిని దానం చేశానని, మారుమూలలనున్న గ్రామీణులతో కూడ ధర్మ చర్చలు, ధర్మ ప్రసంగాలను చేయగలిగానని (శి.శా. 8) చెప్పే అశోకుడు, రాజు ప్రజలకు ఆర్థికంగా మాత్రమే కాదు, ధర్మపరంగా కూడా బలోపేతులను చెయ్యవలసిన అవసరాన్ని నొక్కి చెప్తుంది.

మనిషి చేసుకునే ఎన్నో ఉత్సవాల కన్నా, ధర్మబద్ధతతో జీవించడం వ్యక్తికీ, సమాజానికి కూడ ప్రయోజనకరంగా పరిణమిస్తుందని, సేవకులు, తన ఉద్యోగుల పట్ల బాధ్యతతో కూడిన ప్రవర్తన, గురువుల పట్ల గౌరవం, జీవజాలం పట్ల కరుణ కలిగి వుండటమే గాదు. దాతృత్వ గుణంతో భాసించడం వంటివి మనిషి జీవితంలోని నిజమైన ఉత్సవాలు (శి.శా. 4 & 9) అంటుంది అశోకుని శాసనం. సమాజంలోని ప్రతి తండ్రి, ప్రతి కొడుకు, యజమాని, స్నేహితుడు, సహోద్యోగి, ఇరుగు పొరుగువారు- ఇలా ప్రతి ఒక్కరు ఇటువంటి ఉత్సవ నిర్వహణకే ప్రాధాన్యాన్నివ్వాలని చాటుతుందీ శాసనం.

మంచి పనులు చేయటం చాలా కష్టం. మంచి చేయటం అలవాటు కాకుంటే చెడు చేయటం సులభంగా అలవాటవుతుంది. అందుకే తన ప్రజలు మంచి పనుల చేయటం పట్ల ఆసక్తి పెంచుకోవాలని కోరడమే గాదు, వారిలో మంచిని ప్రోత్సహించడానికి, వారు ధర్మబద్ధతతో జీవించేలా చేయడానికి తన రాజ్యంలో 'ధమ్మ మహామాత్రులు' అనే ప్రత్యేకాధికారులను నియమించాడు. ప్రజలు ధర్మ బద్ధతతో జీవించేలా చేయటం, పరమత సహనాన్ని కలిగివుండేలా చూడటం, ఇరుగు పొరుగు రాజ్యాల మధ్య ధమ్మమైత్రి కోసం పాటు బడటం, ప్రతివ్యక్తి తల్లిదండ్రుల్ని, పెద్దల్ని, గురువులను, స్నేహితులను, సేవకులను, సన్యాసులను, బ్రాహ్మణులను గౌరవించేలా చూడటం- ఇవన్నీ ధమ్మ మహామాత్రులు చూసుకునేవారు. (శి.శా. 5) ఈ నేపథ్యంలో సత్ప్రవర్తన గలిగిన ఖైదీలను, వృద్ధ ఖైదీలను, విడుదల చేయించడం వంటి పనులు కూడా ధమ్మ మహామాత్రుల పరిశీలనలో ఉండేది. రాజును నిరాఘాటంగా ఎప్పుడైనా కలిసి, ప్రజల సంక్షేమం కోసం దేశ పరిస్థితుల్ని గూర్చి చర్చించే అధికారం వీరికి ఉండేది. (శి.శా.6) సత్వర న్యాయం జరిగేలా చూడటం, ప్రజలకు ఆలస్యం లేకుండా అవసరాలు తీర్చడం అనే ప్రాతిపదికన జరిగిన అశోకుని పాలన, అశోకునికి తన ప్రజల పట్ల ఉన్న ప్రేమకు నిదర్శనం.

వ్యక్తిగత నీతి రాజ్యనీతి వేరు వేరు కావని, ఆ రెండూ ఒక్కటిగా వున్నప్పుడే రాజ్యం సుభిక్షంగా మనగలదని నమ్మినవాడు అశోకుడు. కాలం చెల్లిన నీతులను త్రోసిరాజని, ప్రజల సంక్షేమం కోసం తన పాలనలో ఎన్నో కొత్త ప్రశాంత రాజనీతులను ఏర్పరచుకున్నాడు. మనిషికి మాట నియంత్రణ చాలా అవసరమనీ, ప్రతి ఒక్కరిని తనతో సమానంగా ఆదరించాలని, అందరితో సమరస భావనతో మెలగాలని చెప్పే మానవతా లక్షణాలను ప్రజలకు ఉపదేశించటమే కాదు, (శి.శా.12) నిందాపూర్వకమైన మాటలను తగ్గించి, చివరకు ప్రతి విషయాన్ని, చివరకు ప్రతి నేరాన్ని కరుణ నేపథ్యంలో పరిశీలించడం, ఉరిశిక్ష విధింపబడిన ఖైదీ అయినా, తన నేరాన్ని పునఃపరిశీలన చేయవలసిందిగా విన్నపం చేసుకునే అవకాశాన్ని కలిగించడం (శి.శా. 5) వంటివి అశోకుని ఉదారబుద్ధికి ఉదాహరణలే! అతని మానవతా దృష్టికి నిదర్శనలే!

రాజ్యానికి పన్నుల రూపంలో లభించే ఆదాయాలను, ప్రజోపయోగ కార్యాలకే వినియోగింపబడినాయి అశోకుని రాజ్యంలో! తన రాజ్యంలోని ప్రతి ఒక్కరూ, ఈర్ష్యా ద్వేషాలు, కోపం, అసహ్యం, క్రూరత్వం, గర్వం వంటి చెడు లక్షణాలను విడిచిపెట్టి, తమ కర్తవ్యాల్ని తాము చక్కగా నిర్వహించాలని (కళింగ శిలాశాసనం1) కోరిన అశోకుడు, అహింస ప్రాధాన్యాన్ని

పెక్కు శాసనాల్లో చాటాడు. ఏయే రోజుల్లో పశుపక్ష్యాదులు వధింపబడకూడదో (శి.శా.5) కూడ నిర్దేశించాడు.

ఎటువంటి ధమ్మం తనకన్నా తక్కువ స్థాయిలో నున్నవారిని ఆదరించడం నేర్పుతుందో, ఎటువంటి ధమ్మం తల్లిదండ్రుల్ని, గురువులను గౌరవించడం నేర్పుతుందో, ఎటువంటి ధమ్మం అహింసాయుత జీవితాన్నిస్తుందో, ఎటువంటి ధమ్మం యిదే మనం సమాజ శ్రేయస్సు కొరకు ఆచరించవలసిన సరియైన ధమ్మం అనే ఎరుకను కలిగిస్తుందో, అటువంటి ధమ్మాన్ని మించిన మంచి బహుమతి మరొకటిలేదు. అటువంటి ధమ్మ స్నేహాన్ని మించిన స్నేహం మరొకటిలేదు. అటువంటి ధమ్మ పంపకం, ధమ్మ బాంధవ్యం కలిగిన మనిషి వలన సమాజం బాగుపడుతుంది. (శి.శా.11) అనే మాటలు, సద్ధర్మాచరణ మనిషిని సమాజ ఔన్నత్యంలో ఎలా భాగస్వామిని చేయగలదో చెప్తుంది. 'బౌద్ధం ఒక జీవన విధానం' అనేందుకు ఇంతకన్నా వేరే ఉదాహరణలు అక్కరలేదేమో!

కళింగయుద్ధం అశోకునిలో కలిగించిన మానసిక పరివర్తనను వివరించే శాసనం(శి.శా.13) యుద్ధ విజయాల కన్నా ధమ్మ విజయమే గొప్పదని చాటుతుంది. ఆలోచనా విధానాన్ని నియతిచేసి, సన్మార్గాచరణను నేర్పేశక్తి సద్ధర్మాని కెంత వుందో చెబుతుంది. తన కుమారులు, మనుమలు, మునిమనుమలు, తర్వాత వచ్చే వారు అందరూ కూడ అన్ని విజయాల కన్నా ధమ్మ విజయాన్నే గొప్ప విజయంగా భావించాలని, ఇహపరాలు రెండింటిలో శాంతి జీవనాన్ని కలిగించే ధమ్మాన్ని సహనంతో ఆచరించాలని చెప్పే అశోకుడు, తాను చేసిన పనులన్నీ- దారి పక్కన మొక్కలు నాటించడం, మొదలగునవన్నీ ఎందరో పూర్వరాజులు చేసి వుండవచ్చునీ, కాని తానీ పనుల్ని తన ప్రజలు ధర్మ బద్ధులుగా జీవించడం కోసం చేశానని (స్తంభశాసనం-7) చెప్పుకున్నాడు.

తల్లిదండ్రుల్ని పెద్దల్ని గౌరవించడం, అన్య మత సహనం కలిగి వుండటం, సద్ధమ్మాచరణ పట్ల ప్రీతి, దాన ధర్మాలయందు ఆసక్తి, జీవజంతువుల పట్ల కరుణ, స్వయం శిక్షణ, సహనము, కలిగి, దుర్లక్షణాలకు దూరంగా వుండటం, అక్కరలేని జంతు బలులనిచ్చే ఉత్సవాల పట్ల అనాసక్తి కలిగి, పరస్పర గౌరవాదరాలను పెంచి, పరిమితమైన కొన్ని ఉత్సవాల పట్ల మాత్రమే ఆసక్తి కలిగి వుండటం, నిర్భీతిగా జీవించడం, అహింసను జీవన విధంగా ఎన్నుకోవడం, ప్రతి వ్యక్తి సమాజం పట్ల నిజాయితీ, కృతజ్ఞత, గౌరవంతో బాటు, సామాజిక కార్యక్రమాలు పట్ల ఉత్సాహాన్ని చూపడం- వంటి వన్నీ మనిషి బాధ్యతలుగా, మంచి సమాజ జీవనానికి మార్గాలుగా అశోకుని శాసనాలు విజ్ఞప్తి చేస్తాయి.

ప్రజలందరూ నా బిడ్డలే! వాళ్లు రాజభయం లేకుండా నిర్భీతిగా నివసించాలి. క్షమార్హులైన వారిని రాజెప్పుడూ క్షమిస్తాడని, వాళ్లను నేను సంతోష పెట్టగలననీ నమ్మాలి. (కళింగ శిలా శాసనం-2) అన్న మాటలు చాలు. అశోకుడు తన ప్రజల్లో నిర్భీతి నిశ్చింతతో కూడిన మానసిక వికాసానికి తద్వారా తన సమాజంలో మానవత్వ పోషణకు ఎటువంటి కృషి చేశాడో చెప్పడానికి!

శాసించడం కన్నా సమన్వయ మార్గంలో ప్రజల్లో మార్పు తేవచ్చునన్న సానుకూల దృక్పథానికి అశోకుని శాసనాలు గొప్ప ఉదాహరణలు. అందుకు అశోకుడు ఎన్నుకున్న మార్గం సద్ధర్మాచరణ! మనిషిని మహోన్నతునిగా మార్చగలిగిన బౌద్ధధర్మంలోని ఆర్య అష్టాంగ మార్గం, బ్రహ్మవిహారాల సత్తాను విశ్వసించిన అశోకుని సానుకూల దృక్పథం విజయోన్ముఖంగా సాగాయని యీ శాసనాలు సాక్ష్యం పలుకుతున్నాయి.

*(తరువాయి 29వ పేజీలో..)*

# మనిషిగా జీవించు మరణాన్ని జయించు

-గువ్వల కోటయ్య

మనిషికి మరణం తప్పదు. అందుకే మనిషిగా జీవించి మరణాన్ని జయించాలి. చావు పుట్టుకలు అందరికి సమానమే. ఈ చావు పుట్టుకల మధ్య కాలం జీవితం. జీవిత కాలంలో మనం చేసిన చేస్తున్న పనులను బట్టి కొందరు ఉన్నతులుగా, కొందరు హీనులుగా గుర్తించబడతారు. అందరు చేసే పనులు చేస్తూ, అందరిలా జీవిస్తూ, అందరిలా చనిపోయేవారు అందరిలానే ఉండిపోతారు. కాని అందరు చేయని పనులు, అసాధారణమైన పనులు చేయువారు అందరికన్నా భిన్నంగా జీవిస్తారు. అందనంత ఎత్తుకు ఎదుగుతారు. అందరి దృష్టిని ఆకర్షిస్తారు. అదే వారి ప్రత్యేకత. అందువల్లనే మన దేశచరిత్రలో అశోకుని చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖించబడింది.

అశోక చక్రవర్తికి ముందు తరువాత మన దేశాన్ని చాలామంది రాజులు, చక్రవర్తులు పాలించారు. వారిలో ఎక్కువమంది వారి జీవితాలను వివాదాలు, యుద్ధాలు, హింస, విలాసాలకే పరిమితం చేశారు. కత్తి పట్టిన వారు ఆ కత్తులకే బలైనారు. హింసతో ప్రారంభమైన కొందరి జీవితాలు హింసతోనే అంతమైనవి. అశోకుని చరిత్ర అందుకు భిన్నంగా సాగింది. ఆయన జీవితం హింసతో మొదలైనా హింసతో అంతం కాలేదు. జీవితంలో జరిగిన కొన్ని సంఘటనలు ఆయన్ని హింస విడిచి అహింస వెంట నడిపించినవి. మానవ జీవితం చలన రహితమైన జడపదార్థం వంటిది కాదు. చీకటి నుండి వెలుతురుకు చెడు నుండి మంచికి, హింస నుండి అహింసకు మారగల శక్తి, మార్చగల శక్తి అందరిలో ఉందని ఆయన జీవితం ద్వారా నిరూపించాడు. తన జీవితాన్ని తాను మంచి వైపు మానవత్వం వైపు జీవకారుణ్యం వైపు మలుపు తిప్పి మరికొందరి జీవితాల్లో ఆ మార్పుకోసం అవిశ్రాంతంగా తుదిశ్వాస విడుచువరకు పోరాడిన మహనీయుడు అశోకుడు. ఆయన జీవితంలో ఇటువంటి విప్లవాత్మక మార్పులు, మలుపులకు కారణం ఏమిటి? అలా ఎందుకు జరిగింది? మార్పు అనంతరం ఆయన ఎవరి కోసం దేనికోసం జీవించాడు? ఆయన జీవితం ద్వారా మనం తెలుసుకోవలసింది నేర్చుకోవలసింది, మార్చుకోవలసింది చాలా వుంది.

మన దేశాన్ని పాలించిన రాజవంశాల్లో మౌర్య వంశం ఒకటి. మౌర్య సామ్రాజ్య స్థాపకుడు చంద్రగుప్త మౌర్యుడు. ఈయన నందులను ఓడించి రాజ్యాధికారానికి వచ్చాడు. పాటలీ పుత్రం రాజధానిగా మగధ రాజ్యాన్ని పాలించాడు. ఈయన కాలం నుండే కళింగ రాజ్యం మగధ రాజ్యంలో అంతర్భాగంగా ఉంది. చంద్రగుప్త మౌర్యుని అనంతరం ఆయన కుమారుడు బిందు సారుడు రాజ్యపాలన చేపట్టాడు. ఈయన పాలనలో కళింగులు స్వతంత్ర రాజులుగా మారారు. బిందుసారుని కాలం నుండి మగధ రాజులకు కళింగులకు వైరం కొనసాగుతుంది. ఈ క్రమంలో బిందుసారుని కుమారుడు అశోకుడు రాజ్యాధికారానికి వచ్చాడు. కళింగను మగధ రాజ్యంలో అంతర్భాగం చేయాలని కళంగ రాజ్యంపై దండయాత్రకు వెళ్ళాడు. అశోకుని సైన్యాలకు కళింగ రాజుల సైన్యాలకు భువనేశ్వర్ దగ్గరలోని దహినది ఒడ్డున గల ధవళగిరి అను కొండ ప్రక్కన గల విశాలమైన మైదానంలో యుద్ధం జరిగింది. కళింగ రాజుల పక్షాన 1లక్షా 50 వేల మంది సైనికులు అశోకుని పక్షాన లక్షమంది సైనికులు ఆ యుద్ధంలో పాల్గొన్నారని, వారిలో లక్షా ఏబది వేలమంది చనిపోయారని చరిత్రకారుల అంచనా. ఇరు పక్షాలమధ్య భయంకరంగా సాగిన ఆ యుద్ధంలో శవాలు గుట్టలుపడినవి, రక్తం ఏరులై పారింది. యుద్ధం ముగిసింది. అశోకుడు విజయం సాధించాడు. విజయగర్వంతో తన గుడారానికి వెళ్లిపోయాడు.

(అశోకుడు మరుసటి రోజు యుద్ధభూమికి వెళ్లాడు. గుట్టలుగా పడి వున్న శవాలు ఆయనకు కనిపించాయి. కొనవూపిరితో మృత్యువుతో పోరాడుతున్న క్షతగాత్రుల మూలుగుల శబ్దం వినిపిస్తుంది. రాబందులు, గద్దలు, కాకులు వంటి పక్షులు, నక్కలు, తోడేళ్లు, కుక్కలు వంటి జంతువులు మృత కళేబరాలను పీక్కుతినడానికి కాట్లాడుకొంటున్నవి. ఈ భయంకర దృశ్యాలను ప్రత్యక్షంగా చూసిన అశోకుని హృదయం చలించింది. మనస్సు మంచుముక్కలా కరిగింది. కళ్లవెంట నీరు అప్రయత్నంగా జాలువారినవి. అగ్ని పర్వతం పగిలి లావాను విరజిమ్మినట్లు ఆయన హృదయాంతరాళ పొరల్లో దాగి ఉన్న మానవత్వం పెల్లుబికింది)

ఈ యద్ధంలో కొంతమంది పిల్లలు తండ్రులను పోగొట్టుకొన్నారు. కొంతమంది భర్తలను



పోగొట్టు కొన్నారు. కొంతమంది వృద్ధులు కుమారులను పోగొట్టుకొన్నారు. ఇంతమందిని చంపి ఎంతోమంది మనసులను గాయపరచి, రక్తపాతం సృష్టించి నేను విజయం సాధించానా? ఏది విజయం? ఏది ఓటమి? ఏది న్యాయం? ఏది అన్యాయం? ఏది ధర్మం? ఏది అధర్మమని అశోకుడు గద్గద స్వరంతో తనను తాను ప్రశ్నించుకొన్నాడు.

అంతలో శవాలుగా మారిన తన వారిని కడసారి చూడాలని ఒక స్త్రీ శవాల గుట్టల్లో వెతుకుతుంది. అశోకుని చూసింది. ఈ యుద్ధానికి హింసకు రక్తపాతానికి కారకుడైన అశోకుడు ఆయనే అని తెలుసుకొంది. సమీపానికి వెళ్లింది. అశోకుని కళ్లలోకి తీక్షణంగా చూస్తూ, నా వారందరు చనిపోయారు. నేను మాత్రం మిగిలి ఉన్నాను. నేను దేనికోసం ఎవరి కోసం జీవించాలని ప్రశ్నించింది. ఆ మాటలు అశోకుని హృదయంలో బాకుల్లా గుచ్చుకొన్నవి.

ఆకలైన జంతువు ఆహారం కోసం వెతుకుతుంది. దప్పికయిన పక్షి నీటి కోసం పరుగులు తీస్తుంది. అలాగే వేదన రోదన నిరాశ నిస్పృహలో ఉన్న అశోకుని మనస్సు ప్రశాంతత కోసం పరుగులు తీసింది. ఎక్కడో దూరం నుండి వస్తున్న సన్నని కాంతికిరణం కారుచీకట్లో నడుస్తూ వ్యక్తి మనసులో ఆశలు రగిలించినట్లు బౌద్ధం అశోకునికి ఆశాకిరణంలా కనిపించింది. హింసకు

విరుగుడు అహింసే అనుకొన్నాడు. ఒక విషసర్పం విషాన్ని కొన్ని వనమూలికలు నిర్వీర్యం చేసినట్లు అశోకునిలోని హింసను బౌద్ధం నిర్వీర్యం చేసింది. పట్టిన కత్తిని పడవేశాడు. ఇక ముందు యుద్ధాలు చేయను. ఏ జీవిని చంపను. ఏ రూపంలో బాధపెట్టను. ఒక తండ్రి తన బిడ్డలను ఎలా ప్రేమతో చూసుకొంటాడో అలా ప్రజలందరిని సొంత బిడ్డల్లా ప్రేమిస్తానని ప్రకటించాడు. ఇక తన భవిష్యత్ జీవితం మనుషులకు, మూగజీవుల సేవ, సంక్షేమానికి అంకితం చేస్తున్నానని ప్రతిజ్ఞ చేశాడు. ఇలా కత్తిపట్టి కళింగ యుద్ధంలో రణఘోష చేసిన అశోకుడు కత్తి విడచి బుద్ధధర్మాన్ని స్వీకరించి ధర్మఘోష చేయడం మొదలు పెట్టాడు. చండ అశోకుడని పిలిచిన ప్రజలే ఆయన్ని ధర్మ అశోకుడని పిలవవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇలా అశోకుడు తన జీవితాన్ని తాను మంచి వైపు మలుపు తిప్పాడు.

అలా పరివర్తన చెందిన అశోకుడు తన సమయంలోని ప్రతిక్షణాన్ని తన శరీరంలోని ప్రతి అణువును ధర్మం కోసం ప్రజా సంక్షేమం కోసం వినియోగించాడు. తన రాజ్యంలో సైనిక ఖర్చులు గణనీయంగా తగ్గించాడు. ఆ డబ్బును ప్రజల క్షేమానికి వినియోగించాడు. తన రాజ్యంలో త్రాగునీరు సాగునీటి కోసం బావులు, చెరువులు తవ్వించాడు. తన రాజ్యంలో ప్రజల్లో ఎవరికి ఎప్పుడు ఎటువంటి అవసరం. సహాయం అవసరమైనా ధర్మగంటను మోగించి రాజును కలవచ్చని, తగిన సహాయ, సహకారాలు పొందవచ్చని ప్రకటించి తన కోటలో ధర్మగంటను కట్టించాడు. బాటసారుల కోసం రోడ్లు వేయించాడు. ఆ రోడ్లకు ఇరువైపుల చల్లని నీడనిచ్చు చెట్లను నాటించాడు. అక్కడక్కడ మంచినీటి బావులు తవ్వించాడు. విశ్రాంతి కోసం ధర్మసత్రాలు నిర్మించాడు. మనుషుల కోసం ఆసుప్రతులు ఏర్పాటు చేశాడు. ఆయుర్వేద మందులు వాడవలసిందిగా ప్రజలను కోరినాడు. తన రాజ్యమంతటా ప్రజలు సంచరించు కూడళ్లలో స్తూపాలు, శిలాశాసనాలు వేయించాడు. వాటిపై ధర్మసూత్రాలు చెక్కించినాడు. పెద్దలను, గురువులను మత ప్రచారకులను ప్రజలు గౌరవించ వలసిందిగా కోరినాడు. ప్రజలందరూ ఈ ధర్మసూత్రాలను తెలుసుకొని ధర్మమార్గంలో నడచి, వారి జీవితాలను శాంతి సంతోషాలకు నిలయాలుగా మార్చుకోవాలని అశోకుని ఆకాంక్ష. మానవజాతి పట్ల ఆయనకు గల ప్రేమాభిమానాలకు ఆయన చేసిన ఈ పనులు నిలువెత్తు నిదర్శనాలు.

ప్రపంచంలో మొట్టమొదట పశువులకు వైద్యశాలలు ఏర్పాటు చేసిన ఘనత అశోకునికే దక్కుతుంది. ప్రాణరక్షణ కోసం మినహా తన రాజ్యంలో వేటను నిషేధించాడు. ఎవరి ఆనందం కోసం, వినోదంగా మూగజీవులను వేటాడి చంపుట నేరమన్నాడు. తాను శాఖాహారిగా మారి ప్రజలందరిని శాఖాహారం తీసుకోమని కోరినాడు. ఈ పనులన్నీ ఆయనకు మూగజీవుల పట్లగల ప్రేమ దయ జీవకారుణ్యానికి నిదర్శనాలు.

మానవులు ఎదుర్కొంటున్న ప్రతి సమస్యను శాంతి సహనం అహింసల ద్వారా పరిష్కరించవచ్చని ఆయన విశ్వాసం. ఒక నదిలో మంచి నీరుంది. దానికి దగ్గరలో కొంతమంది ప్రజలు, జంతువులు, పక్షులు త్రాగునీటి సమస్యతో బాధపడుతున్నారు. వివేకులు చేయవలసిన పని ఏమిటంటే నదిలో నీరుందని చెప్పడం కాదు. ఆ నదికి కాలువలు తవ్వి నీటి కోసం ఎదురు చూస్తున్న ప్రజల దగ్గరకు వాటిని తీసుకురావాలి. అప్పుడు ఆ నీటిని ప్రజలు, జంతువులు, పక్షులు త్రాగి దప్పిక తీర్చుకొని ఆనందంగా జీవిస్తాయి. అలాగే అశోకుడు బౌద్ధాన్ని స్వీకరించి తన జీవితాన్ని ప్రశాంతంగా సంతోషంగా మార్చుకొన్నాడు. కాని ప్రజలందరు ఆ శాంతి సంతోషాల్ని పొందాలంటే బౌద్ధాన్ని వారి దగ్గరకు తీసుకొని పోవాలి. అందుకోసం తన దేశమంతటా వేలకొలది స్థూపాలు, శిలా శాసనాలు వేయించాడు. వాటిపై ధర్మ సూత్రాలు చెక్కించాడు. కళింగ యుద్ధం జరిగిన ధవళగిరి దగ్గర ఆయన కొన్ని శిలాశాసనాలు చెక్కించాడు.

బహశా అదే ఆయన వేయించిన మొదటి శాసనం అని కొందరు చరిత్ర కారుల అభిప్రాయం.

ఆయన కాలంలోనే బౌద్ధ భిక్షువులందరిని ఒక చోట చేర్చి మూడవ బౌద్ధ సంగీతిని ఏర్పాటు చేసినాడు. ధర్మమహామాత్రులను నియమించి వారికి అవసరమైన ఏర్పాట్లు చేయించి ధర్మాన్ని ప్రచారం చేయుటకు దేశవిదేశాలకు పంపినాడు. ఆయన సాంచి, సారనాథ్‌లో వేయించిన స్తూపాలు నేటికీ చెక్కుచెదరక జాతీయ అంతర్జాతీయ పర్యాటకులను ఆకర్షిస్తూ స్ఫూర్తిదాయకంగా నిలచినవి. ధర్మరక్షణ కోసం నాలుగు సింహాలు నాలుగు దిక్కులకు చూస్తున్నట్లు చెక్కించి వాటి కింద ధర్మచక్రాన్ని చెక్కించాడు. స్వాతంత్ర్యానంతరం మన జాతీయ నాయకులు అశోకుడు మానవజాతికి చేసిన సేవలకు గుర్తింపుగా ఈ సారనాథ్ స్థూపం నుండే నాలుగు సింహాలు, ధర్మచక్రాన్ని మన జాతీయ చిహ్నాలుగా స్వీకరించారు.

బుద్ధుడు తన కుమారుడు రాహులుకు స్వయంగా భిక్షుదీక్షను ఇచ్చినట్లు అశోకుడు తాను భౌతికంగా మానవజాతికి దూరమైనా తన అనంతరం ధర్మ ప్రచారానికి ఆటంకం లేకుండా సాగేందుకు తన కుమారుడు మహేంద్ర, కుమార్తె సంఘమిత్రలను తన ఆలోచనలకు వారసులుగా మార్చుకొన్నాడు. అశోకుని కుమారుడు మహేంద్ర బుద్ధుని సందేశాన్ని తీసుకొని శ్రీలంక వెళ్లాడు. ఆయన ధర్మోపన్యాసాలు విని శ్రీలంకను పాలిస్తున్న "తిస్సా" అను రాజు బౌద్ధం స్వీకరించాడు. తిస్సా బౌద్ధాన్ని స్వీకరించిన అనంతరం తన రాజ్యంలో గయలోని బోధివృక్షం కొమ్మను తెచ్చి నాట వలసిందని మహేంద్రని అభ్యర్థించాడు. అందుకు మహేంద్రుడు ఆనందంతో అంగీకరించాడు. శ్రీలంక నుండి తిరిగి వచ్చిన అనంతరం బోధివృక్షం కొమ్మను తీసుకొని లంకకు వెళ్లవలసిందిగా సోదరి సంఘమిత్రను కోరినాడు. అందుకు ఆమె ఆనందంతో అంగీకరించి ఒక కొమ్మను తీసుకొని శ్రీలంక వెళ్లింది. శ్రీలంకలోని అనూరాధపురంలో సంఘమిత్ర స్వయంగా నాటిన బోధివృక్షం నేటికీ ఉన్నది. ఇది వూహ కాదు నూటికి నూరుపాళ్లు నిజం. ఇటీవల ప్రపంచంలోని వృక్ష శాస్త్రజ్ఞులందరు ఆ చెట్టును పరిక్షించి ఈ భూమిపై ఉన్న ఎక్కువ వయసు గల చెట్లు ఇవే అని ప్రకటించినారు. మంచి పనుల ఫలితాలను ఎవరు ఆపలేరు. నిప్పు కాల్చలేదు. నీరు తడపలేదు. ఏ శక్తులు అడ్డుకొనలేవు. అలాగే అశోక చక్రవర్తి చేసిన పనులు తరతరాలకు తరగని సూర్యుని వెలుగులా మనవజాతికి స్ఫూర్తిదాయకంగా నిలిచి ఉంటాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

తన కోసం తన వారి కోసమే జీవించి మరణించువారిని వారి కుటుంబ సభ్యులు కొంతకాలం గుర్తుంచుకొంటారు. కానీ మానవజాతి కోసం, ధర్మం కోసం, మూగజీవుల కోసం జీవితాన్ని అంకితం చేసిన అశోకచక్రవర్తి వంటి మహోన్నతులకు పుట్టుకే గానీ మరణం లేదు. వారు భౌతికంగా నిష్క్రమించినా ప్రజల హృదయాల్లో కొలువై వుంటారు. మహనీయులకు మనం అర్పించు నిండైన నివాళులు ఏమిటంటే, వారు నడిచిన మార్గంలో నడవడం, వారు చూపిన ధర్మాన్ని అనుసరించడం. మనం నడుస్తూ మరికొందరిని ఆ మార్గంలో నడిపించడానికి ప్రయత్నించడమే. ❋

*రచయిత సెల్ : 88010 37737*



## శుభాకాంక్షలు

మాజీ మంత్రివర్యులు, మాతృభాషా ప్రేమికులు, ప్రముఖ సాహితీ వేత్త, బౌద్ధాభిమాని **మండలి బుద్ధప్రసాద్** గారు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షులుగా ది.26-10-2012న పదవీ బాధ్యతలు స్వీకరించిన శుభసందర్భంగా 'బుద్ధభూమి' శుభాకాంక్షలు తెలుపుతుంది.

పాట :

# నీ పాలనకు జోహారులూ

-బొర్రా గోవర్ధన్

పల్లవి : వందనం- వందనం.... ॥వందనం॥
ఓ అశోకా.... వందనం...
శోకమెరుగని లోకానికి
రూపుదిద్దిన క్రాంతి తిలక
రాజనీతికి రాజ్యప్రగతికి
దిక్కుచూపిన వేగుచుక్క
వందనం.... వందనం...
ఓ...బౌద్ధసంగీతిమాలిక...
వందనం...వందనం...
విరిచందనం నీ కీర్తి చంద్రిక ॥వందనం॥



చరణం : పల్లవించిన ధమ్మగీతిక- పరిఢవిల్లిన సంఘ చారిక
వెలుగు తరగని శాంతి తారక- బుద్ధ బోధల జయపతాక
దాన పేటిక ధ్యాన వాటిక- అహింసామృత వర్షిక
కరుణ దీపిక జ్ఞాన వీచిక- అశోకా....నీ ఏలిక.... ॥వందనం॥

చరణం : విద్య, వైద్యం సేవలు- సంక్షేమ విధులకు సేనలు
సాగు సేద్యం వనరులు- వనములూ రహదారులు
కన్నీరు ఎరుగని రైతులు- ఊగని ఉరికొయ్యలు
రణభీతి లేని పౌరులు- నీ పాలనకు జోహారులు ॥వందనం॥

చరణం : బౌద్ధ ధమ్మ ప్రదీప్తివి- మత సహన సుగుణ మూర్తివి
లోకవిదునీ బోధలు లోకాన చాటిన మేటివి
ప్రజలు రాజుకు బిడ్డలని ఎలుగెత్తిన తొలి రాజువి
ధమ్మరాజని ప్రజలు కొలిసిన- ధరణికే మహరాజువి ॥వందనం॥

చరణం : అధిక పన్నుల బాధలేదు- అధికార గణముల పీడలేదు
ధరలు చుక్కల కెగరలేదు- కరువు కోరలు చాచలేదు
హింస క్రతువులు సాగలేదు- ధర్మచర్చలు ఆగలేదు
ప్రజా రంజనమందు నీకు- సాటిపోటి లేదు లేదు
మౌర్యరాజా.... వందనం.....
మగధనాథా... వందనం....
ధర్మరాజా....వందనం....
ధరణితేజా.... వందనం.... వందనం.... ॥వందనం॥

సెల్ : 93906 00157

# అశోక సమ్రాట్

మూలం : **మున్షీ ఎన్.ఎల్.ఖోబ్రగడే**

**అ**శోక సమ్రాట్ క్రీ.పూ 273 నుండి క్రీ.పూ 232 వరకు విశాల సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. ఈతడు చంద్రగుప్త మౌర్యుని మూడవ తరంలోనివాడు. ఈతని తండ్రి బిందుసారుడు తల్లి సుభద్రాంగి లేక ధర్మా. బిందుసారుని సమయంలో అశోకుడు ఉజ్జయినికి రాజు. ఒక శ్రేష్టి కుమార్తె బౌద్ధురాలయిన విదిశాదేవిని వివాహమాడాడు. ఆమె కుమారుడు మహింద్రుడు, కుమార్తె సంఘమిత్ర. అశోకుడు అన్నిరకాల హింసలూ పరిత్యజించాలని ఆమె కోరినది. కాని బిందుసారుని మరణానంతరం ఆమెకిచ్చిన మాటను మరిచి తన సింహాసనానికి ఎవరయితే అడ్డంకిగా ఉన్నారో వారందరిని అశోకుడు నిర్దాక్షిణ్యంగా చంపివేశాడు. కాని అతని సోదరుడు సుశీముని భార్య గర్భవతిగా ఉండి తప్పించుకున్నది. ఆమె కుమారుడు భిక్షు న్యగ్రోధుడు. ఇతడు అశోకుని అశాంత మనసుకి శాంతి కలిగిస్తాడు. సకల ధర్మ ప్రకాండ పండితుడైన మొగ్గలీపుత్త తిష్య అశోకుని బౌద్ధ గురువు. అశోకుని పరిపాలనా కాలము బౌద్ధ ధర్మానికి స్వర్ణకాలం.

## సమ్రాట్ అశోకుని ధర్మనిష్ట

అశోకునిలోని బౌద్ధ ధర్మనిష్టకు ఉదాహరణగా తన కుటుంబాన్ని అంతా మొదటిగా బౌద్ధధర్మ దీక్షితులు కావించెను. ఈ ప్రభావం వలన దేశప్రజలంతా బౌద్ధ దీక్ష గ్రహించారు. అతడు బౌద్ధ ధర్మాన్ని జాతీయధర్మంగా ప్రకటించెను. బౌద్ధ ధర్మంపై శ్రద్ధాసక్తులు కలిగిన అశోకుడు ప్రజాహిత కార్యాలనేకం చేసి భిక్షువులకు అన్న, వస్త్ర, ఔషధ దానాలు చేయుట వలన అనాధ పిండికుని వలె గొప్పదాతగా కీర్తించ బడెను. భిక్షువుల కిచ్చే భోజన, వస్త్ర దానాలకు ఆకర్షించబడిన కొందరు ఇతర మతావలంబికులు స్వార్థంతో భిక్షువులుగా మారారు. దీని ఫలితంగా అసలైన నిష్టాపరులైన భిక్షువులకూ ఈ మోసపు భిక్షువులకూ మధ్య వివాదం చెలరేగినది. ఈ వివాదం ఎంత ఎక్కువయినదంటే అశోకునికి తన గురువు అయిన మొగ్గలి పుత్ర తిష్యుని పిలువ వలసి వచ్చినది. గంగానదిలో నావపై వస్తున్న గురువుగారిని అశోకుడు మెడలోతు నీరు వరకు నదిలోకి ఎదురేగి గురువుగారి చేయి అందుకుని తీసుకుని వచ్చాడు.



ఆచార్య మొగ్గలిపుత్త తిస్సకు స్వాగతం చెబుతున్న సమ్రాట్ అశోకుడు

## అశోకుని తీర్థయాత్రలు

పాటలీపుత్రం చేరిన తర్వాత భిక్షు మొగ్గలీపుత్త తిష్యునితో భిక్షువుల వివాదం సమస్యపై సమాలోచన జరిగినది. దాని ప్రకారం భిక్షువులకు సంఘ బహిష్కరణ సంకల్పించబడెను.

మొగ్గలీపుత్త తిష్యుని అధ్యక్షతన ఒక ధర్మసభ నిర్వహించబడెను. దానిలో సమ్రాట్ అశోకుడు కూడ పాల్గొనెను. మొగ్గలీపుత్త తిష్యునిచే రచించబడిన గ్రంథం కథావత్తు. ఇది బౌద్ధ సాహిత్యంలో గొప్ప గ్రంథంగా ఎంచబడెను. తన గురువు ప్రోత్సాహంతో సమ్రాట్ అశోకుడు బౌద్ధ తీర్థయాత్రలు చేసి వారెక్కడెక్కడకు వెళ్ళితే అక్కడ స్థూపాలూ, శిలా శాసనాలు చెక్కించారు. ఈ శిలాశాసనాలూ మరియూ స్థంభ శాసనాలే మన ప్రాచీన ఇతిహాసానికీ మరియు అశోకుని గొప్ప జీవనానికి సాక్షీ భూతాలు. భారతదేశంలో జాతీయ ధర్మంగానూ ప్రపంచంలో అంతర్జాతీయ ధర్మంగాను బౌద్ధ ధర్మాన్ని ప్రతిష్టించిన అశోకుడు ప్రపంచ చరిత్రలో ఉన్నతమైన, చిరస్థాయి అయిన కీర్తిని పొందాడు. విశ్వ చారిత్రక పటంలో చెరగని ముద్ర పొందాడని చెప్పవచ్చును. బౌద్ధ ధర్మాభివృద్ధికి ఆయన ఎంత కృషి చేసాడో వ్రాయడం ఏ రచయితకైనా సంభవము కాదు. ప్రపంచ చరిత్రలో ఇటువంటి నిరభిమాని, ప్రజావత్సలుడు అయిన ఏ సామ్రాట్ మనకు కనుపించడు. ఆయన తన పుత్రుడు మహింద్రుని, కుమార్తె సంఘమిత్రను ధర్మ ప్రచారార్థము శ్రీలంకకు పంపించాడు. పాటలీ పుత్రము నుండి తామ్రలిప్తం (ఇప్పటి పేరు తామ్‌లుక్) వరకు కాలినడకతో వచ్చి సంఘమిత్రకు వీడ్కోలు చెప్పాడు.

ఈ ఘటనకు ముందు అశోకుడు తన గురువు బౌద్ధ భిక్షువు మహాస్తవిర మొగ్గలీపుత్ర తిష్యుని (ఇతనిని ఉపగుప్తుడు అని కూడ అంటారు) ఇలా అడిగాడు "భన్తే బౌద్ధ ధర్మంలో ఎటువంటి వస్తువును దానం చేయడం గొప్పదిగా చెప్పబడుతుంది"

మొగ్గలిపుత్త :- "రాజా నీతో సమానమైన వ్యక్తి అయినా కూడా ధర్మానికి వారసుడుగా చెప్పబడడు. ఎవరైతే తన కుమారుని గాని, కుమార్తెను గాని ధార్మిక పరివ్రాజకులైన భిక్షువు లేక భిక్షుణిగా తయారు చేసి ధర్మానికి దానం చేసినప్పుడే ధార్మిక దాయది, ధార్మిక వారసత్వంగా చెప్పబడతారు.

అశోకుడు ధార్మిక దాయాది కావాలనే కోరికతో అక్కడే నిలచిన రాజకుమారుడు మహింద్రుని, రాకుమారి సంఘమిత్రను ఉద్దేశించి- "బిడ్డలారా మీరు ప్రవ్యజిస్తారా? ప్రవ్యజన చాలా గొప్పది" అని అన్నాడు. వెంటనే వారు "దేవా ఆజ్ఞాపించండి మేము ఈ రోజే ప్రవ్యజిస్తాము" అని వారిద్దరూ భిక్షువు, భిక్షుణీలుగా మారారు.

## ధర్మ ప్రచారంలో కన్నబిడ్డలు

అశోకుడు తన ప్రియ పుత్రుడు మహేంద్రుడును, ప్రియపుత్రిక సంఘమిత్రను బౌద్ధ



బుద్ధగయ నుండి బోధివృక్ష శాఖను శ్రీలంకకు తీసుకెళ్తున్న అశోకుని కుమార్తె సంఘమిత్ర

ధర్మప్రచారానికై భగవానుని శరీరావశేషం మరియు బోధివృక్ష శాఖతో సహా శ్రీలంకకు పంపాడు. క్రీ.పూ 247 లో శ్రీలంకలోని అనూరాధపురంలో బోధి వృక్ష శాఖను నాటినట్లు ఆధారాలున్నాయి. ప్రపంచంలోని ప్రాచీన బోధి వృక్షాలలో అతి ప్రాచీనమైనదిగా 2200 సంవత్సరాలు ధర్మప్రచారం చేస్తూ భిక్షు మహింద్రుడు తన 60వ ఏట శ్రీలంకలోనే పరినిర్వాణం పొందెను. ఎక్కడ అయితే మహింద్రుడు పరినిర్వాణం చెందాడో ఆ ప్రాంతాన్ని శ్రీలంక వాసులు ఋషిభూమి ఆశ్రమ్ అంటూ పూజిస్తారు. బిక్షు మహింద్రుని నిర్వాణం తర్వాత రెండు సంవత్సరాలకు భిక్షుణీ సంఘమిత్ర మహాపరి నిర్వాణం కూడా శ్రీలంకలోనే జరిగినది. సమ్రాట్ అశోకుని ముద్దు బిడ్డలిద్దరూ స్వదేశానికి దూరంగా ధర్మప్రచారంలో తమ జీవితాలను త్యాగం చేసారు. సమ్రాట్ అశోకుడు తన హృదయం యొక్క ఈ రెండు ముక్కలనూ ధర్మసేవకు త్యాగం చేసి ధర్మప్రియ మరియు దేవానాం ప్రియుడుగా ప్రసిద్ధి చెందాడు.

## అశోకుని పరిపాలనా వ్యవస్థ

మంత్రి పరిషత్తు సలహా ప్రకారం కేంద్రపాలన సాగేది. వివిధ ప్రాంతాల పరిపాలనలో రాజకుమారుల సహకారం తీసుకోబడేది. సుదూర ప్రాంతాలలో ఎక్కడయితే మంచి పరిపాలకుని అవసరమో అక్కడ ఒక రాజప్రతినిధి నియమింపబడేవాడు. దివ్యావధానం గ్రంథం ప్రకారం సమ్రాట్ కుమారుడైన కుణాలుడు తక్షశిల వైస్రాయి. అభివర్ధన్ గాంధార ప్రాంత వైస్రాయి. అశోకుని పదమూడవ శిలాశాసనం ప్రకారం సమ్రాట్ భవన్, కాంభోజ, ఆంధ్ర, భోజ, పరింద మొదలగు ప్రదేశాలకు స్వయం ప్రతిపత్తిగల శాసనాధికారం ఇచ్చెను. సమ్రాట్‌చే నియమింపబడిన అధికారులు ఉద్యోగులలో...

**1. మహాపాత్ర :-** వీరి ముఖ్యమైన పని ధర్మస్థాపన, ధర్మశ్రేయస్సు చూడటం. మరియు ప్రజాక్షేమం కోసం నిరంతరం అనుదాన వితరణ చేసేవారు. ఖైదీల శిక్షలు తగ్గించడం మరియు వారిని విడుదల చేయడానికి సిఫార్సు చేసేవారు.

**2. రాజుక్ :-** వీరు క్షత్రియులు. వీరికి భూమి- న్యాయ వ్యవస్థలో విస్తృత అధికారం ఉంది- వీరు వివిధ ప్రాంతాలను పర్యటిస్తూ గ్రామీణ ప్రజల ఆర్థిక సమస్యలను తెలుసుకుని వారికి పరిష్కారాలు చూపేవారు.

**3. ప్రాదేశిక్ :-** వీరు క్షత్రియులకు సహాయకులు మరియు ప్రాంతాల వారీగా పరిపాలకులు, వీరు జన సంపర్కంలో ఉండి ప్రజల ఆర్థిక, సామాజిక సమస్యలను పరిష్కరించేవారు.

**4. విషయపతి లేక యుక్త్ :-** వీరు ముఖ్యంగా జిల్లా అధికారులై ఉండేవారు. ఏ వ్యక్తినయినా సన్మానించడానికీ లేక దండించడానికీ వీరికి పూర్తి అధికారం ఉండేది. వీరిచే నియమింపబడిన వారి సహాయంతో జిల్లా ధనాగారాన్ని రాజకీయ సంపత్తిని కాపాడటం, పన్నులు వసూలు, మరియు రెవిన్యూ లెక్కలు వ్రాయడానికి కొందరిని నియమించుకుంటారు. వీరిని ఉపాయుక్తులు అంటారు.

**5. ప్రతి వేదక్ :-** గుప్తచరులు వీరి ఆధీనంలో ఉంటారు. వీరి సహాయంతో సార్వజనిక విషయాలు చక్రవర్తికి తెలిపి అనేక సూచనలు అందచేస్తారు. ఈ విధంగా పవిత్రత, ప్రజా రంజకము నీతివంతమైన పరిపాలన సాగించిన అశోక చక్రవర్తి వంటి మహనీయుడు పూర్వం కాని ఇప్పుడు కాని లేడని, రాబోవు కాలంలో కూడా ఉండబోడని మేధావుల అభిప్రాయం. ❋

*(హిందీ మూల గ్రంథం:- బౌద్ధకాలీన భారత ఇతిహాసం పేజీ నెం. 30)*

సంక్షిప్త అనువాదం : ఉపాసిక **ఎస్. పైడితల్లి,** సెల్ : *93924 17977*

# అశోక చక్రవర్తి గిర్నార్ శిలా శాసనము

తెలుగుసేత : మోక్షానందస్వామి

(ఈ అనువాదానికి ఆస్ట్రేలియాకు చెందిన గౌరవనీయ భిక్షు యస్.ధమ్మిక గారు చేసిన ఆంగ్లానువాదం మూలం. ఆ రచయిత తన అనువాదాన్ని అమూల్య చంద్రసేన్ అనువాదంతో పాటు సి.డి.సర్కార్, డి.ఆర్.భండార్కర్‌ల అనువాదాలను కూడా పరిశీలించి చేసినానని చెప్పటం వలన దానిని ప్రామాణికమని అనుకోవచ్చును. మొదట దీనిని పరిశీలించి ఒక వ్యాసం వ్రాద్దా మనుకున్నాను. కాని అశోకుడే తన కార్యకలాపాల గురించి, కళింగయుద్ధం వలన తనలో కలిగిన పరివర్తన గురించి ఎంతో విపులంగా, పిల్లలకు కూడా అర్థమయ్యే విధంగా వ్రాయించిన గిర్నార్ శిలాశాసనాన్ని చదివిన తర్వాత వ్యాసాన్ని వ్రాసే బదులు ఈ శాసనాన్నే ఉన్నది ఉన్నట్లుగా అనువదిస్తే బాగుంటుదనిపించింది. ఈనాటి సంక్షేమ రాజ్యభావన, సర్వమత సహనం, మానవ హక్కులు మొదలైన విషయాలకు మూలాలు ఇందులో మనకు కనిపిస్తాయి. గిర్నార్ కొండ గుజరాత్‌లో అహ్మదాబాదుకు 327 కి.మీ దూరంలో జునాగఢ్ ప్రాంతంలో ఉంది. గిర్నార్ శిలాశాసనం 257 బి.సి.లో జారీచేయబడింది. శాసనంలో కుండలీకరణాలలో ఉంచబడిన పదాలు విషయం సులభంగా అవగాహన కావటానికి నాచే చేర్చబడినాయి.

-మోక్షానందస్వామి)

1) దేవానాం ప్రియుడు (Belvoled of the Gods), ప్రియదర్శిరాజు (అశోకుడు) ఈ ధమ్మశాసనాన్ని వ్రాయించినాడు. ఇక్కడ (నా రాజ్యంలో) ఏ ప్రాణి చంపబడకూడదు. యజ్ఞాలలో ఆహుతిలో ఈయబడకూడదు. దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు సమ్మతించే కొన్ని జాతరలు ఉన్నప్పటికీ, (సాధారణంగా) జాతరలలో చాలావరకు (జంతుబలుల వంటి) అభ్యంతరకరమైన విషయాలే కనిపిస్తున్నాయి కనుక జాతరలు జరుపకూడదు.

ఇంతకుముందు దేవానాం ప్రియుడు (Belvoled of the Gods) ప్రియదర్శిరాజు వంటశాలలో ప్రతిదినము వందల, వేల కొలది జంతువులు కూరల కొరకై చంపబడేవి. కాని ఇప్పుడు ఈ ధర్మశాసనాన్ని వ్రాయించినప్పటి నుండి రెండు నెమళ్ళు, ఒక జింక మాత్రమే చంపబడుతున్నాయి. అందులోనూ జింక ఎప్పుడో ఒకసారి మాత్రమే. ఇకముందు ఈ మూడు ప్రాణులు కూడా చంపబడవు.

2) దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు రాజ్యంలోనూ, [1]సరిహద్దులకు అవతలగల చేర, పాండ్య, సత్యపుత్ర, కేరళ పుత్రులతో పాటు తామ్రపర్ణి వరకు, ఇంకా అంటియోకస్ పాలించే గ్రీకుదేశం వరకు, అతని ఇరుగు పొరుగున పాలించే రాజుల రాజ్యాల వరకు అంతటా దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు మానవుల చికిత్సకు, పశువుల చికిత్సకు ఈ రెండురకాల చికిత్సలకు సామాగ్రిని సిద్ధం చేసినాడు. మానవుల, పశువుల చికిత్సకు తగిన (ఔషధ) మొక్కలు దొరకని చోటికి వాటిని దిగుమతి చేయించి, అక్కడ వాటిని పెంచే ఏర్పాట్లను చేసినాడు. మానవులకు, పశువులకు ఉపయోగపడే విధంగా నేను రోడ్ల ప్రక్కన బావులను త్రవ్వించినాను. చెట్లను నాటించినాను.

3) దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు ఇలా అంటున్నాడు- నేను అభిషిక్తుడనైన పన్నెండు సంవత్సరాలకు ఈ విధంగా అజ్ఞాపించినాను- యుక్తకులు, రజ్జుకులు, ప్రాదేశికులు (రాజ్యంలోని వివిధ శ్రేణులకు చెందిన అధికారులు) ధమ్మాన్ని గురించి తెలియజేయటానికి, ఇతర విధులు నిర్వర్తించటానికి ఐదేండ్లకొకసారి రాజ్యమంతటా పర్యటనలను జరపాలి. తలిదండ్రుల పట్ల



న్యూఢిల్లీలోని నేషనల్ మ్యూజియంలో వున్న గిర్నార్ కొండ నమూనా

గౌరవము మంచిది, మిత్రుల పట్ల, పరిచయస్తుల పట్ల, చుట్టాల పట్ల, శ్రమను, బ్రాహ్మణుల పట్ల, ఔదార్యాన్ని కలిగి ఉండటం మంచిది. ప్రాణులను చంపకుండా ఉండటం మంచిది. ఖర్చులో, పొదుపులో మితంగా ఉండటం మంచిది. (అమాత్య) మండలి ఈ ఉత్తర్వులను ఆచరణలో పెట్టడాన్ని గురించి ఇదే మాటలలో యుక్తకులకు తెలియజేయాలి.

4) గతంలో వందలకొలది ఏండ్లుగా ప్రాణులను చంపటం లేదా హాని కలిగించటం, బంధువుల పట్ల అనుచితమైన ప్రవర్తన, శ్రమణ, బ్రాహ్మణుల పట్ల అనుచితమైన ప్రవర్తన పెరిగిపోయింది. కాని ఇప్పుడు దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు ధర్మాచరణ వలన [2]భేరిశబ్ద స్థానాన్ని ధమ్మశబ్దం ఆక్రమించింది. [3]దివ్యరథాలు, మంగళకరమైన ఏనుగులు, దివ్యమైన శరీరాలు, ఇతర దివ్య దృశ్యాలు అనేక వందల సంవత్సరాలుగా కనిపించలేదు. కాని ఇప్పుడు దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు ప్రాణులను చంపటంలో, హాని కలిగించటంలో నిగ్రహాన్ని పెంపొందిస్తున్నాడు. బంధువుల పట్ల, శ్రమణ, బ్రాహ్మణుల పట్ల ఉచితమైన ప్రవర్తనను పెంపొందిస్తున్నాడు. తల్లిదండ్రుల పట్ల, పెద్దలపట్ల గౌరవాన్ని పెంపొందిస్తున్నాడు. ఇందువలన ఇప్పుడు అటువంటి దృశ్యాలు కనిపించటం ఎక్కువైంది.

ఇవి ఇంకా ఇతరవిధాలైన అనేక ధమ్మాచరణలు దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు వలన ప్రోత్సహింపబడినాయి. అతడు ధమ్మాచరణను పెంపొందించటాన్ని కొనసాగిస్తాడు. ఇంకా దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు యొక్క కొడుకులు, మనుమలు, మునిమనుమలు కూడా అనంతకాలం వరకు ఈ ధమ్మాచరణను కొనసాగిస్తారు. ధమ్మంలో, శీలంలో నివసిస్తూ వారు ధమ్మాన్ని బోధిస్తారు. ధమ్మాన్ని బోధించటమే ఉన్నతమైన పని. కాని శీలం లేనివాడు ధమ్మాన్ని గురించి బోధింపలేడు. అందువలన దానిలో (శీలంలో) ఎదగటం, (శీలాన్ని) వృద్ధిపొందించుకోవటం మెచ్చుకోదగినవి.

నా వారసులను సంతోషింపజేసి, వారిని పై భావాల వృద్ధికి, అవి తగ్గుముఖం పట్టకుండా

చూడటానికి అంకితమై ఉండేటట్లు (పురికొల్పటానికి) ఈ శాసనం వ్రాయించబడింది. దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు దీనిని తాము అభిషిక్తుడైన పన్నెండవయేట వ్రాయించినాడు.

5) దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు ఇలా అంటున్నాడు- మంచిని చేయటం కష్టం. మొదటిసారి మంచిని చేసినవాడు కొంత కష్టంగానే చేస్తాడు. నేను చాలా మంచి పనులను చేసినాను. నా కొడుకులు, మనుమలు వారి వారసులు, ఇలా ప్రపంచం నశించేంత (ప్రపంచం ఉన్నంత) వరకు ఇలాగే నడుచుకుంటే వారు కూడా చాలా మంచిని చేసినవారౌతారు. కాని వారిలో ఎవరైనా దీనిని ఉపేక్షిస్తే, చెడును చేస్తారు. చెడును చేయటం నిజానికి చాలా తేలిక.

గతంలో ధమ్మమహామాత్రులు ఉండేవారు కాదు. కాని నేను అభిషుక్తుడనైన పదమూడు సంవత్సరాలకు అటువంటి అధికారులను నియమించినాను. సంతోష, సంక్షేమాల కొరకు పనిచేస్తారు. వారు [4]గ్రీకులలో, కాంభోజులలో, గాంధారులలో, రాష్ట్రీకులలో, పితినికులలో, పశ్చిమ సరిహద్దులోని ఇతర ప్రజలలో పనిచేస్తారు.వారు ధమ్మానికి అంకితమై సైనికులలో, సేవాపతులలో, బ్రాహ్మణులలో, గృహస్థులలో, పేదవారిలో, వృద్ధులలో, వారి సంక్షేమానికి, సంతోషానికి పనిచేస్తూ, వారు వేధింపులకు గురికాకుండా చూస్తారు. వారు (ధమ్మ మహామాత్రులు) ఖైదీలను సరిగా చూడటానికి, ఇంకా ఒకవేళ ధమ్మ మహామాత్రులు "ఇతనికి పోషింపబడవలసిన కుటుంబం ఉంది" "అతడు మోహితుడు (bewitched)" "ఇతడు వయసు మీరినవాడు" అని గుర్తించినపుడు వారి విడుదలకు కృషి చేస్తారు. వారు ఇక్కడ బయటి పట్టణాలలో, నా అన్న దమ్ములకు, అక్కాచెల్లెండ్లకు చెందిన అంతఃపురాలలో, ఇతర బంధువులలో పనిచేస్తారు. నా రాజ్యంలో ధమ్మ మహామాత్రులు ధమ్మాన్ని ఆచరించేవారి మధ్యలో ఉంటూ, ఎవరు ధమ్మానికి అంకితమై ఉన్నారో, ఎవరు ధమ్మంలో స్థిరపడినారో, ఎవరు ఉదారులో నిశ్చయిస్తూ ఉంటారు.

ఈ ధమ్మశాసనం చిరకాలం ఉండటానికి, దానిని నా వారసులు అందుకనుగుణంగా నడుచుకోవటానికి వీలుగా రాతిపై వ్రాయించబడింది.

6) దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు ఇలా అంటున్నాడు- గతంలో రాజ్యవ్యవహారాలు, (సరిగా) నిర్వహింపబడేవికావు. రాజుకు అన్నివేళలా సమాచారం అందేది కాదు. కాని నేను ఇప్పుడు ఇలా ఆజ్ఞాపించాను- నేను తింటున్నప్పుడైనా, అంతఃపురంలో ఉన్నప్పుడైనా, పడకగదిలో ఉన్నప్పుడైనా, రథంలో, పల్లకీలో ఉన్నప్పుడైనా, ఉద్యానవనంలో ఉన్నప్పుడైనా, ఎక్కడున్నా, ఏ వేళలోనైనా ప్రజల సమస్యల్ని నాకు చేరవేసేటట్లుగా సూచనలనిచ్చి, సమాచారాన్ని తెచ్చేవారిని నియమించాలి. అందువలన నాకు వాటి గురించి నేనెక్కడున్నా ఆలోచించటానికి వీలౌతుంది. దానాల గురించి, ప్రకటనల గురించి నోటిమాటగా నేనేమి ఆజ్ఞాపించినా, లేదా మహామాత్రులకు తొందరపని ఉన్నపుడు, (అమాత్య) మండలిలో ఏకాభిప్రాయం కుదరనపుడు, వాద- ప్రతివాదాలు జరుగుతూన్నపుడు వాటి గురించి నాకు వెంటనే తెలియజేయాలి. ఇది నా ఆజ్ఞ. నేను శ్రమపడటంలో, నా కర్తవ్యాన్ని నిర్వహించటంలో ఎన్నడూ తృప్తిపడను. అందరి సంక్షేమమే నా విధియని నేను మనఃపూర్వకంగా భావిస్తున్నాను. పనిలో నిమగ్నం కావటం. తక్షణమే దానిని పూర్తి చేయటంలోనే దాని (అందరి సంక్షేమం యొక్క) మూలం ఇమిడి ఉంది. ప్రజలందరి సంక్షేమానికి పాటుపడటం కన్న మంచిపని ఏదీ లేదు. నేను ప్రాణులందరు తమ జీవితాల్లో సంతోషంగా ఉండటానికి మరణానంతరం స్వర్గాన్ని పొందటానికి వీలుగా చేస్తున్నదంతా వారి ఋణం తీర్చుకోవటం కోసమే చేస్తున్నాను.

అందువలన ఈ ధమ్మశాసనం చిరకాలం ఉండటానికి, దానిని చూసి నా కొడుకులు, మనుమలు, మునిమనుమలు అందుకనుగుణంగా నడుచుకొని ప్రపంచ సంక్షేమానికి

పాటుపడటానికి వీలుగా (రాతిపై) వ్రాయించబడింది. కాని ఇది (ప్రపంచ సంక్షేమం) ఎంతో శ్రమపడనిదే సాధ్యం కాదు.

7) మతాలన్నీ ఆత్మ నిగ్రహాన్ని, హృదయ పవిత్రతను కోరేవే కనుక అన్ని మతాలూ అన్నిచోట్లా ఉండాలని దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు కోరుకొంటున్నాడు. కాని ప్రజలు వివిధ రకాల కోరికలు, మనోభావనలూ కలవారు కనుక వారిని (ఆయా హృదయ పవిత్రత, కృతజ్ఞత, లేనివాడు నీచుడు)


గిర్నార్‌లోని 1,2 శిలా శాసనాలు

8) గతంలో రాజులు వినోదయాత్రలకు పోయెడివారు. ఆ యాత్రలలో వారు వేటలో, ఇతర వినోదాలలో గడిపేవారు. దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు అభిషిక్తుడైనా తర్వాత పది సంవత్సరాలకు 'సంబోధికి ధమ్మయాత్ర చేసి, అప్పటినుండి ధమ్మయాత్రలను సంకల్పించినాడు. (16) ఈ యాత్రల సందర్భంగా ఈ క్రింది పనులు చేయబడతాయి. శ్రమణ, బ్రాహ్మణుల సందర్శనం, వారికి ధమ్మాన్ని గురించి బోధించటం, వారితో తగిన విధంగా ధమ్మాన్ని గురించి చర్చించటం. ఇది దేవానాం ప్రియుని, ప్రియదర్శిని సంతోషపెడుతుంది. ఇది (ఈ సంతోషం) ఇంకొక రకమైన రాబడి (revenue).

9) దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు ఇలా అంటున్నాడు- రోగాలు వచ్చినపుడు, కొడుకుల, కూతుళ్ళ వివాహాల సందర్భంలో, పిల్లలు పుట్టినపుడు, ప్రయాణానికి బయలు దేరేటపుడు, ఇంకా ఇతర సందర్భాలలో ప్రజలు వివిధ కర్మకాండలు (మంగళకర్మలు) చేస్తారు, ప్రత్యేకించి స్త్రీలు ఎన్నో అనాగరికమైన, నిరుపయోగమైన కర్మకాండలు చేస్తూ ఉంటారు. ఈ రకమైన కర్మకాండలను ఎంత బాగా చేసినా వాటివలన కలిగే ఫలితం నామమాత్రమే. ధమ్మానికి సంబంధించిన కర్మలే గొప్ప ఫలితాన్ని ఇస్తాయి. ధమ్మానికి సంబంధించిన కర్మలు అంటే సేవకులు, నౌకర్ల పట్ల సరిగా ప్రవర్తించటం, ఆచార్యులను గౌరవించటం, ప్రాణుల పట్ల నిగ్రహంతో ఉండటం. శ్రమణ, బ్రాహ్మణుల పట్ల ఔదార్యాన్ని కలిగి ఉండటం. ఇవి, ఇంకా ఇతర విషయాలు ధమ్మకర్మలు అనబడతాయి. కాబట్టి ఒక తండ్రి, ఒక కొడుకు, ఒక యజమాని, ఒక మిత్రుడు, ఒక సహచరుడు, చివరకు ఒక పొరుగువాడు కూడా ఇలా చెప్పవచ్చును-"ఇది మంచిది. లక్ష్యం నెరవేరే వరకూ దీనిని ఆచరించాలి. ఇదే నేనే చేస్తాను" ఇతర కర్మలు ఫలితాన్ని ఇవ్వటం అనుమానాస్పదమే. ఎందుకనగా అవి తమ లక్ష్యాన్ని నెరవేర్చవచ్చును. నెరవేర్చక పోవచ్చును. ఒకవేళ అవి ఫలితాన్ని ఇచ్చినా అది ఈ లోకానికి సంబంధించినదే అయి ఉంటుంది. కాని ధమ్మకర్మ కాలపరిమితి లేనిది. ఈ లోకంలో అది తన లక్ష్యాన్ని నెరవేర్చకున్నా పరలోకంలో గొప్ప శుభాన్ని కలుగజేస్తుంది. ఇక ఈ లోకంలో అది లక్ష్యాన్ని నెరవేర్చినచోట ఒకడు ధమ్మకర్మల ద్వారా ఇహపరాల్లో, రెండు లోకాల్లోనూ గొప్ప శుభాన్ని పొందినవాడు అవుతున్నాడు.

10) దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు తన వైభవం, కీర్తి తాను పాలించే ప్రజలను

ఇప్పుడు గానీ, భవిష్యత్తులో గానీ, ధమ్మాన్ని గౌరవించేవారుగా, ధమ్మాన్ని ఆచరించేవారుగా మార్చలేకపోతే వాటిని పెద్దగా పట్టించుకోడు. ఇందుకొరకే దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు వైభవాన్ని, కీర్తిని కోరుకొంటాడు. దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు చేస్తున్న అన్ని ప్రయత్నాలూ తన ప్రజలు పాపం తక్కువగా కలవారై, పరలోకంలో సుఖంగా ఉండటం కొరకే. పుణ్యం లేకపోవటమే పాపం. ఇది (పుణ్యసంపాదనం) చిన్నవాడికైనా, గొప్పవాడికైనా ఇతర ఆశలను మాని గొప్ప ప్రయత్నం చేయనిదే సాధ్యం కాదు. నిజానికి గొప్పవాడికే అది చాలా కష్టం.

11) దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు ఇలా అంటున్నాడు- ధమ్మకానుక వంటి కానుక లేదు. ధమ్మస్నేహం వంటి స్నేహం లేదు. ధమ్మదానం వంటి దానం లేదు. ధమ్మచుట్టరికం వంటి చుట్టరికం లేదు. సేవకులు, నౌకర్ల పట్ల సరియైన ప్రవర్తన తల్లితండ్రుల పట్ల గౌరవము, మిత్రులపట్ల, సహచరులు, బంధువులు, బ్రాహ్మణులు, శ్రమణుల పట్ల ఔదార్యము, ప్రాణులను చంపకుండటం, వీనిలోనే ఆ ధమ్మం ఉంది. అందువలన ఒక తండ్రి, ఒక కొడుకు, ఒక సోదరుడు, ఒక యజమాని, ఒక స్నేహితుడు, ఒక సహచరుడు, లేదా ఒక పొరుగు వాడు ఇలా చెప్పాలి- "ఇది మంచిది. ఇదే ఆచరించవలసింది" ధమ్మాన్ని కానుకగా ఇవ్వటం ఒకడు ఈ లోకంలో ప్రయోజనాన్ని పొందటమే గాక పరలోకంలోనూ గొప్ప పుణ్యాన్ని పొందుతున్నాడు.

12) దేవానాం ప్రియుడు, ప్రియదర్శిరాజు అన్ని మతాలను చెందిన శ్రమణలను, గృహస్థులను ఆదరిస్తాడు. వివిధ రకాల గౌరవాల ద్వారా, కానుకల ద్వారా అతడు వారిని సత్కరిస్తాడు. కాని దేవానాం ప్రియుడు ప్రియదర్శిరాజు అన్ని మతాలలోని [6]సారభూతమైన సూత్రాలలో అభివృద్ధికి విలువ ఇచ్చినంతగా, కానుకలకు, సత్కారాలకు ఇవ్వడు. సారభూత సూత్రాల అభివృద్ధిని వివిధ రకాలుగా చేయవచ్చును కాని వాటన్నిటి మూలం మాటను నిందించక పోవటం. విమర్శకు కారణం ఉన్నప్పుడు కూడా దానిని సున్నితంగా చేయవచ్చును. కాని ఇతర మతాలను గౌరవించటమే మంచిది. ఇతర మతాలను గౌరవించినవాడు అలా చేయటం వలన తన మతానికి ప్రయోజనాన్ని కలిగించినవాడు అవుతున్నాడు. ఇంకా అందువలన ఇతర మతాలు కూడా లాభపడుతున్నాయి. ఇందుకు విరుద్ధంగా చేసినపుడు తన మతమూ దెబ్బ తింటుంది. ఇతర మతాలు కూడా దెబ్బ తింటాయి. మితిమీరిన భక్తితో, తన మతాన్ని కీర్తించే ఉద్దేశ్యంతో తన మతాన్ని పొగుడుకొని, పరమతాన్ని నిందించేవాడు తన మతానికే హాని కలిగించినవాడు అవుతాడు. అందువలన (మతాల మధ్య) సంబంధాలు ఉండటం మంచిది. ఇతరులు ప్రవచించిన సిద్ధాంతాలను కూడా వినాలి, గౌరవించాలి. దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు ఇతర మతాలలోని మంచి సిద్ధాంతాలను అందరూ చక్కగా నేర్చకొని ఉండాలని కోరుకొంటున్నాడు.

తన మతంలోనే తృప్తి పొంది ఉండేవారికి ఈ విషయాన్ని తెలుపాలి- దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు మతాల యొక్క సారభూత సూత్రాల (ఆచరణ) లో వృద్ధికి విలువ ఇచ్చినంతగా కానుకలకు, సత్కార్యాలకు ఇవ్వడు. ఈ లక్ష్యసిద్ధికై ధమ్మమహామాత్రులు, అంతఃపుర బాధ్యతలను చూచే మహామాత్రులు, బయటి ప్రాంతాల బాధ్యతను వహించే అధికారులు ఎందరో పనిచేస్తున్నారు. దీనివలన తమ మతామూ వృద్ధి చెందుతుంది. ధమ్మం కూడా ప్రకాశిస్తుంది.

13) దేవానాంప్రియుడు, ప్రియదర్శిరాజు తాను అభిషక్తుడైన ఎనిమిది సంవత్సరాలకు కళింగులను జయించినాడు. దానికోసం (జరిగిన యుద్ధం వలన) ఒకవందా యాభైవేల మంది తమ స్థానాల నుండి వెళ్ళగొట్టబడినారు. ఒక వందాయాభైవేల మంది చంపబడినారు. ఇంకా ఎందరో (దానికి సంబంధించిన ఇతర కారణాల వలన) చనిపోయినారు. కళింగులు

జయించబడిన తర్వాత దేవానాంప్రియుడు, ధమ్మం వైపుగొప్పగా ఆకర్షితుడైనాడు. ధమ్మప్రేమలో, ప్రచారంలో ఎంతో ఆసక్తిని చూపించినాడు. కళింగులను జయించినందుకు ఇప్పుడు దేవానాం ప్రియుడు ఎంతో పశ్చాత్తాపాన్ని పొందుతున్నాడు.

జయించబడని దేశం జయించబడినపుడు జరిగే హింస వలన, మరణాల వలన, ప్రజల వలసల వలన దేవానాంప్రియుడు ఎంతో బాధపడతాడు. కాని ఆ దేశాల్లో నివసించే శ్రమణులు, బ్రాహ్మణులు, ఆయా మతాలకు చెందిన గృహస్థులను, పెద్దలను, తల్లిదండ్రులను గౌరవించేవారు, మిత్రుల పట్ల, పరిచయస్థుల పట్ల, సహచరులు, బంధువుల పట్ల, సేవకులు, నౌకర్ల పట్ల తగిన విధంగా ప్రవర్తించేవారు గాయపడినపుడు, మిత్రులపట్ల, పరిచయస్థులను, తోడివారిని, బంధువులను చూసి దుఃఖించే వారిని చూచినపుడు ఇతకన్న ఎక్కువ బాధపడతాడు, (యుద్ధఫలితంగా) అందరికి కలిగే ఇటువంటి దుఃఖాలు దేవానాంప్రియుని బాధిస్తాయి.

[7]ఒక్క గ్రీకులలో తప్ప శ్రమణ, బ్రాహ్మణులనే ఈ రెండు సమూహాలు లేని దేశం లేదు. ఏదో ఒక మతంలో నిష్ఠ గల ప్రజలు లేని దేశం లేదు. అందువలన కళింగులను జయించినపుడు జరిగిన హత్యలలో, వలసలలో నూరోవంతు, వెయ్యోవంతు (ఎక్కడ) జరిగినా కూడా అది దేవానాంప్రియుని బాధిస్తుంది. క్షమింపబడటానికి అవకాశమున్నచోట, తప్పు చేసినవారు కూడా క్షమింపబడాలని ఇప్పుడు దేవానాం ప్రియుడు ఆలోచిస్తున్నాడు."

దేవానాంప్రియుని రాజ్యంలోని వనవాసులు కూడా సక్రమమమైన ఆచరణను కలిగి ఉండటానికి సముదాయించబడినారు. దేవానాంప్రియుడు పశ్చాత్తాపంతో ఉన్నప్పటికీ, అవసరమైతే వారిని శిక్షించే శక్తిని కలిగి ఉన్నాడు. కనుక వారు వారి తప్పులకు సిగ్గు పడాలి. చంపబడకూడదు. నిజంగా దేవానాంప్రియుడు తప్పు జరిగిన చోట కూడా గాయపరచక పోవటాన్ని, నిగ్రహాన్ని, అన్ని ప్రాణుల పట్ల పక్షపాతం లేకుండా ఉండటాన్ని ఆలోచిస్తున్నాడు.

ఇప్పుడు ధమ్మవిజయమే మంచి విజయమని దేవానాంప్రియుడు భావిస్తున్నాడు. అది ఇక్కడ గెలువబడింది. సరిహద్దులలో, చివరకు ఆరువందల యోజనాల దూరంలో గ్రీకురాజు అంటియోకస్ పాలించేచోట, దానికి ఆవల [8]టోలమీ, అంటిగొనొస్, మగస్, అలెగ్జాండర్ అనే నలుగురు రాజులు పాలించేచోట, అలాగే దక్షిణంలో చోళులలో, పాండ్యులలో, తామ్రపర్ణి వరకు కూడా గెలువబడింది. ఇక్కడ నా రాజ్యంలోని గ్రీకులలో, కాంభోజులలో, నాభకులలో, నాభపంక్తీయులలో, భోజులలో, పితినికులలో, ఆంధ్రులలో, పలిదసులలో, అంతటీ ప్రజలు ధమ్మాన్ని గురించి దేవానాంప్రియుడు ధమ్మాన్ని గురించి ఇచ్చిన ఆదేశాలను, సూచనల గురించి విని ఆచరిస్తున్నారు. ఆచరిస్తారు ఈ విజయం కూడా అల్పమైనదే. పరలోకంలో పొందే గొప్పఫలమే చాలా ముఖ్యమైనదని దేవానాంప్రియుని తలంపు.

నా కొడుకులు, మునిమనుమలు క్రొత్త విజయాలను పొందాలని ఆలోచించకూడదని, లేదా ఒకవేళ సైనిక ఆక్రమణలు చేస్తే వాటిని శాంతంగా, తక్కువ శిక్షలతో చేయాలని లేదా వారు ఇహ, పరాల్లో ఫలితాన్ని ఇచ్చే దీనిని తీవ్రమైన అంకితభావంతో ఆచరింతురుగాక!

14) దేవానాంప్రియుడు, ప్రియదర్శి ఈ ధమ్మశాసనాలను క్లుప్తంగా మరీ పెద్దగా, మరీ చిన్నగా కాకుంగా, విపులీకరించి వ్రాయించినాడు. నా రాజ్యం చాలా విశాలమైనది కనుక అంతటా వ్రాయింపబడనప్పటికీ అనేకచోట్ల (ఇవి) [9]వ్రాయించబడినాయి. ఇంకా వాటిని వ్రాయిస్తాను. ఇక్కడ కొన్ని అంశాలు వాటి మాధుర్యం వలన, ప్రజలు వాటిని చూసి, వాటికనుగుణంగా నడుచు కోవటానికి అనువుగా మళ్లీ, మళ్లీ వ్రాయించబడినాయి. కొన్ని

విషయాలు అసంపూర్ణంగా ఉంటే అది ఆ ప్రాంతం కారణంగా గాని, వస్తువునుబట్టి గాని, లేఖకుని దోషం వలన గానీ జరిగి ఉంటుంది. ❋

**పాదసూచికలకు వివరణ :**

**1.** చోళులు, పాండ్యులు అశోకుని రాజ్యానికి అవతల నివసించే దక్షిణ భారతీయులు. సత్యపుత్రులు, కేరళపుత్రులు ఇప్పటి కేరళ, దాని చుట్టుప్రక్కల గల రాజ్యాలు. ఇప్పటి శ్రీలంకను అశోకుని కాలంలో తామ్రపర్ణి అని పిలిచేవారు.

**2.** ఇది చట్టాన్ని అతిక్రమించే వారికి విధించబడిన శిక్షలను తెలియజేస్తూ మ్రోగించబడే భేరి అయిఉంటుంది. చూడండి - సంయుక్తనికాయం 4-244

**3.** 'రాజు ధార్మికుడైనపుడు ఇటువంటి శుభ నిమిత్తాలు కనిపిస్తాయని' ప్రాచీనులు అనేకుల వలెనే ఆశోకుడు కూడా భావించాడు.

**4.** అలెగ్జాండర్ భారతదేశాన్ని జయించిన తర్వాత గ్రీకులు (యోన= యవనులు) ఇప్పటి అఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ భూభాగాలలో పెద్దసంఖ్యలో నివసించసాగినారు. అంతకు ముందు కూడా అక్కడ చిన్న, చిన్న జనసమూహాలు నివసించేవి. ఈ భూభాగాలు అశోకుని రాజ్యం లోనివే.

**5.** బుద్ధగయను ప్రాచీనకాలంలో సంబోధి అనీ, వజ్రాసనమని కూడా పిలిచేవారు.

**6.** అన్ని మతాల సారం అన్నపుడు అశోకుని మనస్సులో అన్ని మతాలలోని నైతిక సూత్రాలు ఉండి ఉంటాయి.

**7.** భారతదేశంలోని చతుర్వర్ణ వ్యవస్థ వంటిది గ్రీకు దేశంలో లేదని బుద్ధుడు అన్నాడు. చూడండి- మజ్జిమ నికాయం-2-149

**8.** సిరియారాజైన అంటియోకస్- 2(261-246 బి.సి) టోలమీ ఈజిప్ట్ యొక్క ఫిలడెల్ఫస్ (285-247 బి.సి) అంటిగొనొస్ అంటే మాసిడోనియా రాజు గొనటోస్ (278-239 బి.సి) సిరెనే రాజు మాగస్ (300- 258 బి.సి) ఎపిరస్ రాజు అలెగ్జాండర్ (272-258 బి.సి)

**9.** అలా వ్రాయించిన వాటిలో మన కర్నూలు జిల్లాలోని ఎఱ్ఱగుడి శిలాశాసనం ఒకటి. ఇది గిర్నార్ శిలాశాసనానికి ప్రతిరూపమే.

*-రచయిత సెల్ : 94417 28538*



# "బుద్ధం- అశోకం" - నాటకం వివరాలు

గుంటూరు జిల్లా రేపల్లె ప్రాంతానికి చెందిన ప్రముఖ నాటక రచయిత మన్నె శ్రీనివాసరావు రచించి, స్వీయదర్శకత్వం వహించిన నాటకం "బుద్ధం-అశోకం". మొదటిగా రచయిత 'సమ్రాట్ అశోక' అనే నాటికను తయారుచేశారు. ఆ నాటికను ఆంధ్రరాష్ట్రంలో పలు ప్రదర్శనలిచ్చారు. ఈ నాటకానికి ప్రముఖ చలన చిత్రనటులు కళావాచస్పతి కొంగర జగ్గయ్యగారు ముందుమాట రాశారు. అలాగే సుప్రసిద్ధ సినీనటుడు, నాటకరంగ దిగ్గజం కాకరాల 'అశోక హృదయం' పేరుతో చక్కని వాఖ్యానం రాశారు. ఆత్రేయ రాసిన 'అశోక సమ్రాట్' నాటకాన్ని, శ్రీనివాసరావు రాసిన సమ్రాట్ అశోక నాటికను చక్కగా విశ్లేషించారు. సమ్రాట్ అశోక ప్రదర్శనల అనంతరం మిత్రులు, మేధావులు చెప్పిన సలహాతో రచయిత ఈ నాటికను "బుద్ధం-అశోకం" అనే పేరుతో నాటకంగా మలిచారు. ఈ నాటకం ఆంధ్రదేశంలోనే కాక కటక్, డెహ్రి అన్‌సోనే, ముద్గర్‌పూర్, డిన్సూర్, జగదర్‌పూర్, పూనే, రాయగడ్, అలహాబాద్, బెంగుళూరు, మద్రాస్‌లలో ప్రదర్శన లిచ్చారు. కటక్‌లో జరిగిన ప్రపంచ నాటకోత్సవాల్లో పాల్గొన్న ఈ నాటకానికి ఉత్తమ బహుమతి లభించింది. ఇంకా కృష్ణా ఉత్సవాలు, గోదావరి పుష్కరాలు, ఘంటసాల, బందరు, నల్లగొండ, నూతలపాడు, విజయవాడ, రేపల్లెలలో అనేక చోట్ల125కు పైగా ప్రదర్శనలు ఇవ్వటం జరిగింది.

ఈ నాటకంలో అశోకునిగా, బుద్ధునిగా ఈ నాటక రచయితే రెండు పాత్రలు పోషించి నటుడిగా కూడా ఆయన ఎన్నో బహుమతులు పొందారు. సుప్రసిద్ధ సంగీత దర్శకుడు, హార్మోనియం మాంత్రికుడు చిల్క ప్రసాద్ నేపథ్య సంగీతం ఈ నాటకానికి మరింత శోభనిస్తున్నది. అన్నపురెడ్డి శివరామిరెడ్డి, కాకరాల, యార్లగడ్డ భాస్కరరావు, పోలూరు సుబ్బారావు, శివభాస్కరరావు, శివనాగమల్లేశ్వరరావు, రామినేని శ్రీనివాసరావు, నన్నం నాంచారయ్య, వీర్ల వెంకటేశ్వరరావు లాంటి రంగస్థల ప్రముఖులు ఇందులో పాత్రధారులు. బౌద్ధసమ్మేళనాలు, సమావేశాలు జరిగే సమయాల్లో ఇలాంటి నాటక ప్రదర్శన ఎంతో ప్రయోజనకరంగా వుంటుంది. కావలసినవారు ఈ నాటక రచయితను సంప్రదించగలరు.

నాటక రచయిత సెల్ : 94402 41271

---

**అశోకుని శాసనాలు-మానవత్వ ప్రతీకలు** *(12వ పేజీ తరువాయి)*

తానేం చేశాడో, తద్వారా తానేం సాధించాడో నిగర్వంగా చెప్పుకున్న అశోకుని యీ శాసనాలు అశోకుడాచరించిన మానవతా మార్గం సత్ఫలితాల నిచ్చాయని చాటుతున్నాయి.

"When ever I consider the psychic land scape of humanity, the image of Ashoka the greate, India's outstanding ancient soveregn comes inevitably to my mind" (-Daisaka Ikeda)

అన్న జపాను దేశ బౌద్ధ తాత్వికుని మాటలు అక్షర సత్యాలని ఈ శాసనాలు నిరూపిస్తాయి.

***ఆరోగ్య పరమాలాభా, సన్తుట్ఠీ పరమం ధనం।***

***విస్సాస పరమా ఞాతీ, నిబ్బానం పరమం సుఖం॥*** (ధమ్మ పదం15-8)

ఆరోగ్యమే పరమ లాభము, సంతృప్తియే పరమ ధనం, విశ్వాసమే పరమ బంధువు, నిర్వాణమే పరమ సుఖం- అనే బౌద్ధ సూక్తికి అద్దం పట్టే అశోకుని పాలనను వివరించే యీ శాసనాలు ఆనాటికే కాదు, నేటికీ మానవత్వ ప్రతీకలుగా నిలిచి ఉన్నాయన్న మాట ఎంతో వాస్తవం.

-రచయిత్రి సెల్ : *98403 31820*

# అశోకుడు- విపశ్యన

-శ్రీ సత్యనారాయణ గోయంకా

**బు**ద్ధుడి తర్వాత 200 సంవత్సరాలు గడుస్తూ వుండగా అశోక చక్రవర్తి మగధ సామ్రాజ్యపాలన చేపట్టడం జరిగింది. ఇతడు ఎంతో క్రూరుడు. తన రాజ్యకాంక్షతో, సామ్రాజ్య విస్తరణ కొరకై ఎందరి చావుకు కారకుడయ్యాడో, ఎందరిని హతమార్చాడో లెక్కలేదు. చండ అశోకుడని పేరుపొందాడు. అతని రాజ్యపిపాస ఎంతటిదంటే తన సామ్రాజ్య విస్తరణ కొరకు ఎక్కడికంటే అక్కడికి వెళ్ళి, యుద్ధం చేసి రాజ్యాలను ఆక్రమించుకునేవాడు. తన సామ్రాజ్యాన్ని పెంచుకునేవాడు. కళింగ యుద్ధంలో అతని వల్ల రక్తపుటేరులు ప్రవహించాయి. లెక్కకు మించిన సైనికుల ప్రాణాలు బలి గొన్నాడు. ఎందరో వికలాంగులయ్యారు. ఇది చూసి అతని మనస్సు చలించి పోయింది. ఒక్కసారిగా యుద్ధోన్మాదపు మత్తు వదిలింది. తెలివిలోకి వచ్చాడు. అతని అదృష్టం ఫలించి ఆ సమయంలో అతనికి ఒక భిక్షువు తారస పడ్డాడు. అశోకుణ్ణి ఆ భిక్షువు అడిగాడు....

"నాయనా! ఏమిటి నువ్వు చేస్తున్నది? దీని నుండి నీకేం లభిస్తుంది? ఇంతమంది ప్రాణాలు బలిగొని నీవేం సుఖశాంతులు పొందగలవు? సామ్రాజ్య విస్తరణే నీకు ప్రధానమైతే ధర్మసామ్రాజ్య విస్తరణ చేయి, ప్రేమ సామ్రాజ్యాన్ని విస్తరింపజేయి. ప్రజలలో సుఖశాంతులు విస్తరింపజేయి. అంతేగాని ఈ విధంగా ప్రజల రక్తం చిందిస్తూ జరిగే సామ్రాజ్య విస్తరణతో నీవు సుఖంగా ఉండగలవా? శాంతిని పొందగలవా?" అని ప్రశ్నించాడు.

భిక్షువు మాటలు విని అశోకుడు బదులు పలికాడు....

"లేదు. నాకు శాంతి లభించటం లేదు. ఇంతమంది జనం దుఃఖంలో ఉండగా చూసి నేను కూడా దుఃఖానికి గురవుతున్నాను. దుఃఖితుణ్ణవుతున్నాను" అన్నాడు.

ఆ భిక్షువు అశోకుడికి ధర్మం గురించి తెలియజెప్పాడు. దానితో అశోకుడు మారిపోయాడు. చండ అశోకుడు ధర్మ అశోకుడయిపోయాడు. "ఎప్పటివరకయితే విపశ్యన అభ్యాసం చేయడం జరగదో అప్పటివరకు బుద్ధుడి విద్యను పూర్తిగా అర్థం చేసుకోనట్లేనని, విపశ్యనను అభ్యసించడం ముఖ్యమనే" విషయం అశోకునికి తెలిసింది.

పాటలీపుత్రం (ఈనాటి పాట్నా) అతని రాజధాని. తన రాజధానిని వదిలి 300 రోజులు బయట గడిపాడు. రాజ్యవ్యవస్థ చాలా పటిష్టంగా ఏర్పాటు చేసి ఉన్నందున అది స్థిరంగా నిలిచింది. అతను లేని లోటు కనిపించకుండా, రాజ్యపాలన ఎలాంటి ఒడుదుడుకులు లేకుండా సాఫీగా కొనసాగింది. పాటలీపుత్రమును వదిలి రాజస్థాన్‌లోని బిరాట్ నగరం (వైరాఠ్) చేరుకున్నాడు. అక్కడ ఒక విపశ్యనాచార్యుడి వద్ద విపశ్యన నేర్చుకుని అభ్యాసం చేశాడు. విపశ్యన చేయడంతో అతని కళ్ళు పూర్తిగా తెరచుకున్నాయి. అజ్ఞానపు పొరలు తొలగిపోయాయి.

"అరే! బుద్ధుడి వాణి చదివితేనే ఎంతో మధురంగా వుంది. అయితే అసలు ధర్మరసాన్ని ఏ విధంగా రుచి చూడాలో ఈ విద్య ద్వారా వీళ్ళు నేర్పుతారు!"

మనిషి మారాడు. పూర్తిగా మారిపోయాడు.

సరిగ్గా ఇదే విషయం ఈనాడు కూడా మేము చూస్తున్నాము. నా విషయంలోనూ ఇదే జరిగింది. ఇక్కడికి వచ్చి విద్యను నేర్చుకునే వాళ్ళను గమనించినప్పుడు కూడా ఇదే విషయం తెలుస్తుంది. శిబిరంలో చేరి సాధన చేస్తూ చేస్తూ, మధ్యలో "అయ్యో! ఇది మా అమ్మ చేస్తే బాగుంటుంది, మా నాన్న చేస్తే బాగుంటుంది. అందుకని ఇతరులందరికీ అందించాలనిపిస్తుంది.

మరి ఇతడేమో దేశానికి చక్రవర్తి కదా! ధర్మామృతం చవి చూడగానే ఉండబట్టుకో లేక పోయాడు.

"ఈ విద్య దేశమంతటా వ్యాపించాలి. ప్రజలందరికీ ఈ విద్య లభించాలి" ఇటు వంటి భావం అశోకుణ్ణి ఈ విద్యను నలు దిశలకూ వ్యాపింపజేసేటందుకు ప్రేరణ కలిగించింది.

మొదటి శిలాశాసనం బిరాట్ నగరం లో చెక్కించాడు. ఆ తరువాత దేశమంతటా శిలాశాసనాలు తయారు చేయించి, ధర్మ వాణి వ్రాయించి వాటిని స్థాపింపజేశాడు. అయితే శిలాశాసనాలు స్థాపించినంత మాత్రాన ధర్మం వ్యాప్తిచెందదు. కాబట్టి ధర్మం నేర్పే ఆచార్యులను, ధర్మామాత్యులను తయారు చేయించాడు. దేశంలో అన్ని చోట్లా ధర్మం నేర్పుటకై, విపశ్యన విద్యను నేర్పుటకై వాళ్ళను పంపాడు. ప్రజలకు ఈ విద్యను అందించాడు. దానితో సత్ఫలితాలొచ్చాయి. ప్రజల జీవితాలలో శాంతిసుఖాలు వెల్లివిరిశాయి. ఒక శిలాశాసనంలో అశోకుడు ఇలా వ్రాయించాడు.


విపశ్యనలో అశోకుడు

"నా కన్నా ముందు ఎందరో చక్రవర్తులయ్యారు. తమ పాలనలో ప్రజలందరూ సుఖశాంతులతో జీవించాలని వాళ్ళందరూ కోరుకున్నారు. పిల్లలు తమ తల్లిదండ్రులను గౌరవించాలనీ, పెద్దలపట్ల విధేయత కలిగి వుండాలనీ, దేశంలో సుఖశాంతులు నెలకొని వుండాలనీ వాళ్ళంతా అనుకున్నారు. కానీ వాళ్ళలో ఎవ్వరూ తమ ప్రయత్నంలో సఫలీకృతులు కాలేక పోయారు. నేను ఇందులో సఫలుణ్ణయ్యాను. అయితే నేను సఫలుణ్ణెలా అయ్యాను? ధర్మవాణిని వ్యాపింపజేశాను, కాని దాని నుండి ఫలితం అంతగా రాలేదు. ప్రజలకు విపశ్యన నేర్పించే ఏర్పాట్లు చేశాను. దానివల్ల సఫలీకృతుడయ్యాను. ప్రజలలో శాంతి వచ్చింది. వాళ్ళలో ధర్మం జాగృతమయ్యింది"

అశోకుడి గురించి ప్రస్తావించినప్పుడల్లా మనకు ఒక విషయం జ్ఞాపకానికి వస్తుంది. మన దేశానికి చెందిన ఒక చక్రవర్తి తన రాజ్యవిస్తరణా కాంక్షను వదిలిపెట్టి శేష జీవితమంతా జన కల్యాణానికై, లోక కల్యాణం కొరకై పాటు పడ్డాడనే విషయం గుర్తుకొస్తుంది. కళింగ యుద్ధం తరువాత మళ్ళీ తాను ఎప్పుడూ ఇంకొక రాజ్యం మీద దాడికి పూనుకోనని నిశ్చయించుకున్నాడు. అదే ప్రకారం నడచుకున్నాడు. ధర్మ విస్తరణకై ధర్మదూతలను నలుదిశలకూ పంపాడు. పొరుగు దేశాలలో ధర్మవాణి వ్యాప్తి చెందించడానికి అతనే మూల కారకుడు. ఈ ఉపకారం అతనిదే. ధర్మవాణితో పాటు విపశ్యన కూడా ఆయా దేశాలకు వెళ్ళింది. అర్హంతులైన భిక్షువులను విపశ్యన నేర్పుటకై అన్ని దేశాలకు పంపాడు. దురదృష్టవశాత్తు మనదేశంలో బుద్ధవాణితో పాటు విపశ్యన విద్య కూడా అంతరించి పోయింది. విద్య పేరుకయినా మిగలలేదు. అయితే బయటి దేశాలలో ఇది కాపాడబడింది. అశోకుడే గనుక అలా బయటి దేశాలకు ధర్మవాణిని, విద్యను వ్యాపింపజేయక పోయినట్లయితే– ఈనాడు ఇలా బర్మాలో విపశ్యన సురక్షితంగా కాపాడబడి మనకు ఎలా లభించేది చెప్పండి?

('విపశ్యన' మాసపత్రిక మే 2005 నుండి)

# అశోక దర్శనం!

-డా॥ వెనిగళ్ళ రాంబాబు

ప్రగతిశీల హృదయ ప్రక్షాళనము చెంది
భిక్షు విహిత ధర్మ దీక్ష పొంది
యుద్ధ భూమినతడు బుద్ధభూమిగ మార్చె!
శిధిల జగతికతడు సేద తీర్చె!!

అగ్రనిమ్న వర్ణ అసమానతలు లేని
ద్వేష జనిత మృత్యు ఘోష లేని
శాంతి నిలయమైన సంఘమై వర్ధిల్లె
భరత ఖండమతని పాలనమున!

ఆ కళింగ ఆ కళంకము మాన్పు
ప్రాణవాయువులను ప్రజకు పంచె!
వీధి వీధి లోన వృక్షాలు నాటించి
ఆకులందశోకుడావహించె!!

సూక్తి సుధ స్రవించు స్థూపాలు నిర్మించె!
బీద సాద జనుల నాదరించె!
దేశమెల్ల జ్ఞాన దీపాలు వెలిగించె!
ఊరు వాడలెల్ల ఉద్యమించె!

సత్య సద్వివేక సౌజన్య సారమౌ
సహనమే అశోక శాసనమ్ము!
ధీర హృదయ జీవకారుణ్య హారమౌ
ధర్మమే అశోక దర్శనమ్ము!

# అడుగో... అశోకుడు

-జె.ఎస్. రఘుపతిరావు

అడుగో అడుగో అశోకుడు
అడుగో అడుగో అడుగడుగో ॥అడుగో॥

1) అడుగడుగునను అహింస అలర
తడబడుచు ధర్మాన్ని వెతుకుచు
అర్హత పదవికి అడుగులు వేయుచు
అంతర్ముఖ ఆలోచనామృతుడై ॥అడుగో॥

2) రణరంగమున రక్తము చింద
ఎనలేని పరితాపము నొంద
ఘనమౌ బుద్ధుని ధర్మం చెంత
క్షణంలోన పరివర్తన చెందె ॥అడుగో॥

3) అంగులీమాలి మారినట్లుగా
దొంగలు సైతం లొంగినట్లుగా
చండాశోకుడు ధర్మాశోకుడై
పండించె భరతోర్విని కరుణన్ ॥అడుగో॥

4) ఉత్తరాదిని దక్షిణాదిని
ఏకంజేసి సమైక్య ఖండముగ
ఎల్లజనుల ఉల్లము రంజిల్ల
ఏలె ఈ నేల జాలి పొరలగా ॥అడుగో॥

5) అశోక చక్రం అవనీ తలమున
విశేషధర్మ ప్రచారమాయె
స్తూప చైత్య విహార కల్పనా
చక్రవర్తియై శోభిలినాడు ॥అడుగో॥

రచయిత సెల్ : *94416 34533*

## "అశోక చక్ర" అవార్డు

**భా**రత రక్షక విభాగానికి చెందిన అత్యున్నత పురస్కారాలలో 'అశోకచక్ర' అతి పెద్దది. మిలిటరీ, నౌకాదళం, వాయుసేనలకు సంబంధించి ప్రతి సంవత్సరం ఇచ్చే పురస్కారం. ఈ పురస్కారాన్ని1952 జనవరి 4న 'అశోకచక్ర' అనే పేరుతో భారత ప్రభుత్వం ప్రకటించింది. మొదట్లో ఈ పురస్కారాన్ని అశోకచక్ర ఒకటి, రెండు, మూడు తరగతులుగా ఇచ్చేవారు. ఆ తర్వాత 1వ తరగతికి అశోకచక్ర పేరుతో, 2వ తరగతికి కీర్తిచక్ర పేరుతో, 3వ తరగతికి సూర్యచక్ర పేరుతో ఇస్తున్నారు. అశోకచక్ర తర్వాత ఇచ్చే పురస్కారం 'పరమ వీరచక్ర' మాత్రమే. 1999 నుండి అశోకచక్ర పురస్కారాన్ని గుండ్రని బంగారు నాణెంగా అందిస్తున్నారు. దీని వ్యాసం 1.3/8 అంగుళాలు. ఈ నాణెం మధ్యభాగంలో 'అశోకచక్రం' ఉంటుంది. భారత వ్యోమగామి, వైమానిక దళానికి చెందిన రాకేష్‌శర్మకు ఈ అవార్డు 1984లో లభించింది.

# అశోకావదానం

-చెన్నూరు ఆంజనేయరెడ్డి

క్రీ.శ. 1837వ సం॥లో జేమ్స్ ప్రిన్సెప్ బ్రాహ్మీలిపిలో వున్న అశోక శాసనాల్ని చదివేంత వరకు అశోకుని గురించి భారతదేశంలో ఎవరికీ పెద్దగా తెలియదు. అంతకుముందు అశోక శాసనాలున్న ఈ రాతిస్తంభాలను, అవి ఏమిటో తెలుసుకోలేక ప్రజలలో వీటికి భీముని చేతికర్రలనే పిట్టకథలు ప్రచారంలో ఉండేవి. 1837లో ఈ శాసనాల్ని చదివిన ప్రిన్సెప్ కూడా 'దేవానాంప్రియ' అంటే మొదట ఆయన శ్రీలంక రాజైన దేవానాంప్రియ అని పొరబడ్డాడు. భారతదేశపు చక్రవర్తి అయిన అశోకుడు అని అనుకోలేదు. తరువాత కొన్నాళ్ళకు జార్జి టర్నర్ అనే పండితుడు ఇవి అశోకుని శాసనాలని నిర్ధారించాడు. ఆ తరువాత భారతదేశపు చరిత్రలోనే కాక ప్రపంచ చరిత్రలోనే అశోకునికొక విశిష్టస్థానం లభించింది.

ప్రముఖ చరిత్రకారుడు హెచ్.జి.వెల్స్ తన ప్రపంచ చరిత్రలో అశోకుని గురించి ఇలా శ్లాఘించారు. "చరిత్ర పుటలలోకి ఎక్కిన వేలాదిమంది చక్రవర్తులలో అశోకుడొక్కడే వేవెలుగులతో ప్రకాశిస్తున్న ధృవతార. ఓల్గా నది నుంచి జపాన్ వరకు ఉన్న దేశాలన్నిటిలో ముఖ్యంగా చైనా, టిబెట్ దేశాలలో ఈయనకు మహోన్నత స్థానం ఉన్నది. కాన్‌స్టంటీన్, చార్లే మాగ్నె చక్రవర్తుల కన్నా అశోకుడే ఎక్కువమంది ప్రజల హృదయపీఠాన్ని అలంకరించాడు."

హెచ్.జి.వెల్స్ ఇలా వర్ణించడంలో అతిశయోక్తి ఏమి లేకున్నా ఆయన చెప్పినదానికి చిన్న సవరణ చేయాలి. ప్రపంచ చరిత్రలో అశోకుని స్థానం ఆయన శాసనాల వల్ల 19వ శతాబ్దంలోనే వచ్చినా, అంతకుముందే ఆసియాలోని బౌద్ధ దేశాలన్నింటిలోనూ అశోకుడు ఆదర్శ పాలకుడిగా గణుతికెక్కినాడు. ఆయనను బౌద్ధసాహిత్యంలో "చతుర్భాగ చక్రవర్తి" (ప్రపంచంలో నాల్గవభాగం పరిపాలించినవాడు) అన్నారు. అశోకుని ఈ ప్రపంచ ఖ్యాతికి కారణం బౌద్ధ వాఙ్మయంలో భాగమైన అవదాన సాహిత్యం. అవదాన సాహిత్యంలో ముఖ్యమైన గ్రంథాలు: క్షేమేంద్రుని అవదాన కల్పలత, అశోకావదానమాల, పాళీ సాహిత్యంలోని లోకపఙ్ఞత్తి, తారానాథుని ధర్మచరిత్ర వీటన్నింటికన్నా ప్రముఖమైన గ్రంథం "అశోకావదానం" అనే సంస్కృత గ్రంథం. ఈ గ్రంథం మధ్య ఆసియాలోని చైనా, కొరియా, టిబెట్, జపాన్ భాషల్లోకి అనువాదం పొంది అశోకునికి సమున్నతస్థానం కలిగించింది. అశోకుని గురించి పాళీగ్రంథాలలో కూడా ఎంతో కొనియాడారు. ముఖ్యంగా శ్రీలంక బౌద్ధ వాఙ్మయంలోని మహావంశ, దీపవంశ గ్రంథాలలో బుద్ధఘోషుని పాళీసాహిత్యంలో అశోకునికి ఉన్నత స్థానం ఉన్నది.

అశోకావదానం బౌద్ధసాహిత్యంలోని ప్రముఖ గ్రంథమైన దివ్యావదానంలో ఒక భాగం. మొదటి నుంచి దీనికి ఒక ప్రత్యేకమైన స్థానం కలిగి ఒక గ్రంథంగా సంతరించుకొంది. ఈ గ్రంథం చైనా భాషలోకి క్రీ.శ. 4-5వ శతాబ్దంలోనే అనువదింపబడి అశోకరాజ అవదానంగా, అశోకరాజ సూత్రంగా ప్రాముఖ్యతలోకి వచ్చింది. ఈ గ్రంథంలో అశోకుని గురించేకాక, అశోకుని జీవితంలో ప్రముఖుడైన ఉపగుప్తథేర గురించి, యవ్వనంలో ఆయనకు, నగరశోభిని అయిన వాసవదత్తకు ఉన్న ప్రేమ వ్యవహారాలు, ఆ తరువాత మారుని జయించి, విషయ లోలత్వం నుంచి విరక్తుడైన ఉపగుప్తుడు బౌద్ధభిక్షువుగా పరివర్తన చెందడం ఇందులో ప్రస్తావించబడ్డాయి. ఈ గ్రంథం ప్రకారం, పూర్వజన్మలో అశోకుడు 'జయ' అనే చిన్నబాలుడుగా వీధిలో ఆడుకుంటున్నప్పుడు భిక్షాటనకై వెళ్తున్న బుద్ధుని చూచి తన చేతిలో ఏమీ లేనందువల్ల ఒక పిడికెడు మట్టిని ఆయనకి వినమ్రుడై సమర్పిస్తాడు. ఈ పుణ్యకర్మ వలన అశోక చక్రవర్తిగా


శ్రీలంకలో అశోకుని విగ్రహం

పునర్భవం చెందు తాడు. బుద్ధుని మహాపరినిర్వాణం తరువాత అశోకుడు మగధ రాజ వంశంలో బిందుసారుని తనయు డుగా జన్మిస్తాడు. ఈ గ్రంథంలో అశో కుని గురించి ఇలా వుంది. అశోకుడు కురూపి అని, అందువలన తండ్రి బిందుసారునికి ప్రీతిపాత్రుడు కాలే దని వుంది. కాని రాజాస్థానంలోని జ్యోతిష్యులు అశోకుడు ఎప్పటికైనా చక్రవర్తి అవుతాడని జోస్యం చెప్పారు. యువరాజు కాబోతున్న తన సవతి తల్లి తనయుణ్ణి అశోకుడు కుతంత్రాలు పన్ని పరిహరించి సింహాసనాన్ని అధిష్టిస్తాడు. ఈ భ్రాతృద్రోహం కారణంగా అశోకుని ప్రజలందరూ చండ అశోకుడుగా పిలువసాగారు. అశోకుడు ఒక పెద్ద కారాగారాన్ని నిర్మించి అందులో తనకు నచ్చని వారందరినీ బంధించి, బాధించి, చిత్రహింసలు పెట్టి చంపేవాడు. ఒకనాడు ఈ కారాగారాన్ని ఒక బౌద్ధభిక్షువుని కూడా తీసుకువచ్చి హింసిస్తాడు. కాని ఆ యువభిక్షువుని ఈ హింసలు ఏ బాధని కలిగించలేకపోతాయి. ఆ భిక్షువు యొక్క శాంత స్వభావాన్ని, అతీతశక్తులకు, నిర్భయానికి ఆశ్చర్యచకితుడై, అశోకుడు బౌద్ధానికి ఆకర్షితుడవుతాడు. తాను నిర్మించిన కారాగారాన్ని తనే స్వయంగా ధ్వంసం చేసి పుణ్యకార్యోన్ముఖుడవుతాడు. తన సామ్రాజ్యంలో ఎనభై నాలుగు వేల బౌద్ధస్థూపాలను నిర్మించి ధర్మ అశోకుడిగా పరివర్తన చెందుతాడు.

ఇంకా ఈ అశోకావదానంలో అశోకుని ధర్మకార్యాలను గురించి, ఎన్నో కథలున్నాయి. మొదట తన సోదరుడైన వీతాశోకుడికి, తన మంత్రి అయిన యశునికి, బౌద్ధ ధర్మాన్ని గురించి ఎల్లప్పుడూ బౌద్ధభిక్షువులను గౌరవించవలసిన బాధ్యతనూ తెలుపుతాడు. ఆ తరువాత ఉపగుప్తథేరుని ఆశ్రయించి, ఆయనతో కలిసి బౌద్ధ పవిత్రస్థలాలను దర్శిస్తాడు. ఆ తరువాత తనే స్వయంగా "బుద్ధగయను" సందర్శించి బోధివృక్షానికి ప్రణమిల్లుతాడు. ధర్మరక్షణ కోసం తాను 5సం॥ కొకసారి 'పంచవార్షిక' అనే సమాగమాన్ని నిర్వహిస్తుంటాడు. అలాంటి సమాగమాల్లో పిండోల భరద్వాజుడనే అర్హతుడ్ని దర్శిస్తాడు. దివ్యపురుషుడైన పిండోల భరద్వాజుడు తాను బుద్ధుని సమకాలికుడినని, బౌద్ధధర్మవ్యాప్తిని దర్శించడానికి తన జీవితాన్ని తను పొడిగించుకున్నానని చెప్పాడు. ఈ అశోకావదానంలోనే యువరాజైన కుణాలుని కథ కూడా ఉంది. కుణాలుడు అశోకుని కుమారుడు. ఎంతో ధార్మికమైన వ్యక్తి, అందమైన యువరాజు ఈ

కుణాలుడు తన తండ్రికి ఎంతో ప్రీతిపాత్రుడు. కుణాలుని సవతి తల్లి, అశోకుని రెండవభార్య అయిన తిష్యరక్షిత కుటిల బుద్ధికలది. కుణాలుడు రాజధాని నుండి దూరంగా వున్నప్పుడు తన కుతంత్రాలతో అతని రెండు కళ్ళు తీయించి అంధుణ్ణి చేస్తుంది. బాధితుడైన కుణాలుడు జీవితంలోని దుఃఖాన్ని అనిత్యతను తెలుసుకొని అర్హతుడవుతాడు. ఆ తరువాత తంబూరా వాయించుకొంటూ యాచకుడై జీవితాన్ని గడుపుతూ తుదకు రాజధాని చేరుకుంటాడు. అంధయాచకుడు తన కుమారుడేనని తెలుసుకున్న అశోకుడు బాధాతప్తహృదయుడై అక్కున చేర్చుకుంటాడు.

కుణాలుని ఉదంతం తరువాత అశోకావదానంలో అశోకుని చివరిదినాల ప్రస్తావన ముఖ్యమైనది. భయంకర వ్యాధిగ్రస్తుడైన అశోకుడు దాన ప్రాముఖ్యతను తెలుసుకొని నిరంతరమూ దాన నిమగ్నుడై కోశాగారంలోని ధనాన్ని దానానికే వినియోగిస్తుంటాడు. కోశాగారం ఖాళీయై రాజ్యం బలహీనమవుతున్నదన్న భయంతో మంత్రులందరూ కలిసి అశోకుడిని కోశాగారానికి వెళ్లకుండా అడ్డుకుంటారు. అప్పుడు అశోకుడు తన స్వంతధనాన్ని దానానికి వెచ్చిస్తుంటాడు. కొన్నాళ్ళకి మంత్రులు దీనిని కూడా అడ్డుకుంటారు. ఒకప్పుడు ఎంతో బలవంతుడైన చక్రవర్తి ఇప్పుడు నిస్సహాయతతో, నిర్వీర్యుడై మరణశయ్యలో ఉంటాడు. చివరకు తన వద్ద మిగిలిన సగం ఉసిరిక కాయను తన అంతిమ దానంగా భిక్షుసంఘానికి పంపుతాడు. ఎంతో పుణ్యాన్ని గడించిన ఈ చక్రవర్తి రాచరికపు ఉత్థాన పతనాలను తెలుసుకొని నిర్మలమైన హృదయంతో, నిశ్చింతగా మరణిస్తాడు.

అశోకుని మరణానంతరం పుష్యమిత్రశృంగుని చేతిలో అశోకుని వారసుడైన బృహద్రథుడు హత్య గావింపబడటం. బౌద్ధభిక్షువులని పుష్యమిత్రుడు హింసించడం, మగధసామ్రాజ్యంలో బౌద్ధం అంతరించడం- ఈ విషయాలన్నీ ప్రస్తావించబడి నాయి. 'అనిత్యత' అనేది అన్నిం టికీ, చివరికి బుద్ధధర్మానికి కూడా వర్తిస్తుందని అశోకావదానం తెలుపుతుంది.

అవదాన సాహిత్యానికి బౌద్ధ వాఙ్మయంలో ఎంతో ప్రాధాన్యత ఉన్నది. అవదానాలు ఒకవ్యక్తి జీవితంలో కుశల, అకుశల కర్మలు వాటి ద్వారా వచ్చే ఫలితాలని వివరిస్తాయి. ఈ అవదాన సాహిత్యాన్ని, ధర్మప్రచారకులు వారి ధర్మబోధనలో జాతక కథలు లాగా ఉపయోగిస్తారు. జాతక కథలు బోధిసత్త్వుని పూర్వ జన్మలకు సంబంధించినవి. అవదానాలు సామాన్య మానవులకు సంబంధించినవి. అశోకావదానం అశోకునికి, అతని కుటుంబానికి సంబంధించిన కర్మవిపాకాన్ని


కర్ణాటకలోని కనగళహళ్ళి స్థూపంపై
మహారాణితో అశోకుడు


అశోకుడు రూపొందించిన
నాలుగు సింహాల ప్రతిమ

గురించి తెలుపుతుంది. ముఖ్యంగా అశోకుని కుశల కర్మలను గురించి, భిక్షు సంఘంతో ఆయనకున్న సంబంధాన్ని గురించి తెలుపుతుంది. ఇలాంటి సాహిత్యమే కొంత పాళీ సంప్రదాయంలో దీపవంశ, మహావంశ అనే గ్రంథాలలో ఉన్నా, ఈ గ్రంథాలు థేరవాద సాంప్రదాయానికి ప్రాముఖ్యతనిస్తాయి. ఉదాహరణకు, అశోకుని దానకార్యాల వల్ల భిక్షు సంఘం ఎంతో సుఖ వంతమైన జీవితం గడుపుతున్నందు వల్ల కొంతమంది సాంప్రదాయేతర భిక్షువులు అందులో చేరుకున్నారని వారి ఆలోచనలు థేరవాదానికి విభిన్నంగా ఉన్నందు వలన సంప్రదాయబద్ధులైన థేరవాదులు ద్వైమాసిక ఉపోసథను పాటించడం మానుకున్నారని ఈ గ్రంథాలు వివరిస్తాయి. అప్పుడు అశోక చక్రవర్తి మొగ్గలీపుత్త తిస్స సహకారంతో భిక్షువులందరినీ పరీక్షించి 60వేల మంది సాంప్రదాయేతర భిక్షువులను సంఘ బహిష్కరణ చేశారని ఆ గ్రంథాలు చెప్తాయి. విభజ్యవాద భిక్షువుల్నే సంఘంలో ఉంచారని తెలుపు తున్నాయి. భిక్షు సంఘోద్ధరణలో అశోకుడు థేరవాదులకి ప్రాముఖ్యతను ఇచ్చాడని చెప్పడమే దీని ముఖ్యోద్దేశం. కాని అశోకావదానంలో మొగ్గలీపుత్తతిస్స థేరను గురించి గాని, తృతీయ బౌద్ధసంగీతి గురించి గాని ఎక్కడా ప్రస్తావన లేదు. అవదానాల ముఖ్యోద్దేశం ఉపాసకుల జీవితంలో పుణ్య, పాప కర్మల ఫలితాలను వివరించడమే. కాని భిక్షుసంఘోద్ధరణ కాదు. అదే విధంగా అశోకావదానం బౌద్ధవిస్తరణ గురించి ప్రస్తావించదు. మహావంశంలో ఈ విస్తరణ గురించి ప్రస్తావించబడింది. మూడవ బౌద్ధసంగీతి తర్వాత బౌద్ధధర్మ విస్తరణ కోసం ఏ భిక్షువులను ఎక్కడకు పంపింది తెలుపుతూ, మహావంశంలో అశోకుడు తన కుమారుడు మహీందుని సింహళ ద్వీపానికి పంపాడని తెలుపుతుంది. ఇది థేరవాద బౌద్ధానికి, సింహళబౌద్ధ సాంప్ర దాయానికి విశిష్టస్థానాన్ని కూర్చిపెట్టడమే ఈ ప్రయత్నం.

అశోకావదాన గ్రంథకర్త ఎవరనేది తెలియలేదు. కాని 4వ శతాబ్దంలోనే ఇది చైనా భాషలోకి అనువదించబడింది. అందువలన ఈ గ్రంథం అంతకుముందే ఉందని మాత్రం తెలుస్తుంది. ఇందులో ప్రస్తావించిన విషయాలు అప్పటికి బౌద్ధ మౌలిక వాఙ్మయంలో ఉన్నట్లు మనకర్థ మవుతుంది. ఈ విషయాలు పాటలీపుత్రం నుంచి కౌశాంబికి (యమునా, గంగ మధ్యప్రదేశ్) అక్కడి నుంచి మధురకు, అక్కడి నుంచి మధ్య ఆసియాకు వెళ్ళినట్టుగా తెలుస్తుంది. ❋

ఏకపాత్రాభినయం :

# మౌర్య అశోకుడు

## (దేవానాం ప్రియుడు)

-కె. రాజేశ్వరరావు

### రచయిత గురించి...

మిత్రులంతా కె.రా. అని ఆప్యాయంగా పిలుచుకునే ఈ రచయిత పూర్తి పేరు కాగితాల రాజేశ్వరరావు. విజయవాడ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతల్లో ఒకరైన కాగితాల కృష్ణమూర్తి గారి రెండవ కుమారుడుగా ది.15-6-1948న జన్మించాడు. తండ్రి ఆశయాలతో పాటు ఆయన సాహితీ అభిరుచినీ, ఛందో పరిజ్ఞానాన్ని వారసత్వంగా అందిపుచ్చుకున్నాడు.

ప్రముఖ అభ్యుదయ కవి గజ్జెల మల్లారెడ్డి గారి స్ఫూర్తితో 1970 దశకారంభంలో సాహితీ రంగంలోకి ప్రవేశించి కమ్యూనిస్టు కవిగా, రచయితగా, జర్నలిస్టుగా తన ప్రత్యేకతను చాటుకున్నాడు. మిలిటెంట్, యువజన, విశాలాంధ్ర, ఆంధ్రభూమి పత్రికల్లో పనిచేశాడు. 'చిన్నారి లోకం' బాలల బొమ్మల మాసపత్రికకు (1985-1995) సంపాదకత్వం వహించాడు. కేంద్ర ప్రభుత్వం నుండి రెండుసార్లు జాతీయ అవార్డులు, రాష్ట్రస్థాయిలో ఉత్తమ గేయకవిగా పలు బహుమతులను అందుకున్నాడు. కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రను 'నా పార్టీ' పేరుతో గేయ కావ్యంగా మలిచిన కె.రా.ను తెలుగు మయకోవ్‌స్కీగా పెద్దలు ప్రశంసించారు. నవలలు, కథలు, నాటకాలు, నాటికలు, బుర్రకథ, వీధి భాగవతాలు, గేయాలు, సాహిత్య ప్రక్రియలన్నింటిలోనూ రచనలు చేసిన కె.రా. 18-2-2004న ఊపిరితిత్తుల వ్యాధితో కన్ను మూశారు. 56 సంవత్సరాలకే జీవితాన్ని ముగించిన కె.రా. చివరి వరకు అరసం కార్యవర్గ సభ్యులుగా వున్నారు.

కమ్యూనిస్టు ఉద్యమం నుండి వచ్చిన కె.రా.కి సహజంగానే చరిత్రపట్ల గాఢమైన శ్రద్ధాసక్తులు, పరిశీలన వున్నాయి. 21 ఏండ్ల వయసులో 1969లో నాగాశోకుడు, మౌర్య అశోకుడు రెండు ఏకపాత్రల్ని రాశారు. వీటిని చదివి పెద్దలు తుమ్మల వెంకట్రామయ్య, ఏటుకూరి బలరామమూర్తి గార్లు "చరిత్ర జాడల ననుసరించి, ఆనాటి సమాజ స్థితిని గ్రహించి, సామాజిక బాధ్యతతో చేసిన రచన"గా అభివర్ణించారు. కె.రా. అణుయుద్ధాన్ని వ్యతిరేకిస్తూ విశ్వశాంతి నృత్యరూపకాన్ని, పలు శాంతిగీతాలు, జాతీయ గీతాలు రచించారు.

-సంపాదకుడు

*(చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించబడిన ఈ అశోకుడు క్రీ.పూ. 3వ శతాబ్ది నాటివాడు. ఇతను రాజ్యానికి వచ్చాక స్వాతంత్ర్యం ప్రకటించుకొనిన కళింగ దేశీయుల్ని ఓడించటానికి యుద్ధాన్ని తలపెట్టాడు. వేలాది యోధుల రుధిర ధారలు ప్రవహించాయి. ఆ యుద్ధంలో జరిగిన రక్తపాతాన్ని చూచి విచలిత మనస్కుడైన అశోకుడు బౌద్ధారామాల్ని శరణుజొచ్చి, ఆ మతావలంబియైనాడు. బుద్ధుని బోధనల ననుసరించి, అనేక ఆరామాల్ని, చైత్యాల్ని నిర్మించి యశఃకాయుడైనాడు, ఇతని కాలానికి అర్థబానిస విధానం పతనమైందని చెప్పవచ్చు. ఇతడు చెక్కించిన శాసనాలు, స్తూపాలు కొన్ని నేటికీ నిలచి వున్నాయి.)*

(తెర లేచేసరికి అశోకుడు వివిధ మణిభూషణాలంకృతుడై మణిమయ కిరీటాన్ని ధరించి వుంటాడు. అది అతని నివాస మందిరం. రాజోచిత లాంఛనాలంకృతమై వుంటుంది. మొలకు కరవాలం వేలాడుతుంటుంది. ఒక ఆసనంపై కూర్చుని వుంటాడు.)

**అహో!** ఈ సింహాసనం అధిష్ఠించిన నాటినుండి ఒక్క ఘడియసేపైనా నాకు విశ్రాంతి లభించడం లేదు. నిరంతర రాజకార్య నిమగ్నుడనై యుండుటచే, గతకాల చర్యాపర్యావలోకనకు

కూడా వీలు చిక్కడం లేదు.

మా తండ్రి గారు నన్ను ఈ మగధ సామ్రాజ్య సరిహద్దు ప్రాంతాలకు పాలకునిగా నియమించి, నేను రాజధానీ నగరంలో లేని సమయమున తన ప్రథమ కళత్ర సుతునకు పట్టముగట్టి నన్ను అన్యాయము చేయ సాహసించినాడు. ఆ వార్త వినిన సమయం నుండి మూడు వసంతముల కాలం అహోరాత్రులు శ్రమించి, సునిశిత మేధాశక్తితో, నిర్నిద్ర బాహు బలపరాక్రమంతో సోదరుని పదవీచ్యుతుని గావించి ఈ మగధ సింహాసనాన్ని అధిష్టించినాను.

మా పితామహులైన రాజాధిరాజ, అరిభయంకర క్షాత్రవతేజ విలసిత మౌర్య చంద్రగుప్తుని మంత్రియైన కౌటిల్యుని కన్న మిన్నగా ఉచ్చులను పన్ని ఈ సార్వభౌమత్వాన్ని సాధించుకున్నాను.

పితృదేవులూహించినట్లు ఈ అశోకుడు అల్పుడుకాదు, అర్భకుడు అంతకన్నా కాదు. అమేయ పరాక్రమశాలి. ఆహవ రంగంలో దుర్నిరీక్షాదక్షుడు. వివిధ శాస్త్రముల నామూలాగ్రం పఠించిన బహు భాషాకోవిదుడు. నన్ను కాదని నిలువగల వాడీ మహీమండలంలోనే లేడు. వున్ననూ ఈ అశోక సమ్రాట్ మననీయుడు.

సీమాంతర ప్రాంతాలలో తలెత్తుతున్న అనాగరిక జాతులను నిర్దాక్షిణ్యంగా అణచివేసి మళ్ళీ తలెత్తకుండా చేశాను. రాజ్య నిర్వహణలో నా అంతటివాడు లేడన్న కీర్తిని నా స్వంతం చేసుకొన్నాను.

అంతేకాదు–

ఇంకా యెవరయినా ఈ మౌర్యవంశ వర్ధనుడైన అశోకుని సార్వభౌమత్వాన్ని కాదని కాలదన్నితే లేశమాత్ర దయా విహీనుడనై నేల రాచివేస్తాను. ఈ మగధ సామ్రాజ్యాన్ని ద్విగుణీకృతం చేయడానికి నా శాయశక్తులా యత్నించి మౌర్యవంశీయులందరికీ శిరోధార్యుణ్ణి అవుతాను.

ఎవరది? (తెరదగ్గరికి వెళ్ళి ఏదో వింటున్నట్లు అభినయించి, క్రోధావేశంతో)

ఏమీ? మౌర్యసామ్రాజ్య సామంతులైన కళింగ ప్రభువులు మా చక్రవర్తిత్వాన్ని అంగీకరించక స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారా? అయ్యారే! ఎంతటి దుస్సాహసం? ఇప్పుడే రాజ్యము నధిష్టించి బాహ్యాంతర కలహ నిమగ్నుడనై ఉపేక్షించుతానని తలచి ధిక్కరించడానికి పూనుకున్నావా కళింగమండలాధీశా:

ఓ కళింగ రాజా... నీకు తెలియదేమో! పగబట్టిన పన్నగాని కంటే భయంకరుడీ యశోకుడు: నీలాంటి వాళ్ళను పిడికిటపట్టి రక్కిన పిట్టలా నలిపేయగలడు.

శతయోజన విస్తీర్ణ పర్యంతమున్న ఈ మగధ మహా సామ్రాజ్యాన్ని ఛిన్నాభిన్నం చేయటానికి పూనుకొనిన నీలాంటి సామంత పాలకులందరూ స్వాతంత్ర్యం ప్రకటించుకుని విర్రవీగితే చూచి సహించగల సహనమూ, ఆవశ్యకత నాకులేవు.

"పసివాడని పిన్నవయస్సుగల అశోకుడు మేధోనిధియైన నన్నేం చేయగల" దనియా నీ అహంకారము? లేక అసమాన బలపరాక్రమ సమన్వితులైన యోధాన యోధులు నీ అండగా వున్నారనా నీ ధైర్యం? కాక బుద్ధిలో చాణక్యునికి పదును పెట్టగల మంత్రాంగ మండలి వున్నదనా నీ స్వాతిశయం?

ఓయీ... మూర్ఖశ్రేష్ఠుడా:

గ్రీష్మాదిత్యుని కరణి చంద్రనిప్పులు చెరుగుతూ, కరవాలం ధరించి నేనే స్వయంగా సర్వ సైన్యాధిపత్యం వహించిన నాడు నా కళ్ళు కురిపించే విస్ఫులింగాలు నీ అహంకారాన్ని దహించివేస్తాయి. శత సహస్రాధిక సేనాపరివార సమేతుడనై, వేలాది రథ, గజ, తురగ బలాలతో కల్లోల తరంగిత సాగరంలా విజృంభించి నీ పరివారాన్ని చీల్చి చెండాడి నిన్ను నిర్వీర్యుణ్ణి

చేస్తాను. కాకలుతీరిన మంత్రాంగ వేత్తలైన నా అమాత్యమండలి పన్నే వ్యూహాలతో నిన్ను చక్రబంధంలో బిగించి నీ అతిశయాన్ని మటుమాయం చేస్తాను.

ఎవరక్కడ : (బైటకు చూస్తూ)

అమాత్యవర్యులందర్నీ తక్షణం సంరావించి, కళింగ మండలం మీద యుద్ధానికి కావలసిన వ్యూహ రచనకు పూనుకొనవలసిందిగా తెలియజేయండి.

మహాసేనాధిపతియైన విక్రముణ్ణి యుద్ధానికి సంసిద్ధంగా సర్వసైన్యాల్ని సమీకరించమని మగధ సామ్రాజ్యాధీశుని ఆజ్ఞగా తెలియజేయండి. యువకులను, యోధులను వేలాదిగా సమీకరించమనండి. సంవత్సరాల వరకూ పోరు జరిగినా తరుగులేనన్ని ఆహార ధాన్యాల్ని, జీవన సంబారాల్ని సిద్ధం చేయమనండి.

ఓ మగధ సామ్రాజ్య పౌరులారా : పాటలీపుత్ర (పాట్నా) వాసులార:

లెండి: ఈ మగధ సామ్రాజ్య సుస్థిరతకు కదలిరండి? యుద్ధరంగంలో మీ వీరోచిత ప్రజ్ఞాపాటవాలను చూపి రాజవంశం పట్ల మీ విశ్వాసాన్ని ప్రకటించుకోండి: ఫాలాక్షుని ప్రళయ తాండవ సమయోద్భవ వీరభద్రునిలా ఒక్కొక్కరూ విజృంభించండి : ఈ మౌర్య వంశ మహా సౌధానికి పునాదులై నిలవండి.

అరిభయంకర క్షాత్రవతేజం ప్రకటిస్తూ మన సార్వభౌమత్వాన్ని ధిక్కరించిన కళింగ దేశాన్ని పాదాక్రాంతం చేసుకోవాలి. దిగ్దిశాంతాల వరకు ఈ మగధ సామ్రాజ్య యశశ్చంద్రికలు వెలయింప జేయాలి.

మ్రోగించండి రణభేరీలను!

సిద్ధం చేయండి చతురంగ బలగాలను!

సాగించండి జయ జయధ్వానాలను!

లెండి! పదండి!

(అంటూ తాను కూడా శరవేగంతో బయటకు వెళతాడు. కొన్ని సంవత్సరాల కాల గమనాన్ని సూచిస్తూ లైట్స్ ఆఫ్- ఆన్ అవుతాయి)

**నేపథ్యంలో-**

"యుద్ధమంతరించె, వసంతములును గడిచె,
నెత్తు టేరులు పారెను : రేని మనసు
ద్రివివి బౌద్ధమతమవలంబించేనంత
శౌర్య విభుడాతడు యశోక చక్రవర్తి" (రాగయుక్తంగా ఆలాపన)

(అని విన్పించిన తర్వాత అశోకుడు రంగస్థలం మీదికి వస్తాడు వయసు మీరింది. శిరోమకుటం, కరవాలం, కొన్ని ఆభరణాలుండవు)

హే ప్రభూ! తథాగతా! రణపిపాసియైన నాటి అశోకునికి దేవానాం ప్రియుడైన (ఈ బిరుదును అశోకుడే కళింగ యుద్ధానంతరం ధరించాడు) నేటి ఈ అశోకునికి ఎంత వ్యత్యాసము!

జీవితంలో మరచి పోదామన్నా మరపురాని ఒక విషాద ఘట్టం కళింగ యుద్ధం. ఆవేశ పూరిత హృదయుడనై మా సామంతులైన కళింగులు నా అధికారాన్ని ధిక్కరించాలన్న క్రోధంతో మనిషన్నవాడు జరుపరాని మారణ హోమాన్ని సాగించాను. ఆ జరిగిన మానవాశ్వమేధ మహాయాగంలో నెత్తురు ఏరులుగా ప్రవహించింది. వికలాంగులైన సైనికుల హాహాకారాలతో రణభూమి మార్మ్రోగింది. విగతజీవుల క్షతగాత్ర శరీరాలు, ఆయువు చెల్లిన వేలాది అశ్వాలు, కొండలవలె పడివున్న ఏనుగు పీనుగులు, పీక్కుతినే రాబందులు, వికృత ధ్వనులు సాగించే

నక్కలు-ఎంతటి దుస్సహనీయ దృశ్యమది? తలచుకుంటేనే హృదయం వికలమౌతుంది.

ఆ దుర్భరమైన దృశ్యం చూచాక నాలో ఏ మూలో నిద్రాణమై వున్న మానవత్వం వెన్నుచరచబడినట్లు ఉలిక్కిపడి లేచింది. మనస్సుకు శాంతి కరువైంది. ఆ సమయంలో ఈ పాటలీపుత్ర ఆరామాధిపతియైన ఉపగుప్తుని నీ ధర్మ బోధనలతో నన్ను ప్రాభావితం చేయటం



తథాగతుని విగ్రహం ముందు ఆచార్య ఉపగుప్తుని నుండి
బౌద్ధ ధమ్మాన్ని స్వీకరించిన సమ్రాట్ అశోకుడు

నిజంగా నా అదృష్టం.

ప్రభూ : నీ బోధనల్లో ఎంతటి ఔన్నత్యం వున్నదయ్యా : నిరంతరం తీరని కోరికలతో, ఆశాపీడిత మానసులై కుమిలిపోయేవారికి, కోరికలను అదుపు చేసుకుని, మంచితనం పెంచుకుని, పరోపకారంతో పరమార్థాన్ని వెతుక్కోమని చెప్పావు. అదే మార్గాన్ని నేనూ అనుసరించాను. అశాంతితో ఆవేదనతో వేగుతున్న నా హృదయానికి సాంత్వన చేకూర్చుకున్నాను.

అంగ, వంగ, కళింగ, కాంభోజ (కాంబోడియా), కామరూప (అస్సామ్) దేశాలు మొదలుగా దక్షిణాపథమంతటా నీ దివ్య ప్రబోధసారాన్ని శిలాఫలకాల మీద చెక్కించి, ఎన్ని యుగాలకైనా నిలిచే రీతిగా నిక్షిప్తం చేయించాను.

జీవకారుణ్యదృష్టి నలవరచుకొని యజ్ఞయాగాదులలో జంతుబలి నిషేధించాను. పాంధులు విశ్రమించడానికి అనువుగా బాటల వెంబడి వటవృక్షాలు నాటించాను. బాటసారుల దాహార్తిని తీర్చేందుకు రహదారుల వెంట బావులను తవ్వించాను. గ్రామ సీమలను పాడిపంటలతో కళకళలాడించేందుకు ఊరూరా చెరువులను తవ్వించాను. బానిసలనే వారు లేకుండా స్వయం పోషక గ్రామీణ వ్యవస్థ కొనసాగించడానికి అమాత్యవర్యుల సహాయంతో కృషి చేస్తున్నాను.

ఎవరిదా పదధ్వని? ఎవరో వస్తున్నట్లున్నారు.

ఎవరిది? (తెరలోనికి చూస్తూ) ఎవరూ : తథాగతుని అనుచరులా : అయినచో ఈ దేవానాంప్రియుని ధర్మవందనాన్ని స్వీకరించండి: భన్తే : తమరు ఎచ్చటనుండి వస్తున్నారో తెలుసుకొనవచ్చునా? సింహళ ద్వీపం నుండి పాదయాత్రికులై విచ్చేశారా : ఎంతటి శుభవార్త : మహనీయుడైన గౌతముని మహా పరినిర్వాణానంతరం భగినీ సహితులు, పుత్రదార సహితులు అయిన శాక్యవంశీయులచేత ఆయన శరీరము నిధానం (సమాధి) చేయబడిన పిప్రావ (నేపాల్ అడివారంలో వున్నది)ను దర్శించినప్పుడు కల్గిన సంతోషమే మళ్ళీ నేడు మిమ్మల్ని చూస్తుంటే కల్గుతోంది.

ఆఁ : భన్తే : మీ వెనుక నిలచివున్న ఆ ఇరువురూ ఎవరు? దంపతులా : నన్ను చూచుటకు మీతో కలసివచ్చారా : బహుభాషా నిష్ణాతులా :

"గాథలను వ్రాసి, చదివి, అర్థం చెప్ప గలిగిన కన్యయితే వరిస్తాను" అని తథాగతుడు 'లలిత విస్తరం' (ఇది అశోకుని కాలంలోనే వ్రాయబడిన బౌద్ధమత గ్రంథం. నాగార్జునుని కాలానికి బాగా తలయెత్తిన మహాయాన వాదులకిది ప్రామాణిక గ్రంథం) లో చెప్పినట్లు ఈ చిరంజీవి విద్యాపరిపూర్ణయైన తరుణిని పెండ్లియాడటం ప్రశంసనీయమైన విషయం.

తమరు ప్రయాణ బడలికతో అలసినట్లున్నారు. విశ్రాంతి మందిరంలో విశ్రమించండి.

ఎవరక్కడ... వీరిని విశ్రాంతి మందిరానికి తీసుకువెళ్ళి, తగు సపర్యలతో గౌరవించండి.

నేడు ఎంత శుభదినం : అమరావతీ స్థూప నిర్మాణానికి మహాదేవుని పంపిన తర్వాత నిరంతర యోచనా వ్యాసంగ నిమగ్నుడనై సింహళ ద్వీపమునకు బోధి వృక్ష శాఖలను పంపు విషయమే విస్మరించితిని, ఇప్పుడు వచ్చిన ఈ పరివ్రాజకునితో ఆ వృక్షశాఖలను పంపించెదను?

ఏమి నా యోచానా విహీనత : ఎనుబదినాల్గు వేలమంది భిక్షువులను బుద్ధుని బోధనల ప్రచారమునకు దేశం నలుమూలలకు పంపిన నేను సింహళ దేశానికి పరమ పవిత్రమైన ఆ బోధివృక్ష శాఖలను పంపుటకు మనుషుల కొరకై వెరచుటయా : ఎంత హాస్యాస్పదము.

మృదుమధురమైన భాషతో, తన అపార సంభాషణా చాతుర్యంతో ఎవ్వరినైనా ఆకట్టుకోగల నా కుమార్తె సంఘమిత్ర, స్ఫురద్రూపి, నిత్య సత్యభాషావ్రతుడు, పరాక్రమశాలి, సద్గుణశీలి అయిన కుమార మహింద్రుడు– వీరిరువురును సింహళ దేశమునకు పంపదగుదురు. అవును అటులనే చేయుదును.

బుద్ధుని బోధనలను దిగంతాల వరకు విన్పించాలి. ఈర్ష్యాద్వేషాలు మానవుడిలో అంతరించాలి.

పశుపక్ష్యాదుల పట్ల, జ్ఞాతుల పట్ల కార్పణ్యాన్ని, వైషమ్యాన్ని విడనాడాలి, మానవత్వాన్ని పెంచుకొని ఐక్యతా భావ దృక్పథంతో జీవించాలి.

అంతవరకు ఈ నా కృషి ఆగదు. అంతవరకు ఈ ఆవేదన తీరదు.

అంతవరకు నేను సాగించిన దారుణ నరమేధానికి నిష్కృతి వుండదు.

బుద్ధం శరణం గచ్ఛామి!

ధర్మం శరణం గచ్ఛామి !!

సంఘం శరణం గచ్ఛామి !!! (అంటూ నిష్క్రమిస్తాడు) ❊

*(ఇది 1969 నవంబరులో ప్రచురితమైన 'శాంతిశ్రీ' ఏకపాత్రల సంకలనం నుండి సేకరించటమైనది. ఈ పుస్తక సంపాదకులు మైత్రేయ గారు. ప్రచురణకర్త : పంగులూరి కృష్ణమూర్తిగారు)*

# ధర్మశ్రీ

-డా॥ మలయశ్రీ

సార్వభౌముని పుత్రిక సంఘమిత్ర
సరస నాటెను బోధివృక్షంపు కొమ్మ
సింహళమునకు వెళ్ళి సౌశీల్యభక్తి
బౌద్ధ భిక్షిణులను గూడి పర్యటించి

రాజు నానతి గొని యువరాజు, రాజ
తేజుడు మహేంద్ర చీనాది దేశములకు
వెళ్ళి బౌద్ధంబునట వెదజల్లినాడు,
వినెడు వారల మనములు తనిసి మురియ

శిలలపై బౌద్ధ ధర్మ సూక్తులను తొలిచి
ప్రతిభ నిల్పెను ప్రభు చతుష్పథములందు,
పల్లె గ్రామాల మరి పెద్ద పట్టణాల,
జనము గుంపుగ చేరెడు సంతలందు

చూడ సుందర మైనట్టి స్తూపములను
పదులు వందలు వేలుగ ప్రభుడు ప్రీతి
భరత దేశాన నిర్మించి వాని చెంత
నిలిపె ధర్మ సూక్తుల పలకలను పెక్కు

సకల సద్ధర్మ పూర్ణ ప్రశాంతులయ్యి
సంఘ సంక్షేమ కార్యాలు చక్కజేయు
సాధుజన సంఘములు హెచ్చె, సన్నుతిగను
బౌద్ధ పుణ్యాశ్రమ శ్రీలు వృద్ధియయ్యె

చక్కని రాచబాటల విశాలములైనవి వేసి, వాటికిన్
ప్రక్కల నీడనిచ్చు తరురాజములన్ వలనొప్ప పెంచియున్
మక్కువ నన్న సత్రముల మానవనాథుడు నిల్పె ప్రేమతో
ఎక్కడ జూసినన్ వసుమతీశుని సంస్కరణంపు పెంపులే

సేద్యమ్ము కొరకయ్యి చెరువులు తవ్వించె
    కర్షక జనులెల్ల హర్షమొంద,
వైద్యమ్ము కోసమై విద్యాలయంబుల
    దేశమంతట నిల్పె దివ్యదీప్తి,
విద్యా వికాసమౌ విద్యాలయంబుల
    విపుల భారతమందు వెలయజేసె,
మద్యమ్ము త్రాగుటల్ మాన్పించి ప్రజలను
    సరియైన దారుల జనగజేసె,

పవలురేలును ప్రజలకై పాటు పడుచు
సర్వ జనరంజకంబులౌ సంస్కరణల
చేసె నా మహీపతి ధర్మ చిత్తుడగుచు
దేశ మంతటను ప్రశాంతి తేజరిల్ల

ఘనముగ నుత్తర భారత
మున మరి ఓఢ్రమున ఆంధ్రమున కరినాటన్
కన కాంచీపుర వరమున
మును బౌద్ధము వర్ధిలె అన్య భూముల కూడన్

పందిరింజూడ గృహ వైభవంబు దెలియు
ప్రజల జూచిన ప్రభుని ప్రాభవము దెలియు,
పందిరింపొందు గృహమేధి వలన, మరియు
ప్రజల సుఖులౌట ప్రభుని నేర్పరి తనంబె

నాడశోకు పాలనమున సద్ధర్మంబు
పాలపుంత నాగ పరిఢవిల్లె,
వర కనిష్క హర్ష వర్ధన రాజేంద్రు
లతని యడుగు జాడ నరిగినారు. ❋ సెల్ :98665 46220

## పుష్పాంజలి !

-డి. అశోక్‌కుమార్ సెల్:98482 35683

కనరారె మున్నెన్నడు
కనరారె భూత భవిష్యత్ వర్తమానాల
కనరారె నీ వంటి కరుణామయమూర్తి
కనరారె అచంచల ప్రేమామృత చక్రవర్తి

నా బిడ్డలవలె నా ప్రజలను
సమ్యక్ దృష్టితో చూచెదనేనని
చేతలలో చూపించిన
వాక్పాలక చక్రవర్తి

మతం కంటె మనిషి గొప్పని
మనిషే మత సృష్టికర్తయని
మనిషిని మనిషిగా చూచే తత్వాన్ని
ప్రబోధించిన మానవీయ చక్రవర్తి

మార్గదాతనేనని ముక్తిదాతను కాదని
బోధించిన బోధిసత్వ సూక్తిని
ప్రాపంచిక శాసనంగా
రూపకల్పన చేసిన సామ్రాట్టువు నీవు

సామ్రాజ్యపు నలుతెరగల
స్థూపాలనెన్నో నిర్మించి
సమతాధర్మ ప్రచారానికి
పూనుకున్న ప్రియదర్శన చక్రవర్తి

అశాంతిలో సుశాంతిని నెలకొల్పి
నిరంతర సత్యాన్వేషణ చేసి
బౌద్ధాన్ని జన బౌద్ధం చేసి
శాంతి కపోతాన్నెగుర వేసిన ధీరమూర్తివి నీవు

బౌద్ధమత వట వృక్షం
విశ్వమంతా విస్తరించాలని
దార్శనికునిగా ప్రవక్తగా నీ కీర్తి
ఎల్లవేళలా వుంటుంది వినీలాకాశంలో

త్యాగమయం నీ జీవితం
అనన్య సామాన్యం నీ సేవలు
ఎంతటి అదృష్టమో నీ ప్రజలకు
అందుకొనుమిదే మా పుష్పాంజలి ❋

# మౌర్య వంశోత్పత్తి

-కోగంటి చెన్నుగాంధీబాబు

ప్రాచీన కాలములో మన దేశాన్ని పరిపాలించిన ప్రముఖ రాజవంశము మౌర్యులు. మౌర్యులు ఇంచుమించుగా మన భారత ఉపఖండమునంతయు పెన్నకు దక్షిణాన ఉన్న కొన్ని ప్రాంతములు మినహా 137 ఏళ్ళు పాలించారు. ప్రపంచంలోనే అతి గొప్ప సామ్రాజ్య నిర్మాతలలో ఒకడైన చంద్రగుప్తుని మరియు మానవత్వంలో తనకు తానే సాటి అనిపించుకున్న అశోకుని, ఈ వంశం మనకు అందించింది. ఇట్టి ఘనతరమైన మౌర్యవంశం మూలాలేవి? మౌర్యులు ఎవరు? అనే ప్రశ్నకు సమాధానం వెతకడమే ఈ వ్యాస ప్రధాన లక్ష్యం. మౌర్యవంశోత్పత్తిపై అనేక భిన్నాభిప్రాయాలు, వివాదాలు నెలకొన్నాయి.

**ఆధారాలు :** ముందుగా ఈ విషయమై మనకున్న చారిత్రక ఆధారాలను పరిశీలించినచో వానిని 4 రకాలుగా వర్గీకరించవచ్చు. అవి గ్రీకు, జైన, బ్రాహ్మణ, బౌద్ధ ఆధారాలు. బ్రాహ్మణ ఆధారాలలో పురాణాలు, విష్ణు పురాణ వ్యాఖ్యానం, ముద్రా రాక్షస నాటకము, దానిపై వచ్చిన వ్యాఖ్యానం, బౌద్ధ ఆధారాలలో దివ్యావదన, మహావంశము, మహాపరినిబ్బన సుత్త అనునవి ప్రధానమైనవి.

**గ్రీకు ఆధారాలు :** మౌర్య వంశస్థాపకుడైన చంద్రగుప్తుడు అలెగ్జాండర్ సమకాలీనుడు. పంజాబులో విడిది చేసి యున్న అలెగ్జాండర్‌ను చంద్రగుప్తుడు కలిశాడని గ్రీకు రచయితలు వ్రాశారు. చంద్రగుప్తుని వారు శంద్రోకోటస్ అని వ్యవహరించారు. ఈ సందర్భముగా వారు చంద్రగుప్తుని (Man of low origin ) అనగా హీనకులస్తుడని లేదా సమాజంలో అడుగు వర్గాల నుండి వచ్చాడని వ్రాశారు. చంద్రగుప్తుడు అనాధగా ఉండి, పశులకాపరి స్థితి నుండి, మహాసామ్రాజ్య నిర్మాతగా ఎదిగాడు. గ్రీకులకు మన వర్ణవ్యవస్థ గురించి తెలియదు కాబట్టి అతని వర్ణమును ప్రస్తావించక, సమాజంలో అడుగు స్థితి నుండి ఉన్నత స్థితికి వచ్చాడని వారు చెప్పింది, యధార్ధమే.

**జైన ఆధారాలు :** జైనమత గ్రంథాలలో మౌర్య వంశోత్పత్తి గురించి భిన్నమైన కథనం ఉంది. వీరి ప్రకారం చంద్రగుప్తుడు ఒక మయూర పోషక గ్రామానికి చెందినవాడు, ఆ గ్రామపెద్ద కూతురు బిడ్డకు ఆ కాలంలో నెమళ్ళను పెంచడం, రాజులకు, సంపన్నులకు అమ్మడం ఒక వృత్తిగా ఉండేది. అట్టి మయూర పోషక గ్రామం నుండి వచ్చాడు కాబట్టి అతడు రాజు అయ్యాక మయూర మవర్య మౌర్య అనేది అతని వంశ నామంగా స్థిరపడిందని జైనుల అభిప్రాయం.

**బ్రాహ్మణమత ఆధారాలు :** ఇక బ్రాహ్మణ ఆధారాలను ఈ విషయమై పరిశీలించినచో అనేక అంతర్గత వైరుధ్యాలు, వివాదాలు కనపడును. సాధారణంగా దేశమంతా ప్రచారమైన ఒక అభిప్రాయమేమనగా చంద్రగుప్తుని తల్లిపేరు ముర అని, కనుక అతడు స్థాపించిన రాజవంశానికి మౌర్య అనే పేరు వచ్చింది అని అనేకులు భావించారు. అయితే ఈ కథనానికి సరైన చారిత్రక ఆధారాలు లేవు. బ్రాహ్మణ ఆధారాలను పరిశీలించినచో చారిత్రక ఆధారములేని ఒక కట్టుకథ క్రమేపి వాడుకలోకి వచ్చి, ఇదిగో పులి అంటే అదిగో తోక అన్న చందాన చిలువలు, పలవలు చేరి ఒక కల్పితగాధ ప్రచారమైనట్లు పొడగట్టును.

మన పురాణములలో మనదేశాన్ని పాలించిన ప్రాచీన రాజవంశాలు, రాజుల పట్టికలతో కన్పించును. ఇట్లు గుప్తవంశము వరకూ ఈ రాజుల పట్టికలు కలవు. గతంలో పాలించిన రాజులను, భవిష్యత్తులో పాలించబోతున్నారని చెప్పడం ఈ పురాణాలలోని విశేషం. ఇట్లు

ముఖ్యంగా మత్స్య, వాయు, భవిష్య తదితర పురాణాలలో రాజుల వంశ వృక్షావళులున్నవి. బ్రాహ్మణ మతాధారాలన్నింటిలోను ప్రాచీనమైనవి అయిన పురాణాలలో మౌర్య వంశానికి ఆ పేరు ఎలా వచ్చిందో వివరణ లేదు. వానిలో చాణుక్యుడు నందవంశాన్ని నిర్మూలించి, చంద్రగుప్తుని రాజుగా పట్టభిషిక్తుని చేసెను అని మాత్రమే ఉన్నది. వీనిలో ముర ప్రస్తావనే లేదు.

పురాణాల తర్వాత కొంతకాలానికి రచింపబడిన విష్ణుపురాణ వ్యాఖానంలో కొత్త విషయమున్నది. బహుశ మౌర్య అనే పేరు ఎలా వచ్చిందో అన్న విషయం వారు చెప్పవలసి వచ్చి ఉండును. దానితో విష్ణుపురాణ వ్యాఖ్యాత చంద్రగుప్తుని తల్లిపేరు 'ముర' అని, కనుక అతడు స్థాపించిన వంశానికి మౌర్య అన్నపేరు వచ్చిందని చెప్పాడు. అయితే ఇక్కడ మనకు దొంగ కన్నం వేస్తూ నేరుగా దొరికిపోయాడు. ఇదంతా కట్టుకథ అని మనం నిర్ణయానికి రావచ్చు. ఎందుకంటే సంస్కృత వ్యాకరణ సూత్రాల ప్రకారం ముర కొడుకు మౌరేయుడవుతాడు, మౌర్యుడు అవడు. ఉదా- రాధ కొడుకు రాధేయుడు కుంతి కొడుకులు కౌంతేయులు, అలాకాక ముర అనునది తండ్రి పేరైనచో మౌర్య అను శబ్దము వచ్చును, కనుక మౌర్య శబ్దాన్ని సాధించడానికి ఒక కల్పనా గాధ అల్లబడిందని, ముర అనే స్త్రీ కల్పిత వ్యక్తి, ఊహాజనితమని మనం భావింవచ్చు, ఈ గ్రంథములో ముర దాసీయని కాని, ఉంపుడు కత్తె అని కాని ఎక్కడా లేదు.

పురాణాల తర్వాత మౌర్యుల చరిత్రకు ఇంకొక ముఖ్యమైన ఆధార గ్రంథం విశాఖదత్తుడు రచించిన 'ముద్రారాక్షసము' అను చారిత్రక నాటకం. ఇందులోని ఇతివృత్తం చాణుక్యుడు తన బుద్ధిబలంతో నందులను నిర్మూలించి చంద్రగుప్తునికి పట్టాభిషేకం జరుపుట. ఇందులో చాణుక్యుని ప్రత్యర్థి నందుల మంత్రి రాక్షసామాత్యుడు. ఈ గ్రంథంలో చంద్రగుప్తుడు వృషలుడని, కులహీనుడని సంబోధింపబడ్డాడు. వృషలుడనగా రాజులలో ముఖ్యుడని లేదా సమాజంలో అడుగు వర్గానికి చెందినవాడు అని అర్థం. ఈ గ్రంథకర్త ఉద్దేశ్యంలో చంద్రగుప్తుడు హీనకులస్తుడని మనం భావించవచ్చు, విశాఖదత్తుడు గుప్తుల కాలానికి చెందిన కవి. అనగా మౌర్యుల కాలానికి 800 సంవత్సరముల తర్వాత ఈ నాటకాన్ని వ్రాశాడు.

తర్వాత ఇంకా కొంతకాలానికి, కొన్ని శతాబ్దాల తర్వాత ఈ ముద్రారాక్షసం గ్రంథంపై వ్యాఖ్యానం రచింపబడింది. ఈ వ్యాఖ్యాన గ్రంథములో పూర్తిగా అభివృద్ధి చెందింపబడిన కల్పనా గాథ మనకు కన్పించుచున్నది. ఈ గ్రంథంలో ముర కొడుకు వ్యాకరణ సూత్రాల ప్రకారం మౌర్యుడు అవడని గ్రహించి, దానిని కొత్తగా కల్పించిన కథతో సరిదిద్దే ప్రయత్నం చేశారు. దీని ప్రకారము చంద్రగుప్తుడు నంద వంశీయుడైన మౌర్యుని కుమారుడు, మౌర్యునికి పట్టమహిషి ద్వారా నవనందులు జన్మించారని, అయితే అతడు దాసీది గొప్ప అందగత్తె అయిన మురను మోహించి ఉంపుడుగత్తెగా ఉంచుకొన్నాడని మురకు వందమంది పుత్రులు పుట్టారని ఈ పుస్తకం చెబుతుంది. ఒక స్త్రీకి 100మంది సంతానం కలగటం సాధ్యమేనా? మహాభారతంలోని గాంధారి ఉదంతం పుక్కిటి పురాణ గాథ. కనుక దీనిని బట్టే ఇదంతా కట్టు కథ అని మనం భావింపవచ్చు. ముర శూద్ర స్త్రీ అని, చంద్రగుప్తుని నందవంశ రాకుమారుడని చెపుతూ పుస్తకం ముగిసింది. నందులు కూడ శూద్రులే కాబట్టి, నంద తండ్రి శూద్ర మురకు పుట్టిన చంద్రగుప్తుడు కూడా శూద్రుడే అని వీరి అభిప్రాయం. కనుకనే ముద్రా రాక్షసం నాటకంలో చంద్రగుప్తుడు వృషలుడు, కులహీనుడుగా పిలువబడ్డాడు. ఈ గ్రంథంలో చెప్పిందంతా అభూతకల్పనగా మనం కొట్టి పారేయవచ్చు. నందరాజు కొడుకే అయినచో చంద్రగుప్తుడు స్థాపించిన వంశం కూడ నందవంశమే గదా. మౌర్య అనే వేరు పేరు రావలసిన అవసరమేముంది. పైగా నందులు,

మౌర్యులు భారతదేశ ఆధిపత్యం కోసం హోరాహోరీ పోరాడారు. చివరకు చంద్రగుప్త మౌర్యుడు విజయం సాధించి నందవంశమును నిర్మూలించినాడు. అట్టి మౌర్యులను నంద వంశస్తులనడం పూర్తిగా అసంబద్ధం.

కనుక బ్రాహ్మణ గ్రంథాలలో ఒక కట్టు కథ అవసరానుగుణంగా వ్యాప్తి చేయబడటం మనం గమనించవచ్చు. మొదటి గ్రంథాలలో పురాణాలలో ముర పేరే లేదు. విష్ణుపురాణ వ్యాఖ్యానంలో మౌర్య ఉత్పత్తి చెపుతూ ముర కొడుకు కాబట్టి మౌర్య పదం వచ్చిందని చెప్పి నాలుక కరుసుకున్నారు. ముర కొడుకు మౌర్యుడవడు కాబట్టి, దీనిని సరిచేస్తూ అనంతర గ్రంథాలలో అభూతకల్పనతో ముర దాసీదని మౌర్యుడను నందరాజుకు ముర అనే శూద్ర స్త్రీ ద్వారా చంద్రగుప్తుడు జన్మించాడని చెప్పారు. ఎట్టి చారిత్రక ఆధారాలు లేని ఈ కల్పనా గాధలను యదార్ధం కాదని మనం త్రోసిపుచ్చవచ్చు. పైగా ఈ కట్టు కథలున్న పుస్తకాలు మౌర్యులకు సమకాలీనాలు గాదు. మౌర్యుల తర్వాత 500, 800 ఏళ్ళ తర్వాత రచింపబడిన గ్రంథాలు. అప్పటికి యధార్థం మరుగున పడే అవకాశాలే ఎక్కువ. మన చరిత్రలు మనం వ్రాసుకోలేదు.

**బౌద్ధ గ్రంథాలు :** పైన ప్రస్తావింపబడిన అన్ని ఆధారాల కంటే మౌర్యుల వంశోత్పత్తి విషయములో మనం ఖచ్చితంగా ఆధారపడతగిన సమకాలీన చారిత్రక ఆధారాలతో, మౌర్య వంశ మూలాలు మనకు తెలియ చెబుతున్నవి బౌద్ధ ఆధారాలు. పైగా ఇవి సమకాలీనాలు, అనగా సంఘటనలు జరుగుతున్న కాలానికి దగ్గరగానే ఈ గ్రంథాలు రచింపబడినవి. ఎప్పుడు కూడ వందల సంవత్సరాల తర్వాత రచింపబడే గ్రంథాల కన్నా సమకాలీన గ్రంథాలు సత్యానికి దగ్గరగా ఉండే అవకాశాలు ఎక్కువ.

బౌద్ధ గ్రంథమైన 'దివ్య వాదన'లో చంద్రగుప్త మౌర్యుని కుమారుడైన బిందుసారుని గూర్చి చెపుతూ అతడు మూర్ధాభిషిక్తుడైన క్షత్రియ రాకుమారుడని ఉన్నది. అంటే బిందుసారుడు క్షత్రియుడైతే, అతనిని కన్న అతడి తండ్రి తప్పనిసరిగా క్షత్రియుడే అగుట స్వభావ సిద్ధం. తండ్రి క్షత్రియుడైననూ అతడు వేరే వర్ణపు స్త్రీ ద్వారా సంతానం కంటే వారికి క్షత్రియత్వం రాకపోవచ్చు. ఉదా- మలి వేదకాలపు మహాభారత కాలంలో క్షత్రియ తండ్రులకు శూద్ర తల్లులకూ పుట్టిన సంతానంతో కూడినదే సూత కులము. కాని ఇక్కడ కొడుకు బిందుసారుడు క్షత్రియుడుగా చెప్పబడ్డాడు కాబట్టి,అతని తండ్రి చంద్రగుప్త మౌర్యుడు నిస్సందేహంగా క్షత్రియుడని మనం భావింపవచ్చు. కనుక అతని వంశం మౌర్యులు క్షత్రియ వంశమని మనం నిర్ధారింపవచ్చు.

మౌర్యులు నిస్సందేహంగా క్షత్రియులే అని చెప్పే ఇంకొక ముఖ్య ఆధారం మనకు లభ్యమైనది. అదే 'మహావంశము' అను బౌద్ధ గ్రంథం. ఈ గ్రంథంలో చంద్రగుప్తుని గురించి చెపుతూ చాలా స్పష్టంగా అతడు 'మోరియ' అనే క్షత్రియ తెగకు చెందిన రాకుమారుడని ఉన్నది. చివరగా ఈ మోరియ అనే క్షత్రియ తెగ గురించిన మరికొంత సమాచారం, ముఖ్యంగా వారు ఏ పట్టణానికి చెందినవారు అనే అంశం మనకు 'మహాపరి నిబ్బానసుత్త' (సంస్కృతం మహాపరి నిర్వాణసూత్ర) అను గ్రంథం ద్వారా తెలిసినది. దీనిప్రకారం మోరియ అనే క్షత్రియతెగ 'పిప్పలవనం' అనే నగర రాజ్యాన్ని పాలించే తెగ అని తెలియచున్నది. బుద్ధుని నిర్వాణానంతరం అతని అస్థికలను 8 మంది (రాజులు, తెగలు) పంచుకొన్నారు. వానిపై స్థూపాలు నిర్మించారు. విషయాన్ని తెలియజేయు సూత్రమే మహాపరి నిబ్బానసుత్త.

మొత్తం మీద చూసినట్లైతే మౌర్య వంశస్థాపకుడైన చంద్రగుప్తుడు పిప్పలవనానికి (హిమాలయ ప్రాంతం) చెందిన మోరియ అనే క్షత్రియ తెగకు చెందిన వాడని, మోరియలది కూడ శాక్యుల

వలె గణరాజ్యమని తెలియుచున్నది. చంద్రగుప్తుడు చక్రవర్తి అయినాక మోరియ అనే పదమే మౌర్యగా రూపాంతరం చెంది ఉంటుంది. తరువాత వారిని మౌర్యులుగా వ్యవహరించారు కనుక చారిత్రక సత్యమేమంటే మౌర్యులు, శూద్రులు కాదు, మయూర పోషక గ్రామస్తులు కాదు. వారు మోరియ అనే పిప్పలవనానికి చెందిన క్షత్రియ తెగ.

అయితే వారు కులహీనులు, అడుగు వర్గాల నుండి వచ్చారు అని చెప్పబడటానికి కారణం ఏమంటే చంద్రగుప్తుడు గర్భంలో ఉన్నపుడే తండ్రిని కోల్పోయి అనాథ అయ్యాడు. అతని తల్లి కుసుమ పురానికి (పాటలీపుత్రం) వెళ్ళి ఒక పశుల కాపరి ఆదరణలో బ్రతికింది. బాల్యంలో చంద్రగుప్తుడు పశుల కాపరిగా జీవించాడు. తక్షశిలకు చెందిన చాణక్యుడు అతనిలోని చక్రవర్తి లక్షణాలను చూసి, చంద్రగుప్తుని తల్లికి 1000 కార్షపణాలు ఇచ్చి అతడిని తనతో పాటు తీసుకువెళ్ళి విద్యాబుద్ధులు గరపి, నందవంశాన్ని నిర్మూలించి అతడిని రాజుగా చేశాడు. కాబట్టి అతి బీదరికపు, హీన పరిస్థితులలో నుండి వచ్చాడు కాబట్టి గ్రీకులు, జైనులు, అతడు సమాజంలో అడుగు వర్గాల నుండి వచ్చాడని వ్రాసి ఉంటారు.

ఏమైనా ఈ విషయంలో మనకు ఎలాంటి సందేహాలకు తావులేదు. బౌద్ధ గ్రంథాలు సమకాలీనాలు. కాబట్టి యధార్ధాన్ని, సత్యాన్ని చెప్పగలిగాయి. బ్రాహ్మణ ఆధార గ్రంథాలు, వందల ఏళ్ళ తర్వాత రచింపబడ్డాయి కాబట్టి వాటిలో కట్టు కథలు, కల్పనలు చోటు చేసుకున్నాయి. అంతిమంగా మనం మౌర్య వంశాన్ని స్థాపించిన చంద్రగుప్తుడు హిమాలయ ప్రాంతానికి చెందిన పిప్పలవనమనే గణరాజ్యానికి చెందిన మోరియ అనే క్షత్రియ తెగకు చెందినవాడు. మోరియ అనే పదమే క్రమేపీ మౌర్యగా మారిందని మనం భావించవచ్చు. కాబట్టి మౌర్యులు క్షత్రియ వర్ణానికి చెందిన వారుగా నిర్ధారణ చేయవచ్చు. ❋

రచయిత సెల్ : *94920 31242*

# అశోకుడు- అంబేడ్కర్

-పి. రాంబాబు

విశ్వమానవాళి శ్రేయస్సు కోసం బౌద్ధధమ్మ మొక్కటే మార్గమని తలచి దాని వ్యాప్తి కోసం ప్రాచీనకాలంలో అశోకుడు, ఆధునిక కాలంలో అంబేడ్కర్ చేసిన సేవలు చిరస్మరణీయమైనవి. ప్రఖ్యాత కవి 'బెర్ట్రాండ్ రసెల్' "ఒక్క రక్తపు చుక్కైనా చిందించకుండా విశ్వవ్యాప్తిని పొందిన మతం ఏదైనా వుందంటే అది ఒక్క బౌద్ధమతం మాత్రమే" అన్నారు.

మానవుల పుట్టుక నుండి మరణం వరకు కావలసిన మానవ హక్కులు అత్యున్నత విలువలతో బౌద్ధంలో ఆవిష్కరించబడినాయి. దేశ పటిష్టత కోసం, సార్వభౌమాధికారం కోసం బౌద్ధం అందించిన విజ్ఞానం చాలా విలువైనది. ఒక సామాజిక తత్త్వ సిద్ధాంతంగా ముందుకు వచ్చిన బౌద్ధంలో నిరుపేదలు మొదలుకొని మహా చక్రవర్తుల వరకు, తత్త్వవేత్తల నుండి విజ్ఞానవంతులు వరకు గౌతమ బుద్ధుని ధమ్మమార్గాన్ని అనుసరించిన వారే. తమ జీవితాలకు గొప్ప ఆత్మస్థయిరాన్ని ఆత్మగౌరవాన్ని ఇచ్చిన ఏకైక ధమ్మం ఇది. ఈ కోవకు చెందినవారే సమ్రాట్ అశోకుడు, బాబా సాహెబ్ అంబేడ్కర్‌లు. బౌద్ధాన్ని పునర్జీవింప చేయడంలోను, దానిని విస్తరింప చేయడంలోనూ వీరిద్దరి పాత్ర చరిత్ర ఖ్యాతి గాంచినది.

గౌతమ బుద్ధుని అనంతరం బౌద్ధం భారతదేశంలో పలుమార్లు ఒడిదుడుకులను చవిచూసినట్లుగా తెలుస్తుంది. క్రీ.పూ. 260లో విజయదశమి రోజున ఉపగుప్తుని ద్వారా అశోకుడు బౌద్ధదీక్షను స్వీకరించాడు. కళింగ యుద్ధానంతరం జరిగిన ఈ మహా కార్యానికి సముద్రుడు, యశస్సుడు, పిండోల భరద్వాజుడు మొదలగు భిక్షువులు కూడ హాజరైనారు.

రాజ్యకాంక్షతో వున్న అశోకుడు అకస్మాత్తుగా తన హింసా గుణాన్ని వదిలి తీవ్ర పశ్చాత్తాపంతో బౌద్ధం ముందు మోకరిల్లాడు. దీనికి ప్రధాన కారణం- కళింగ (ఆంధ్ర- ఒరిస్సా సరిహద్దులు) ప్రాంతంలోని ప్రజలు తమ దేశం కోసం పోరాడుతూనే శత్రువులకు సహితం సేవలందించిన వారి ధర్మనిరతి ముందు అశోకుడు మానసికంగా ఓటమి పాలైనాడు. బౌద్ధుల సేవాతత్పరతకు శిరస్సు వంచక తప్పు లేదు. యుద్ధ విరమణకు ముందు దేశ వ్యాప్తంగా గతంలో తాను చూసిన బౌద్ధుల ఆచరణను, శీలసంపత్తిని ఒక సారి మననం చేసుకున్నాడు. తనలో విపరీతమైన మానసిక సంఘర్షణ మొదలైనది. ఫలితంగా తన ఆయుధ సంపత్తి నంతా దయానది (ఒరిస్సా)లో ఒదిలి, ధర్మ విజయమే నిజమైన విజయమని, యుద్ధ ఘోష స్థానంలో ధమ్మఘోష విని పిస్తానని ప్రతిన బూనాడు.



అది మొదలుకొని తన 40 సం॥ రాల రాజ్యకాలంలో బౌద్ధానికి ఎనలేని సేవలందించాడు. బుద్ధుని కాలం కంటె మిన్నగా బౌద్ధాన్ని విశ్వవ్యాపితం చేశాడు.

అశోకుని ముందుకాలంలో గణరాజ్య పాలకులైన నాగ చక్రవర్తులు నుండి అశోకుడు, కనిష్కుడు, హర్షుడు, శాతవాహన, ఇక్ష్వాకు చక్రవర్తులు ఇలా ఎందరో ఈ దేశాన్ని బౌద్ధదేశంగా సుసంపన్నం చేశారు. బుద్ధుడు ఈ దేశంలో పుట్టినందున, అత్యున్నతమైన, అత్యుత్తమమైన ఒక సామాజిక ధమ్మం ఇక్కడ వర్ధిల్లినందున, అనేక పాలక వంశాలు బౌద్ధ సంస్కృతీ వారసత్వాన్ని అజేయంగా ముందుకు తీసుకువెళ్ళినందున ఈనాటికి పాశ్చాత్య దేశాలు దీనిని బౌద్ధ దేశంగా మాత్రమే పరిగణిస్తున్నాయి.

బౌద్ధ ధమ్మంలో 84,000 ధర్మ సూత్రాలున్నాయని మొగ్గలిపుత్త తిష్య అశోకునికి తెలియచేయగా ఆ సంఖ్యను స్ఫూర్తిగా తీసుకుని మొట్టమొదట నిర్మించిన ఎనిమిది బౌద్ధస్థూపాల నుండి బుద్ధుని ధాతువులను సేకరించి 84,000 భాగాలుగా విభజించి తన సువిశాల సామ్రాజ్యంలో నగరాలు, పట్టణాలు, కూడళ్ళు, ఉద్యానవనాలు, బుద్ధునితో ప్రత్యక్ష సంబంధమున్న ప్రతిచోట 84,000 ధాతు గర్భ స్థూపాలను నిర్మించిన ఘనత అశోకునిదే. ఈ విషయాలను గూర్చి దివ్యావధానం, సుమంగళి విలాసిని, మహానిబ్బాణసుత్త తెలియచేస్తున్నాయి. ఇవిగాక లెక్కకు మించిన గుహాలయాలు, గుహాశాసనాలు, స్తంభశాసనాలు, స్థూపస్తంభాలు, లఘుశాసనాలు, కళింగ శాసనాలు, ఎన్నింటినో వేయించి ధమ్మప్రచారంలో తనకు తానే సాటిగా నిలిచిన మహా చక్రవర్తి అతడు.

పాశ్చాత్య దేశాలతో సహా అనేక ప్రాంతాలకు ధమ్మ విస్తరణకు మహామాత్రుల పేరిట భిక్షువులను పంపిన అరుదైన ఘట్టం అశోకుని కాలంలోనే జరిగింది. 'మహావంశ' లో చెప్పబడిన సమాచారం ప్రకారం డజనుకు పైగా భిక్షువులను ఆయా దేశాలకు పంపాడు. సారనాథ్‌లో స్థూపాలను కనింగ్‌హామ్ పరిశోధిస్తుండగా బయటపడిన కొన్ని భస్మపేటికలు, వాటిమీద గల శాసనాలు ఈ విషయాన్ని ఋజువు చేస్తున్నాయి. ఈ శాసనాలను బట్టి మజ్ఝంతికుడు- కాశ్మీర, గాంధార దేశాలు, మహారక్షితుడు- గ్రీకుదేశం, మధ్యముడు, కశ్యపుడు,- హిమాలయాలకు, ధర్మరక్షితుడు- అపరాంతక దేశం, మహాధర్మ- రక్షితుడు- మహారాష్ట్ర దేశం, మహాదేవుడు- మహిశ మండలం, రక్షితుడు- వనవాసి దేశం, క్షేణుడు, ఉత్తరుడు - బర్మా, మహీంద్రుడు, సంఘమిత్ర- సింహళము వెళ్ళగా, అశోకుని 2,5 శాసనాలను బట్టి చోళ, పాండ్య సత్యపుత్రులను- కేరళ, యవన, కాంభోజ, గాంధార దేశాలకు పంపాడు. అశోకుని కాలానికి దగ్గరవాడైన రెండవ ఆంటియోకస్ యొక్క రాజధాని ఈజిప్టు, సిరియా, సిరన్, మాసిడోనియా, ఎపిరన్ దేశాలకు, ఆసియా, ఆఫ్రికా, యూరప్ దేశాలకు సహితం ప్రచారకులను పంపినట్లు శాసనాలు ద్వారా తెలుస్తుంది.

క్రీ.పూ. 250-200 మధ్య కాలంలో పాటలీ పుత్రంలో తృతీయ బౌద్ధ సంగీతిని అశోకుడు నిర్వహించగా మొగ్గలిపుత్తతిష్య దీనికి అధ్యక్షుడుగా వున్నాడు. ఈ సంగీతి తీర్మానం ప్రకారమే మహామాత్రులను నియమించారు.

అశోకుని కుమార్తె సంఘమిత్ర, కుమారుడు మహీంద్రుడు సహ తన కుటుంబాన్ని, బంధువులను, తన మంత్రివర్గ సహచరులను, సామంతులను, ప్రజలను, తన రాజ్యపాలనను నిరంతరాయంగా బౌద్ధ ధమ్మ వ్యాప్తికి పనిచేయించిన అశోకుని సేవా తత్పరత బౌద్ధ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయం. ఏ చక్రవర్తి చేయని త్యాగమిది. తన కోశాగారాన్నంతటిని ప్రజల సంక్షేమం కోసం, ధమ్మవ్యాప్తి కోసం ఖర్చు చేసిన ధమ్మశీలి ఆయన. ఇంతటి ఉదాత్తమైన చక్రవర్తి యొక్క చరిత్రను కుహనా చరిత్రకారులు ఉద్దేశపూర్వకంగా విస్మరించినా దీపవంశ, మహావంశ, దివ్యావదానం, అశోకావదానం, అశోక రాజావదానం, అశోకరాజసూత్రం, అశోక వినీతావదానం,

కుణాళావదానం, విశుద్ధిమగ్గ, సమంత పాసాదికా అనే పాళీ సాహిత్య బౌద్ధ గ్రంథాలు (ఇవి భారతదేశానికే చెందినవైనా ప్రస్తుతం టిబెట్, చైనా, జపాన్ దేశాలలో లభ్యం) ఆ మహాచక్రవర్తి గూర్చి ఎంతో సమాచారాన్ని అందిస్తున్నాయి. ధమ్మమే సమస్త జీవకోటిని కాపాడుతుందని ప్రవచించిన బుద్ధుని సందేశాన్ని దేశ విదేశాల్లో వినిపించిన అశోకుడు, ప్రజలు దుఃఖరహితంగా, సుఖశాంతులతో జీవించాలని బోధించి బుద్ధుని ఆశయాలను నెరవేర్చడానికి తన జీవిత పర్యంతం పరితపించిన అశోకుని గూర్చి ఒక వాక్యమైనా రాయకుండా, వందిమాగధులను కీర్తించడానికి వేల శ్లోకాలు కుమ్మరించిన వైదిక సాహిత్యం అశోకుడికి బెత్తెడు జాగా కూడా ఇవ్వలేదు.

ఆధునిక కాలంలో డా॥బి.ఆర్.అంబేడ్కర్ తిరిగి బౌద్ధాన్ని పునర్జీవింపచేశాడు. ప్రజల మస్తిష్కం నుండి మరలిపోయిన బౌద్ధాన్ని 1200 సం॥ల తరువాత తిరిగి ఈ దేశానికి నవ్య కాంతులతో పరిచయం చేశాడు. అశోకుడు ఇతర రాజవంశాలు ఒక చక్రవర్తి స్థానంలో వుండి బౌద్ధాన్ని దశదిశలా వ్యాపింపచేస్తే, అంబేడ్కర్ పేదవానిగా జన్మించి, ప్రపంచ మేధావిగా ఎదిగి, తనకు అధికారం అర్థబలం లేకపోయినా ఒక సామాన్యుడిగా బౌద్ధాన్ని పునరుద్భవనం చేసిన ఘనత అంబేద్కర్‌ది. ముప్పైరెండు- అత్యుత్తమ లక్షణాలు ఉండే బౌద్ధంలో అటువంటి వారిని బోధిసత్వగా పేర్కొంటారు. బుద్ధుడు, అశోకుడు తమ జీవితకాలంలో ఈ లక్షణాలను ప్రోది చేసుకున్నారు. కాని అంబేద్కర్‌కు అవి జన్మతః వచ్చినవంటారు. బహుశా ఈ అంశాలే ఆయనను మహోన్నతునిగా చేసి వుంటాయి.

దేశంలో గల అనేకానేక రుగ్మతలకు వలస విధానంలో వచ్చి ఇక్కడ ప్రబలిన ఆచారాలే కారణమని ఆయన బలంగా విశ్వసించాడు. ఈ అనాచారాలు పోవాలంటే ప్రత్యామ్నాయం తప్పదని నమ్మాడు. తత్ఫలితంగా 1935 అక్టోబర్ 24 న మహారాష్ట్రలోని నాసిక్ సమీపంలో 'యోలా' ప్రాంతం వద్ద జరిగిన మహా సమావేశంలో తన మత మార్పిడి ప్రకటనను విని, హిందూ సమాజం యావత్తూ నివ్వెరపోయింది. సముద్రాలన్నీ ఒక్కసారి ఉప్పెనై ఉప్పొంగినట్లు, భూగోళమంతా ఒక్కసారి కంపించినట్లు, నవనాడులు చచ్చుబడి కుప్పకూలి పోయినట్లు భావించారు. శంకరాచార్యుడు, పీఠాధిపతులు, హిందూ నాయకులు మతమార్పిడిని వాయిదా వేసుకోవాలని, మతం మార్చుకోవద్దని రాయబారాలు పంపారు. మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ నుండి మదన్ మోహన్ మాలవ్య వరకు ఎందరో తొందరపడవద్దని సూచించారు. అదే సమయంలో ఇస్లాం, సిక్కు, పార్శి, జైన, క్రైస్తవ మతాల పెద్దలు తమ తమ మతాలలోకి రావాలని ఆహ్వానించారు.

ప్రపంచ మతాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన అంబేడ్కర్ ఈ దేశానికి వారసత్వ మతమైన బౌద్ధం పట్ల ఆకర్షితులయ్యారు. ఆధునిక ప్రపంచానికి కావలసినది బౌద్ధమేనని, విజ్ఞానశాస్త్ర సమ్మతమయిన బౌద్ధాన్ని అంగీకరించడంలోనే సమాజ శ్రేయస్సు ఆధారపడి వుందని భావించాడు. 1950 నుండి బౌద్ధ కార్యక్రమాలలోను, బౌద్ధ సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకురావడంలోను నిమగ్నమైనాడు. 1950 మే 3వ తేదీన ఢిల్లీలో అనేక శతాబ్దాల తరువాత తిరిగి అంబేడ్కర్ ఆధ్వర్యంలో బుద్ధజయంత్యోత్సవాలు జరిగాయి. అదే సంవత్సరంలో మహాబోధి సొసైటీ వారి కోరిక మేరకు "బుద్ధుడు-బౌద్ధమత భవితవ్యం" అనే వ్యాసాన్ని వ్రాశారు.

1950 లో శ్రీలంకలో జరిగిన మొదటి ప్రపంచ బౌద్ధ మహాసభలలో అంబేడ్కర్ పాల్గొని బౌద్ధమత విశిష్టతపై ఉపన్యసించారు. 1951 లో "బుద్ధిస్ట్ సొసైటీ ఆఫ్ ఇండియా" స్థాపించాడు. 1954 డిసెంబర్‌లో రంగూన్‌లో "వరల్డ్ ఫెలోషిప్ ఆఫ్ బుద్ధిస్ట్" వారు ఏర్పాటు చేసిన ప్రపంచ బౌద్ధ మహాసభలలో పాల్గొని బుద్ధుడు పుట్టిన దేశంలో బౌద్ధం క్షీణించి పోవడం దురదృష్టకరమని

కన్నీటి పర్యంతమయ్యాడు. ఇక్కడ ఆయనకు బహుకరించిన బుద్ధ విగ్రహాన్ని పూరాలోని దేహురోడ్‌లో కొత్తగా నిర్మించిన బౌద్ధారామంలో ప్రతిష్టిస్తూ, బౌద్ధ ధమ్మ ప్రచారానికి తన జీవితాన్ని ధారపోస్తానని, బుద్ధుని బోధనలు సుగమం చేయడానికి తానొక గ్రంథం వ్రాస్తున్నానని ప్రకటించారు. 1955 నాటికి అంబేద్కర్ బౌద్ధం స్వీకరించబోతున్నాడన్న విషయం ప్రపంచ బౌద్ధులను ఆనందపరవశులను చేసింది. టాటా వంటి ఆర్థిక సంపన్నుడికి రెండు నిమిషాలు మాత్రమే కేటాయించిన అంబేద్కర్ ఒక ఇటాలియన్ బౌద్ధగురువు 'లోక్ సుధా'తో గంటల తరబడి చర్చించడం గమనించతగ్గది.



నాగపూర్ దీక్షాభూమిలో
డా॥అంబేద్కర్ బౌద్ధ ధమ్మ స్వీకరణ (14-10-1956)

భారతదేశంలో బౌద్ధ విశ్వవిద్యాలయాన్ని బెంగళూరులో స్థాపించుటకు పన్నాహాలు ప్రారంభించాడు. ఇందుకు మైసూరు మహారాజు అయిదు ఎకరాల భూమిని కేటాయించడం జరిగింది. హిందువులకు "బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం", ముస్లింలకు "ఆలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం" వలె బౌద్ధులకు ఈ విశ్వవిద్యాలయాన్ని 'నలంద' 'తక్షశిల'లకు ప్రతిరూపంగా చేయాలని భావించారు.

భారతదేశ రాజ్యాంగాన్ని బౌద్ధనీతి సూత్రాలను ఆధారంగా చేసుకుని రచించాడాయన. 1956 పూర్వార్ధానికి తాను రచించిన "బుద్ధ అండ్ హిజ్ గాస్పెల్" గ్రంథం దాదాపు పూర్తయి తరువాత అది "బుద్ధ అండ్ హిజ్ ధర్మ" పేరుతో ముద్రించబడినది. ఇది గాక బౌద్ధంపై బుద్ధుడు- కారల్‌మార్క్స్, ప్రాచీన భారతదేశంలో విప్లవం- ప్రతి విప్లవం అనే గ్రంథాలను రచించారు.

1956 అక్టోబర్ 14న నాగపూర్ పట్టణంలో అశోక విజయదశమి రోజున మహాస్థవిర చంద్రమణి అంబేద్కర్‌కి సతీ సమేతంగా దీక్ష నిచ్చారు. ఆ రోజున అయిదు లక్షలమంది, మరుసటి రోజున మూడు లక్షలమంది బౌద్ధాన్ని స్వీకరించారు. ప్రపంచంలో ఒకే రోజున లక్షలమంది బౌద్ధాన్ని స్వీకరించడం ఒక రికార్డుగా నిలిచిపోయింది. దురదృష్టవశాత్తు అంబేద్కర్ ఏడు వారాలు మాత్రమే బౌద్ధుడుగా జీవించాడు. ఆయన మరికొంతకాలం జీవించి వుంటే యావత్ దేశాన్ని బౌద్ధదేశంగా మార్చి అశోకుని కాలాన్ని తిరిగి తెచ్చేవారు. అందుకే బౌద్ధ విస్తరణలో అశోకుడు, అంబేద్కర్‌లు బోధిసత్త్వులుగా కీర్తినార్జించారు.

ఈ విధంగా అశోకుడు- అంబేద్కర్‌లు కేవలం బౌద్ధులుగా జీవించడం మాత్రమే కాకుండా కడవరకు బౌద్ధవ్యాప్తి కోసం అహర్నిశలు పరితపించిన బోధిసత్వులు. బుద్ధుని తర్వాత వీరిద్దరి ప్రస్తావన లేకుండా బౌద్ధం గురించి చర్చించడం అసాధ్యమన్నంతగా కృషి చేశారు. సామ్రాజ్యాధిపతిగా ప్రాచీనకాలంలో అశోకుడు, రాజ్యాంగం ద్వారా ఆధునిక భారతదేశంలో బౌద్ధ విస్తరణకు కావలసిన సమస్త సదుపాయాలను అంబేద్కర్ సమకూర్చి వెళ్ళారు. ఆ యిద్దరి ఆశయాలను మరింత ప్రతిభావంతంగా ముందుకు తీసుకువెళ్ళాల్సిన బాధ్యత నేటి బౌద్ధులందరి మీదా వుంది. ఆ ఆశయ సాధనలో అందరం భాగస్వాములమౌదాం. ❋

*రచయిత సెల్ : 94940 09615*

# అశోకుడు-కుణాలుడు

-బోధచైతన్య

అశోక చక్రవర్తి పట్టమహిషి పద్మావతీదేవి కుమారుడు ధర్మవివర్ధనుడు. అతని నేత్రములకు అసాధారణమైన శోభ ఉండడం వల్ల కవులు కావ్యాల్లోని ఉపమానాలు ఏవీ కూడా ఆ నేత్ర రామణీయకతను వర్ణించడానికి సరిపోయేవి కాదు. హిమాలయాల్లో మాత్రమే కనబడే కుణాల పక్షి కన్నులవంటి సుందరమైన కన్నులు కలిగినవాడని ప్రజలు చెప్పుకోవడంతో అతనికి కుణాలుడు అనే పేరు వాడుకలోకి వచ్చింది.

కుణాలుడు చిన్నప్పటి నుండి స్థవిర ఉపగుప్తుని వద్ద ఆధ్యాత్మ శిక్షణను పొందాడు. జీవితానికి ఎందుకూ పనికిరాని అయోమయ విద్యగా ఆధ్యాత్మ విద్య మారిపోవడానికి కారణం ఆ విద్యా దోషం కాదు. దానిని ప్రవచించే వక్తల దోషమే. దుఃఖం నుండి విముక్తిని పొందే ఉపాయాలను తెలిపేది ఆధ్యాత్మ విద్య. శరీరానికి కలిగే ఎలాంటి బాధనైనా (దుఃఖం) తట్టుకొనగలిగే శక్తినిచ్చే ఒకానొక ధ్యానాన్ని ఉపగుప్తుడు కుణాలునికి నేర్పి బాగా అభ్యసింపజేశాడు. దాని పేరు "సర్వధర్మ సుఖాక్రాంతి సమాధి". మానసికంగా కలిగే బాధలను (శోకం) తట్టుకొనగలిగే ప్రజ్ఞా వాక్యాలను బోధించి బాగా మననం చేయించాడు. కుణాలుడు యౌవన దశకు వచ్చేసరికి ఉపగుప్తుని శిక్షణ వల్ల మొత్తం జీవితం పట్ల చక్కని అవగాహన కలవాడయ్యాడు. అనాత్మ చింతన, అనిత్య చింతన, దుఃఖసత్య చింతన వల్ల అతని చిత్తం చాలా పరిపక్వత చెందింది. ఆ పరిపక్వత వల్ల అతని మాటలో, చూపులో, నడతలో ఎలాంటి వెకిలితనం కనిపించేది కాదు. అతణ్ణి చూసి ప్రజలు, "మనం బుద్ధుణ్ణి చూడలేదు కానీ బుద్ధుడు ఎలా నడిచేవాడు, ఎలా మాట్లాడేవాడు అనే విషయాన్ని కుణాలుణ్ణి చూసి ఊహించుకోవచ్చు" అనుకునేవారు. కుణాలుణ్ణి చూసినప్పుడు, తలచినప్పుడు అశోక చక్రవర్తి ఆనందంతో పరవశించిపోతూ... 'నా వారసుడు' అనుకొనేవాడు.

విద్యాభ్యాసం పూర్తయ్యాక కుణాలునికి వివాహం అయ్యింది. భార్య పేరు కాంచనమాల. వివాహం అయిన కొంతకాలానికి అశోకుడు అతణ్ణి తక్షశిలకు రాజప్రతినిధిగా నియమించాడు. ప్రయాణానికి ముందు కుణాలుడు అందరి వద్ద సెలవు తీసుకుంటూ పినతల్లి అయిన తిష్యరక్షిత నివాసానికి వెళ్ళాడు. తిష్యరక్షిత ప్రౌఢ వయస్కురాలు. కుణాలుణ్ణి తన మందిరంలో ఏకాంతంలో చూసిన ఆ క్షణంలో ఆమెలో ఒక వింత కోరిక బలంగా కలిగింది. అంతకు పూర్వం ఎన్నోసార్లు కుణాలుణ్ణి జనం మధ్యలో చూసి వున్నది, మాట్లాడి వున్నది. అప్పుడు లీలామాత్రంగా కూడా తలెత్తని అనుచిత వాంఛ ఇప్పుడు బలంగా బుసలు కొట్టి పడగ ఎత్తింది. కుణాలుడు ఋషితుల్యుడు. అతని మనోనిబ్బరం ముందు తిష్యరక్షిత భగ్నమనోరథ అయింది. ఆమె 'అహం' దెబ్బతినింది. వాంఛ, ప్రతీకార వాంఛగా రూపాంతరం చెందింది. అతణ్ణి సర్వనాశనం చేయాలని నిశ్చయించుకుంది.

కొన్నేండ్లు గడిచాయి. అశోకచక్రవర్తి అస్వస్థుడై కొంతకాలం పాటు అపస్మారక స్థితికి లోనయ్యాడు. ఆ సమయంలో తిష్యరక్షిత రాజముద్రికను తన అధీనంలో ఉంచుకొన్నది. కుణాలుని మీద పగ సాధించే అవకాశం ఆమెకు అప్పుడు లభించింది. రాజముద్రిక బలంతో కుతంత్రం నడిపింది. ఈ విధ్వంసక కార్యంలో మాత్రం ఆమె భగ్నమనోరథ కాలేదు. కుణాలుడు పదవి కోల్పోయాడు. కన్నులు పెకలించబడినవాడయ్యాడు. తక్షశిల నుండి గెంటివేయబడినవాడున్నూ అయ్యాడు.

భార్య కాంచనమాల అతణ్ణి నడిపిస్తూ పాటలీ పుత్రానికి ప్రయాణమయ్యింది. కొన్ని

నెలలపాటు అనేక మజిలీలుగా సాగిన ఆ సుదీర్ఘ ప్రయాణంలో కుణాలుడు తనకు తెలిసిన విద్యతో బ్రతుకు తెరువు సాగిస్తూ ప్రయాణించాడు. వీణను అద్భుతంగా మీటుతూ జనులను ఆ వీణావాదనంతో రంజింపజేస్తూ, భిక్షను గడిస్తూ ప్రయాణించాడు. చివరకు భార్యాభర్తలు పాటలీపుత్రం చేరారు. అక్కడెవ్వరూ వీళ్ళను గుర్తుపట్టలేదు. ముష్టివాళ్ళనే భావమే వాళ్ళకు కలిగింది. ఒకనాడు పాటలీపుత్రం రాజమార్గం ప్రక్కన వున్న ఒక విశాలవృక్షం క్రింద కూర్చొని కుణాలుడు వీణను మీటుతున్నాడు. ఏదో పనిమీద హడావిడిగా అటు వెళ్తున్న ఆస్థాన సంగీత విద్వాంసుడు ఆ వీణావాదనను విని ఠక్కున ఆగాడు. "ఆశ్చర్యం! పరమాశ్చర్యం! ఇంత దివ్యంగా వీణను పలికించగలిగేది ఒక్క కుణాలుడే. ఈ ముష్టివాడికి ఇది ఎలా సాధ్యమయింది? కుణాలుని వద్ద నేర్చుకొన్నాడా? అసంభవం! ఒకరు నేర్పితే మరొకరు నేర్చుకొనే విద్య కాదది. ఒక్క కుణాలునితోనే వచ్చిన విద్య అది. అతనితోనే అంతరించిపోయేదిన్నూ, కానీ ఈ గుడ్డి బిచ్చగాడు అచ్చం కుణాలునిలా వీణను పలికిస్తున్నాడు. ఏమిటీ వింత! కనుక్కొంటాను" అనుకొని అతని సమీపానికి పోయి "బాబూ! ఈ వీణా వాదనను నీకు కుణాలుడు నేర్పాడా?" అని ప్రశ్నించాడు. ఆ కంఠధ్వని ఎవరిదో కుణాలుడు గుర్తించి "ఆచార్యా! అభివాదం. నేనీ విద్యను ఎవరి నుండీ నేర్చుకోలేదు. ఎవరికీ నేర్పనూ లేదు. కుణాలుడను నేనే" అన్నాడు.

❋ ❋ ❋

అశోక చక్రవర్తి సభాభవనమది. అమాత్యులు, సేనాపతులు ఇంకా అనేక ప్రముఖులు ఆశీనులై వున్నారు. సింహాసనం దిక్కుగా తలెత్తి చూడటానికి కూడా వాళ్లలో చాలామందికి భయం వేస్తున్నది. సింహాసనం మీద వృద్ధసింహంలా రౌద్రాకారంతో అశోకచక్రవర్తి ఆశీనుడై వున్నాడు. అక్కడ చాలా మందికి అది నమ్మశక్యం కాని కొత్త అనుభవం. ఆ రౌద్ర రూపం వృద్ధ సేనాపతులు కొందరికి మాత్రం ముప్పై ఏండ్ల క్రిందట కళింగ యుద్ధ భూమిలో అనుభవమే. కుణాలుడు ఆస్థాన సంగీత విద్వాంసుని దృష్టిలో పడిన తరువాత ఒకటి వెంట ఒకటి వేగంగా అనేక సంఘటనలు జరిగాయి. తిష్యరక్షిత నడిపిన కుతంత్రం వెలుగులోకి వచ్చింది. ఆమెకు శిక్ష విధించడానికి ఏర్పాటైన సభ అది. అశోక చక్రవర్తి చండాశోకునిలా మండిపోతు

ధర్మపాలనాచింతనలో నిమగ్నుడైన సమ్రాట్ అశోకుడు



న్నాడు. తిష్యరక్షితను చిత్రహింసలు పెట్టి చంపవలసిందిగా ఆజ్ఞ ఇవ్వబోతున్నాడు.

నాన్నా! అనే మధురాతి మధురమైన కంఠస్వరం విని ఆగాడు. ఆ పిలుపు, పక్కనే మరో ఆసనం మీద కూర్చునివున్న కుణాలునిది. లేచి చేతులు జోడించి ఇలా విన్నవించాడు.

"మన ఆచార్యదేవుడు స్థవిర ఉపగుప్తుడు నిరుపధిశేష నిర్వాణం పొంది ఇప్పటికి* సరిగ్గా పదేండ్లయింది. అయినప్పటికీ ఆ మహానుభావుని మంగళప్రదమైన రూపం నాకు ఇప్పటికీ కళ్ళకు కట్టినట్లు కనిపిస్తూనే వుంది. నా కర్మగతిని ముందుగానే చూడగలిగిన అభిజ్ఞా సంపన్నుడాయన. కర్మగతిని మార్చడం సాధ్యం కాదని తెలిసిన ఆయన నాకు దాన్ని తట్టుకొని నిలబడగలిగే శిక్షణ ఇచ్చి వెళ్ళాడు. నా శరీరానికి బాధ గానీ మనస్సుకు శోకం గానీ, హృదయానికి కొరత గానీ ఎవరివల్లా నాకు కలుగులేదు. నేత్రములు లేకపోవడం వల్ల మగధ రాజ్య సింహాసనాసీనతకు అర్హతను కోల్పోయాను కానీ దీన్ని ఒక నష్టంగా నేను భావించడం లేదు. అశోక చక్రవర్తికి పుత్రుడనే భావన కూడా నాకు లేదు. ఉపగుప్తులవారి అనుగ్రహం వల్ల నేను ధర్మరాజ పుత్రుడనయ్యాను (spiritual son of Buddha). ఆయన కల్యాణ మిత్రత్వ భాగ్యం (spiritual guidance) నాకన్నా మీకే ఎక్కువ లభించింది కదా! ఆయన నిర్దేశించిన విధంగా మీరు ఆసేతుహిమాచల పర్యంతం లెక్కలేనన్ని చైత్యాలు, స్థూపాలు నిర్మించారు. సద్ధర్మవ్యాప్తికి అహోరాత్రాలు శ్రమించారు. మీరు గడించినంత పుణ్యారాశిని ఇంకే చక్రవర్తీ గడించలేదు. గడించబోరు. ఇంతటి పుణ్యరాశి కూడా ఒక్కక్షణ ద్వేషచిత్తం, క్రోధచిత్తం వల్ల దగ్ధమై పోగలదని కదా తథాగత వచనము. ముప్ఫై ఏండ్ల క్రితం మీ జీవితంలో మహత్తరమైన మార్పుకు కారణమైన భదంత ఉపగుప్తుణ్ణి ఒక్కసారి స్మరించండి. తథాగతుని కరుణా రూపాన్ని కూడా ఒక్కసారి స్మరించండి. మీరు దేశంలో అనేకచోట్ల నెలకొల్పిన శిలాశాసనాల్లో తథాగత బోధనలు ఏడింటిని విశేషించి ప్రశంసించి వున్నారు. వాటిని కూడా ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకొనండి. మీరు నాకు ఇష్టాన్ని ప్రియాన్ని చేయదలచి అనుగ్రహించే పక్షంలో నా మనవి ఒకటే. నా తల్లి తిష్యరక్షితకు క్షమాభిక్షను అర్థిస్తున్నాను."

చండాశోకుడుగా మారిపోయిన అశోకుడు ఆ క్షాంతిశీలుని హితవచనములకు ప్రభావితుడై మళ్ళీ శాంతాశోకుడుగా, ధర్మాశోకుడుగా మారాడు. ❋

---

* దేహంతో జీవించి వున్నప్పటి నిర్వాణం సోపధిశేష నిర్వాణం. దేహం వదిలాక నిరుపధిశేష నిర్వాణం.

## పాఠకులకు మనవి

బుద్ధభూమి అక్టోబరు, నవంబరు నెలల సంయుక్త సంచికగా అశోకునిపై ప్రత్యేక సంచిక వచ్చింది. ఇందులో క్రింద పేర్కొన్న వాటిని ప్రచురించడానికి వీలు పడలేదు. పాఠకులు గమనించగలరు.

1. శ్రీకృష్ణార్జునబోధి గారి 'దాన విశిష్టత-ఒక అవగాహన' వ్యాసం (ధారావాహిక)
2. వరంగల్‌లో జరగబోయే 4వ ఆంధ్రప్రదేశ్ బౌద్ధ మహాసమ్మేళనం వివరాలు,
3. పలు ప్రాంతాలలో జరిగిన ధమ్మ కార్యక్రమ వివరాలు.

పై అంశాలు 2012 డిసెంబరు సంచికలో ప్రచురితమవుతాయి.

**-సంపాదకుడు**

# అశోకుడు-వాస్తు శిల్పకళా వికాసం

-డా|| వి. కె. మోహన్

**మూ**డవ బౌద్ధ సంగీతి తరువాత అశోకుడు బౌద్ధమత ప్రచారానికి బౌద్ధ భిక్షువులను వివిధ ప్రాంతాలకు పంపాడు. వీరి ప్రచారం వలన బౌద్ధమతం ప్రపంచంలోని అనేక దేశాలకు వ్యాపించింది. అశోకుడు తన భబ్రు, సారనాథ్ శిలా శాసనాలలో బుద్ధుడు, ధర్మం, సంఘం పట్ల తన విశ్వాసాన్ని ప్రకటించాడు. బౌద్ధభిక్షువుల దుస్తులలో వున్న అశోకుని శిలా విగ్రహాన్ని చూశానని ఇత్సింగ్ తన రచనల్లో పేర్కొన్నాడు. దీనినిబట్టి కూడా అశోకునికి బౌద్ధం పట్ల వున్న విశ్వాసం స్పష్టమవుతుంది.

బౌద్ధ ధర్మ సూత్రాలను సామ్రాజ్యమంతటా కొండ గుహలలోను, శిలలపైన, శిలా స్తంభాలపైన చెక్కించాడు. షహ్‌బజ్‌ఘరీ, మన్సీరా, సోపారా, గిర్నార్, మస్కీ, ఖాల్సీ, ధౌలీ, జౌగాడ్, తారియ నందనఘర్ మొదలగు చోట్ల ఈ స్తంభ శాసనాలు గలవు. దివ్యవదన అను గ్రంథంలో అశోకుడు ఒకే సమయంలో 84 వేల స్తూపాలను నిర్మించినట్లు చెప్పడం జరిగింది.

## వాస్తుకళ

స్తూపాలు, విహారాలు, గృహాలు, పట్టణాలు, కోటలు, దేవాలయాలు మొదలగు వాటి నిర్మాణ క్రమం వివరించేది వాస్తుశాస్త్రం. కట్టడాల ఆకృతులు, వాటి నిర్మాణ క్రమం, వాటి వాటి ప్రయోజనాలకు అనుకూలంగా వుంటాయి. ప్రాచీన కాలంలో భారతీయులు భవనాలను, స్తూపాలను, ఆలయాలను ఉత్తమంగా నిర్మించడంలోను, వాటిని చాలా శోభాయమానంగా చిత్రకళా ఖండాలతో అలంకరించడంలోను వాసికెక్కినారు. చిత్రకళలో రెండు అంశాలు ఇమిడి వున్నాయి. అవి శిల్పం, చిత్రలేఖనం. వాస్తవానికి వాస్తు, శిల్ప, చిత్రలేఖనాలు మూడు ఒకదాని కొకటి సంబంధించినవే కానీ వేరు కావు. భారతీయులు కూడా ఈ మూడింటినీ పరస్పర అనుబంధ శాఖలుగానే భావించినారు. సంగీత సాహిత్యాల లాగానే వాస్తు చిత్రకళలను కూడా ప్రాచీన కాలంలో భారతీయులు ఎక్కువగా దైవ కార్యార్థమై వినియోగించారు. అందుచేత ప్రాచీన భారతీయ వాస్తుచిత్ర కళారీతులు చాలావరకు మతపరమైనవే. భారతదేశం అనేక మతాలకు పుట్టినిల్లు. వీటిలో బౌద్ధం, జైనం, హైందవం ప్రధానమైనవి. ఈ మూడు మతాలు కాలక్రమేణ శాఖోపశాఖలుగా చీలినాయి. ఈ మత శాఖల ఆరాధనా పద్ధతులలోను, దేవగృహ నిర్మాణ రీతులలోనూ భేదాలున్నాయి. ఈ విషయానికి సంబంధించి ప్రాచీనకాలంలో భారతీయులు అనేక గ్రంథాలు రచించినారు. వాటిలో ప్రధానంగా పేర్కొనవలసినవి మయమత, మానసార, సమరాంగణ సూత్రధార, రూప మండపం, విష్ణు ధర్మోత్తరం, శిల్పరత్నం మొదలగునవి.

భారతదేశంలో అత్యంత ప్రాచీన నిర్మాణాలను గురించి ప్రస్తావించేటప్పుడు ప్రధానంగా పేర్కొనవలసినవి హరప్పా, మొహంజొదారో, లోథాల్, కాలీబంగాన్ లాంటి సింధూ నాగరికతా స్థావరాలలో లభించిన అవశేషాలు. సింధు ప్రజలు నిర్దుష్టమైన వాస్తు సూత్రాలను అనుసరించినట్లు తెలుస్తుంది. వీరి నిర్మాణాలన్నీ ఉపయోగాన్ని దృష్టిలో వుంచుకొని నిర్మించినవే. సింధు ప్రజలు శిల్పకళలో కూడా నేర్పరులే. వీరి శిల్పకళా కౌశలానికి తార్కాణం మొహంజొదారోలో లభించిన నాట్యకత్తె కాంస్య ప్రతిమ. సింధు నాగరికుల కళాత్మక సృష్టిలో వారి ముద్రికలు అతి ప్రసిద్ధమైనవి. సింధు నాగరికత పతనానంతరం మళ్ళీ మౌర్య సామ్రాజ్యమేర్పడే వరకు చెప్పదగిన వాస్తు శిల్పకళా ఖండాలేవీ కన్పించవు. వేదకాలంలో వెదురు, తరువు, మట్టి, రెల్లు, ఆకులతో నిర్మాణాలు జరిగేవని, అవి ఆదిమ రీతిలో వుండేవని తెలుస్తుంది. కానీ నాటి నిర్మాణాలన్నీ అశాశ్వతమైనవి


అశోకుడు నిర్మించిన సాంచీ స్తూపం

కాబట్టి నేడు అవి మనకు లభించుట లేదు. అయితే వాటి నిర్మాణాల వివరాలు ప్రాచీన గ్రంథాలను బట్టి గ్రహించవచ్చు.

భారతదేశంలో సమగ్రమైన వాస్తు చరిత్ర మౌర్యుల కాలంలోనే ఆరంభమౌతుంది. ఈ కాలంలో భారత వాస్తు, శిల్పకళలు ఎంతో అభివృద్ధి పొందినాయి. మౌర్యులనాటి కట్టడాలను లౌకికమైనవి, మతసంబంధమైనవి అని రెండు రకాలుగా విభజించవచ్చు. లౌకిక పరమైన నిర్మాణాలకు తార్కాణం పాటలీపుత్ర నగరం. గ్రీకు రాయబారి మెగస్తనీస్ తన గ్రంథమైన ఇండికాలో మౌర్యుల రాజధాని నగరమైన పాటలీపుత్రం బహు విస్తృతమైన నగరంగా వర్ణించాడు. మౌర్యుల తరువాత 700 సంవత్సరాలకు భారతదేశానికి వచ్చిన చైనా యాత్రికుడు పాహియాన్ పాటలీపుత్రంలోని మౌర్యుల భవనాలను గురించి ఘనంగా వర్ణించాడు. అశోకుడు కట్టించిన భవనాలను చూసి అతడు ఆశ్చర్యచకితుడయినాడట.

అతని మాటల్లోనే చెప్పాలంటే- "అశోకుని రాజసౌధం అత్యద్భుతమైనది. అది దేవతలు నిర్మించినదే కానీ మానవ నిర్మితం కాదు" పాటలీపుత్ర నగరం (పాట్నా) సమీపంలో జరిపిన తవ్వకాలలో రాజప్రాసాద శిధిలాలు బయటపడ్డాయి. మౌర్యుల కోట చాలావరకు దారు నిర్మాణం. దీని నిర్మాణంలో ఎక్కువగా టేకు దూలాలు వాడబడ్డాయి. ఇక్కడ బయల్పడిన రాజప్రాసాద శిధిలాలను బట్టి పారశీక చక్రవర్తుల పెర్సిపోలిస్ నమూనాగా దీనిని నిర్మించారని వాడెల్, స్పూనర్ మొదలగు పండితుల అభిప్రాయం. ఈ రాజసౌధాలు అనంతర కాలంలో మొదట వరద దెబ్బకు గుర్తై, అటు పిదప అగ్నికి ఆహుతి అయినట్లు తవ్వకాలలో వెలువడిన ఒండ్రు, బూడిదల వలన తెలుస్తుంది. తవ్వకాలలో బయట పడిన రాజభవన శిధిలాలను బట్టి శిలా స్తంభాలాధారంగా కొయ్య కప్పుతో భవనాలు నిర్మించే పద్ధతి అశోకుని కాలంలో వ్యాప్తిలోనికి వచ్చినట్లు చెప్పవచ్చును. మౌర్యుల కాలం నాటి మత సంబంధమైన కట్టడాలు అనేకం వున్నాయి. వాటిలో స్తూపాలు, ఏకశిలా స్తంభాలు, గుహాలయాలు పేర్కొనదగినవి.

**స్తూపాలు**

మౌర్య అశోకుడు బౌద్ధమతాభిమానియై, ఆ మత ప్రచారం కోసం తన సామ్రాజ్యంలో 84,000 స్తూపాలను నిర్మింపజేసినట్లు బౌద్ధ గ్రంథాలు పేర్కొంటున్నాయి. బౌద్ధ వాస్తు చరిత్రలో స్తూపాలకు ఒక ప్రత్యేక స్థానం వుంది. వాస్తవానికి స్తూపాల నిర్మాణ కార్యక్రమం బౌద్ధమతాని కంటే ప్రాచీనమైంది. ఆనాడు మహావ్యక్తులు, రాణులు మరణించినప్పుడు వారి శరీర అవశేషాలపై

స్తూపాలు నిర్మించారు. పురావస్తు పరిశోధనల్లో వేదకాలం నాటి అవశేషాలు బీహారులో బయల్పడినాయి. కానీ బౌద్ధులు స్తూప నిర్మాణంలో ఉత్సాహాన్ని చూపి బౌద్ధ సాంప్రదాయంగా మార్పు చేశారు. బుద్ధుడు లేదా బౌద్ధాచార్యుల అవశేషాలపై నిర్మించబడిన కట్టడాలనే స్తూపాలని అంటారు. బౌద్ధులు ఆ స్తూపాలను బుద్ధుడుగా భావించి ఆరాధించేవారు. నిత్యపూజ నిమిత్తం చైత్యగృహాలలో కూడా స్తూపాలను నిర్మించారు.

స్తూపం అన్నా చైత్యం అన్నా ఒక్కటే అర్థం. కొన్ని అవశేషాలపై నిర్మించబడే కట్టడాలను స్తూపాలని, భస్మమైపోయిన అవశేష సముదాయాలపై నిర్మించే వాటిని చైత్యాలని భావించవచ్చు. స్తూపాలు మూడు రకాలు. అవి శారీరక, పారిభోగిక, ఉద్దేశిక స్తూపాలు. బుద్ధుడు లేక బౌద్ధాచార్యుల శరీర అవశేషాలపై నిర్మించబడిన కట్టడాలను శారీరక స్తూపాలంటారు. వీటికే దగోబాలని, ధాతుగర్భాలని కూడా అంటారు. బుద్ధుడు సారనాథ్‌లో జ్ఞానోదయమైన తరువాత తన వెంట్రుకలను, గోళ్ళను త్రపుస, భల్లక అనే నగర శ్రేష్టులకు ఇవ్వగా వారు వాటిపై స్తూపాలు నిర్మించారు. బుద్ధుని నిర్వాణానంతరం అతని శరీర అవశేషాలపై ఎనిమిది స్తూపాల నిర్మించబడ్డాయి. వీటిలోని ఏడు స్తూపాలను మౌర్య అశోకుడు తవ్వి, అందలి అవశేషాలను 84 వేలుగా విభజించి, వాటిపై స్థూపాలు నిర్మించినట్లు బౌద్ధ అనుశృతి. బుద్ధుడు లేక బౌద్ధమతాచార్యులు, ఉపయోగించిన వస్తువుల మీద నిర్మించబడిన కట్టడాలను పారిభోగిక స్తూపాలంటారు. బుద్ధునికి గుర్తుగా ఎటువంటి అవశేషాలు లేకుండా నిర్మించబడినవి ఉద్దేశిక స్తూపాలు.

ఇసుక, మట్టి, రాయి లాంటి పదార్థాలలో నిర్మించిన అర్థగోళాకారపు దిబ్బలను స్తూపాలంటారు. బహు ప్రసిద్ధమైన స్తూపాలు అమరావతి, సాంచీ, సారనాథ్, బుద్ధగయ, తక్షశిల మొదలైన చోట్ల ఉన్నాయి. బౌద్ధస్తూప నిర్మాణ కార్యక్రమము మౌర్య అశోకుని కాలంలో ఆరంభమైంది. అయితే వాటికొక స్థిరమైన ఆకారం ఏర్పడింది శుంగుల కాలంలోనే. స్తూపం ప్రధాన భాగం అండం. ఇది గోళాకృతితో వుంటుంది. తీక్షణాగ్రము కలిగిన స్తూపాలు కూడా బయల్పడ్డాయి. అండము చుట్టూ దాన్ని ఆనుకొని కొంత ఎత్తు వరకు వేదిక ఉంటుంది. అండము మీద హార్మికము, దాని మధ్య పైన ఒక ఛత్రయష్టి ఉంటుంది. వేదిక చుట్టూ శిలా ప్రాకారము, వేదికకు కొంచెం ఎడంగా స్తూపాలకు ప్రధానాలంకారాలై శిలా ప్రాకారము, రాతి తోరణాలు వుంటాయి. ఆంధ్రలో ఎత్తయిన తోరణాలు కాక, సింహ రక్షితాలైన సామాన్య ద్వారాలున్నాయి. అంతేగాక అండానికి చేర్చి నాలుగు ప్రధాన దిశల కభిముఖంగా నాలుగు


అశోకుడు నిర్మించిన
సారనాథ్ స్తూపం

చతురస్రాకారపు తిన్నెలు, వాటిలో ఒక్కొక్కదాని మీద ఐదు ఆయక స్తంభాలు ఆంధ్రస్తూపాల కుండే విశిష్ట లక్షణాలు.

భారతదేశంలో ఉన్న బౌద్ధ స్తూపాలన్నింటిలోను పేరెన్నికగన్నది నేటి మధ్యప్రదేశ్‌లోని సాంచీ స్తూపం. శాసనాల ద్వారా సాంచీ అసలు పేరు 'కాకనదబోట' అని తెలుస్తుంది. అశోకుని కాలంలో సాంచీ ప్రసిద్ధ బౌద్ధ కేంద్రమైనట్లు ఇచ్చట లభించిన శాసనాల వల్ల గ్రహించవచ్చు. విదిశ నగరానికి సమీపంలో ఉన్నందున సాంచీకి ప్రాముఖ్యత పెరిగింది. సాంచీని బుద్ధుడు దర్శించలేదు. కాని విదిశలోని ఒక వ్యాపారస్తుని కుమార్తెను అశోకుడు వివాహ మాడినాడు. వీరికి జన్మించిన మహేంద్రుడు బౌద్ధమత ప్రచారం నిమిత్తం సింహళం వెళ్తూ ఇచ్చట ఒక నెల రోజులపాటు విడిది చేశాడు. ఈ కాలంలోనే అశోకుడు ఇచ్చట స్తూప నిర్మాణం చేపట్టి ఉండవచ్చు. సాంచీలోని స్తూపాలలో నేడు 3 స్తూపాలు మాత్రమే కన్పిస్తాయి. వీటిలో 1వ సంఖ్య గల స్తూపమే మహాచైత్యం. ఈ స్తూప దక్షిణ ద్వారం ముందు అశోకుని స్తంభం గలదు. ప్రముఖ వర్తక కేంద్రమైన విదిశనగరం సాంచీకి సుమారు 8కి.మీ. దూరంలో ఉండడం చేత, విదిశ వర్తకులు సాంచీ బౌద్ధ సంస్థలకు పెద్ద ఎత్తున దానధర్మాలు చేశారు. ఫలితంగా సాంచీ పరిపూర్ణమైన బౌద్ధ క్షేత్రంగా వర్ధిల్లినది.

అశోకుని కాలం నాటికి స్తూపాలను వేదిక, అండము, హార్మిక, ఛత్రము, ప్రదక్షిణ పదము అనే భాగాలు నిర్దుష్టంగా ఏర్పడ్డాయని సాంచీ స్తూపాన్ని బట్టి తెలుస్తుంది. ఈ కాలం నాటి స్తూపాలు ఇటుకలతో నిర్మించబడినప్పటికి చుట్టూ ఉండే ప్రాకారం మాత్రం దారువుతో నిర్మించబడింది. తర్వాత కాలంలో ఈ ప్రాకారం రాతితో నిర్మించడం జరిగింది. సాంచీ స్తూప తోరణ ద్వారాల పైన అద్భుత శిల్ప సంపద కలదు. ఇచ్చటి శిల్పాలన్నీ దేశీయ సాంప్రదాయాలకు అనుగుణంగా తయారైనవి. ఇచటి శిల్పాలు గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబిస్తూ ప్రకృతికి అతి సన్నిహితంగా ఉంటాయి. ఈ శిల్పాలు ప్రత్యేకత నిరాడంబరం, సహజ సౌందర్యం.

అలెగ్జాండర్ కన్నింగ్ హామ్ 1851లో సాంచీలో ఉత్ఖాతనాలు (ప్రాచీన వస్తువుల కోసం తవ్వే తవ్వకాలు) జరిపి 2,3 సంఖ్య గల స్తూపాల నుంచి అస్తికలు, బరిణెలను వెలికి తీశాడు. కన్నింగ్ హామ్ రచించిన భిల్సాతోప్స్ అను గ్రంథంలో సాంచీలోని 7 స్తూపాలతో పాటు ఇతర సమీప ప్రాంతాల స్తూపాల వివరం కలదు. ఆ తరువాత కూలే అను పండితుడు సాంచీ స్తూపాల పునరుద్ధరణ, పరిరక్షణ కార్యక్రమాలు చేపట్టినాడు. మార్షల్ కూడా ఇచ్చట ఉత్ఖాతనాలు జరిపి, పరిశోధనలు చేయడమే గాక ఇచ్చట కట్టడాలకు మరమ్మత్తు చేశాడు. సాంచీ గొప్పతనాన్ని చాటింది మార్షల్ పండితుడే.

గుంటూరు జిల్లాలోని అమరావతిలో ప్రపంచఖ్యాతి గాంచి, ఆంధ్రులకు కీర్తిని ఆర్జించి పెట్టిన మహాస్తూపం వుంది. దీనికి దీపాలదిన్నె, దీపాలదిబ్బ, దీపాలకొండ అను పేర్లు గలవు. ఈ స్తూప నిర్మాణానికి మౌర్య అశోకునిచే పంపబడిన మహాదేవ భిక్షువు పునాదులు వేయగా శాతవాహన, ఇక్ష్వాకుల కాలంలో గొప్పగా అభివృద్ధి చేయబడింది. ఈ స్తూప అండం, ప్రాకారం అద్భుత శిల్పాలతో అలంకరించబడి వుంది. భారతదేశ బౌద్ధకళా చరిత్రలో అమరావతి శిల్పకళకు ప్రత్యేక స్థానం ఉంది.

అశోకుని కాలం నాటికి స్తూప నిర్మాణ పద్ధతులలో ఎన్నో మార్పులొచ్చాయి. నిర్మాణంలో రాతి వాడకానికి ప్రాధాన్యత ఇవ్వబడింది. అశోకుని కాలం నాటికి అమరావతి (ధాన్యకటకం) మహాసాంఘిక బౌద్ధులకు ముఖ్యకేంద్రమయింది. ఈ మహాచైత్యానికి మొట్టమొదటి రాజపోషకుడు అశోకుడు. ఈ చైత్యం చుట్టూ గ్రానైటుతో నిలువు స్తంభాలు గల, సున్నపు రాతితో అడ్డ

దూలాలు గల రెండు ప్రవేశ మార్గాలున్న శిలా ప్రాకారం కట్టబడింది. ఇక్కడ అశోకుని స్తంభశాసనం కూడా వుంది.

గుంటూరు జిల్లా భట్టిప్రోలులో గల స్తూపం ఉత్తర భారత స్తూపాలు వలె గట్టి నిర్మాణం. ఈ స్తూపం చాలా వరకు సాంచీ స్తూపాల్ని పోలి వుంది. ఇందలి శిల్పాలు అమరావతి శిల్పాలలాగ వున్నాయి.



## గుహాలయాలు :

స్తూపాలతో పాటు గుహాలయ నిర్మాణం కూడా అశోకుని కాలంలోనే ప్రారంభమైనది. భిక్షువుల నివాసానికే కాక మత సమావేశాలకు, బోధనలకు, ప్రార్థనా మందిరాలుగా కూడా ఇవి ఉపయోగపడ్డాయి. బీహారులోని బరాబర్ కొండలలో అశోకుడు అజీవకులనే మతస్తుల కోసం గుహాలయాలను తొలిపించాడు. చైత్యాలయాల తొలి రూపాలు ఇవే. అతి కఠిన శిలల నుంచి తొలచిన ఈ గుహలు మొత్తం నాలుగున్నాయి. సామాన్యంగా ఈ గుహలు గూడు బండి ఆకారంలో ఉంటాయి. ఈ గుహల గోడలు అతి నునుపుగా చెక్కబడ్డాయి. ఈ గుహలలో సుదామ గుహముందు భాగం దీర్ఘ చతురస్రం గాను, వెనుక భాగం వలయాకృతిలోను మలచబడింది. లోయశ ఋషి గుహ కూడా దాదాపుగా ఈ గుహనే పోలి ఉంది. అయితే, ఈ గుహ వెనుక భాగం ఆర్చి వలె తీర్చిదిద్దబడింది. ద్వారానికి, కప్పుకు మధ్యలో గల ఏనుగు శిల్పాలు జీవం పోసుకున్నట్లు కన్పించడం విశేషం. ఈ గుహను అనుసరించే ఆంధ్రలోని గుంటుపల్లి గుహలు మలిచారు. లోయశ ఋషి గుహ వాస్తులే రాబోయే యుగాల చైత్య గుహల (అజంతా, ఎల్లోరా) నిర్మాణానికి మార్గదర్శకమైనది.

## ఏకశిలా స్తంభాలు :

అశోకుడు బౌద్ధక్షేత్రాలలో నాటిన ఏకశిలా స్తంభాలు మౌర్యుల నాటి శిల్పకళా వైభవానికి నిదర్శనాలు. ఈ స్తంభాలు బుద్ధుని జీవితానికి సంబంధించిన ముఖ్య ప్రదేశాలలో, బౌద్ధ మతానికి ప్రాముఖ్యం ఉన్న స్థలాల్లో నిర్మించబడ్డాయి. వీటిలో కొన్నింటి మీద రాజ శాసనాలు చెక్కి ఉన్నాయి. అశోకుని స్తంభాల సంఖ్య మొత్తం 30. వాటిలో నేడు 10 మాత్రమే దర్శనమిస్తున్నాయి. వీటిలో బఖిరా, రాంపుర్వ, లౌరియ నందనఘర్, రుమిండై, సంకిస, సారనాథ్, సాంచీ మొదలగు చోట్ల నిలిచివున్నవి ప్రముఖంగా చెప్పదగ్గవి. వీటిలో లౌరియ నందన్‌ఘర్‌లోని శిలాస్తంభం

ఇప్పటికి చెక్కుచెదరకుండా నిలిచివుంది. ఈ స్తంభాన్ని పరిశీలించడం ద్వారా అశోక స్తంభాల యొక్క ముఖ్య లక్షణాలు వాటి రమణీయత అవగతమవుతుంది. ఈ స్తంభాలు కొన్ని తెల్లటి సున్నపు రాళ్ళతోను, మరికొన్ని లేత పసుపు వర్ణ సున్నపు రాతితోను తయారు చేశారు. తెల్లవర్ణం కలిగినవి మధుర ప్రాంతంలో, పసుపు వర్ణం కల్గినవి చునార్ ప్రాంతంలో లభ్యమవుతుంది. ఈ స్తంభాలు సాధారణంగా 50 అడుగుల ఎత్తుతో, 50 టన్నుల బరువు కలిగి ఉంటాయి. సాంకేతిక పరిజ్ఞానంలో, కళా నైపుణ్యంలో, రాతిని మలచడంలో నాటి కళాకారులు అపూర్వమైన ప్రజ్ఞను కనబరచినారు.

అశోక స్తంభాలను మూడు భాగాలుగా విభజించవచ్చు. అవి ఆధారం కోసం భూమి లోపల ఉన్న పునాది, కాండం, కిరీటం, ఆధారం కోసం భూమి లోపల ఉన్న స్తంభ భాగంపై అందమైన నెమళ్ళు బొమ్మలు మలచబడ్డాయి. ఇది బహుశ మౌర్య చంద్రగుప్తుని తండ్రి మయూర పోషకుడని తెలపడానికి చెక్కి వుండవచ్చని కొందరి పండితుల అభిప్రాయం. మధ్య భాగం లేదా కాండం గుండ్రంగా ఉంటుంది. ఈ భాగం నునుపుతేలి లోహం వలె కన్పిస్తుంది. కిరీటంలో మూడు భాగాలు కలవు. అవి అధోముఖ పద్మం, ఫలకం, జంతు శిల్పాలు. ఇవి ఒకే రాతిపై చెక్కబడ్డాయి. కాండం పైన గల కిరీటంలో మొదటి భాగం అధోముఖ పద్మం (బోర్లించిన పద్మం) పాశ్చాత్య పండితులు దీనిని పర్షియన్ గంట అని పేర్కొన్నారు. ఈ పద్మం సౌందర్యానికి, మృదుత్వానికి చెప్పుకోదగినది. అధోముఖ పద్మంపై గల ఫలకం గుండ్రంగా లేదా చతురస్రంగా లేదా దీర్ఘ చతురస్రంగా ఉంటుంది. ఫలకం చుట్టూ అందమైన పువ్వులు, పక్షులు, జంతువుల బొమ్మలు చెక్కబడి ఉన్నాయి. ఈ ఫలకం మీద గల జంతువుల నడుమ ధర్మచక్రం మలచబడింది. ఫలకం మీద జంతుశిల్పాలు కూర్చున్నట్లు లేదా నిలబడినట్లు మలచబడింది.

అశోకుని స్తంభాలలో ప్రముఖమైంది సారనాథ్ స్తంభం. ఈ స్తంభ కిరీటకంలో నాలుగు సింహాలు గలవు. ఫలకం మీద సింహం, ఏనుగు, వృషభం, అశ్వాల శిల్పాలు మలచబడి ఉంది. ఈ నాలుగు జంతువులను నాలుగు దిక్కులకు రక్షకులుగా బౌద్ధ గ్రంథాలు వర్ణిస్తున్నాయి. ఏనుగు దక్షిణ దిక్కుకు, వృషభం పశ్చిమ దిక్కుకు, సింహం తూర్పుకి, అశ్వం ఉత్తరానికి రక్షకులు అని ఈ గ్రంథాలంటున్నాయి. వీటి మధ్య ధర్మచక్రం ఉండటం వలను నాలుగు దిక్కులా ధర్మాన్ని ఈ జంతువులు కాపాడుతాయి అనవచ్చు. మలిచిన తీరులో, సాంకేతిక విజ్ఞానంలో ఇవి మచ్చుతునకలు. సారనాథ్ సింహ కిరీటంలోని ఉదాత్తత, గాంభీర్యత పెక్కు పండితుల ప్రశంసలను పొందినది. ఈ సందర్భంగా ఈ సింహ కిరీటాన్ని గూర్చి స్మిత్ పండితుడు పలికిన పలుకులు సువర్ణాక్షరాలు. స్మిత్ మాటల్లో– "ప్రాచీనయుగం నాటి జంతు శిల్పాలతో దీనికి మించిన శిల్పం మరే దేశంలోను చూడలేము. ప్రతి అణువులోను సహజ సౌందర్యాన్ని, అనంతమైన గాంభీర్యాన్ని విజయవంతంగా జోడించి, దీనిని సమగ్రమైన, సంపూర్ణమైన మనోహర కళాఖండంగా శిల్పి తీర్చిదిద్దాడు" ఈ సింహం కిరీటాన్ని భారత ప్రభుత్వం చిహ్నంగా స్వీకరించినది.

బఖీరా స్తంభ ఫలకం దీర్ఘ చతురస్రాకారంగా ఉంది. శిఖరం పైభాగంలో సింహం ఉంది. రాంపూర్వ స్తంభం సుమారు 45 అడుగుల పొడవు వుంది. ఈ స్తంభ ఫలకం గుండ్రంగా ఉంది. దీనిపై అలంకరణ ఉంది. లౌరియా నందనఘర్ స్తంభ కిరీటంలో సింహముంది. రుమ్మిండై కిరీటంలో అశ్వముంది.

సృజనాత్మకమైన మౌర్యుల ఉత్తమ శిల్పాలలో ధౌళి గజరాజ మొకటి. ఒరిస్సా రాష్ట్రంలో భువనేశ్వర్‌కు సమీపంలో ఉన్న ధౌళిలో అశోకుని శిలా శాసనాల వద్ద బృహత్ శిలపై ఈ

ఏనుగు మలచబడింది. గండశిల నుండి బహిర్గత మౌతున్నట్లున్న ఈ గజరాజం చాలా గంభీరంగా ఉంది. నిహార్ రంజన్ రే పండితుడు చెప్పినట్లు "నిర్మాణతలో, గంభీర ఆకృతిలో, అంగ సౌష్టవంలో, ముఖంలోని మృదువైన భావాలలో దీనిని మించిన శిల్పం లేదు" సమీపంలోని శాసనాలపై దృష్టి మరల్చడం కోసం ఈ శిల్పాన్ని ఇక్కడ చెక్కి ఉంటారని ఆచార్య రోమిల్లా థాపర్ అభిప్రాయం వ్యక్తం చేశారు. ధౌళి గజరాజం అశోకుని సామ్రాజ్యవాద తత్వానికి, హుందాతనానికి ప్రతీక అని కొందరి అభిప్రాయం. బుద్ధుడు మాయాదేవి గర్భంలో గజరాజ రూపంలో ప్రవేశించాడు కనుక ఇక్కడ ఏనుగు బుద్ధుని సంకేత పూర్వకంగా తెలుపునని మరి కొందరి అభిప్రాయం. సారనాథ్ సింహం వలె విదేశీ కళా ప్రభావానికి లోనుగాక పూర్తిగా స్వదేశీకళ సాంప్రదాయాలను ప్రతిఫలిస్తున్న శిల్పం ధౌళి గజరాజ శిల్పం.

అశోకుని కాలం భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినది. ఇతని కాలంలో ఇవ్వబడిన శిలాశాసనాలు ఆధారంగా భారతీయులు అప్పటికే భాషాకోవిదులని తెలియచెప్పటమే కాక భారత చరిత్రకు కాలనిర్ణయం చేయడానికి ఉపయోగపడుతున్నాయి. తాను నమ్మిన ధర్మాన్ని, తాను చేసిన పనులను శాసనాలలో భద్రపరిచిన తొలి భారతీయ చక్రవర్తి అశోకుడు. ప్రాచీన భారతీయ వాస్తు శిల్పకళా వైభవానికి నాంది పలికినవాడు అశోకుడు. అశోకుని ధమ్మపథం జాతిని సంఘటిత పరచినది. అశోకుడు అవలంబించిన పద్ధతుల వల్ల విదేశాలలో కూడా బౌద్ధమతం విరివిగా వ్యాప్తి చెందింది. భారతదేశం శాంతి కాముక దేశంగా విలసిల్లడానికి అశోకుని శాంతి ప్రవచనాలు ప్రామాణికంగా మారాయి. అశోకుని శీలసంపద, ఉత్తమమైన ఆదర్శాలు, వాటి సాధనకై అతడు అనుసరించిన మంచి మార్గాలు అతని ప్రపంచ విఖ్యాతికి కారణాలై అతనికి ప్రపంచ చరిత్రలో ప్రముఖమైన స్థానాన్ని లంభింపజేశాయి. ❋

*రచయిత సెల్ : 93962 33103*

## బౌద్ధ సంఘాలకు మనవి

అశోకునిపై తొలిగా తెలుగులో వచ్చిన ఈ ప్రత్యేక సంచిక బౌద్ధాసక్తి పరులకు విలువైన సమాచారాన్ని అందించగలదని భావిస్తున్నాం. ఈ సంచికను ఎంత విస్తృతంగా ప్రజల వద్దకు తీసుకెళ్ళగలిగితే ఇది అంతగా ధమ్మవ్యాప్తికి ఉపకరిస్తుందని వేరుగా చెప్పనవసరం లేదు. అలాగే బౌద్ధులు, బౌద్ధ సంఘాలు, బౌద్ధాభిమానులు స్థానికంగా తమ ప్రాంతాలలోని 'బుద్ధభూమి' (ఈ సంచిక చదివిన) పాఠకులతో మీకు వీలుపడిన తేదీలలో సమాలోచన సమావేశాలు జరపటం వలన అశోకునిపై అవగాహనను పెంపొందించుకోవడానికి వీలు కలుగుతుంది. ఆ విధంగా జరిపిన సమావేశ వివరాలను బుద్ధభూమి కార్యాలయానికి పంపించవలసిందిగా మనవి. –సంపాదకుడు



## మంగళగిరిలో అశోకుని ప్రత్యేక సంచికపై సమావేశం

అశోకునిపై వచ్చిన తొలి ప్రత్యేక సంచికపై మంగళగిరిలోని ఆనంద బుద్ధమందిరంలో 16-12-2012 ఆదివారం ఉదయం 9 గంటలకు 'బుద్ధభూమి' పాఠకుల సమావేశం జరుగును. ఈ సమావేశంలో బుద్ధభూమిలో అశోకునిపై వచ్చిన పలు అంశాలపై ఇష్టాగోష్ఠి వుంటుంది. ఆసక్తిపరులందరూ పాల్గొనవలసిందిగా మనవి.

**–గోలి సీతారామయ్య,** వర్కింగ్ ఎడిటర్, బుద్ధభూమి, సెల్ : 99491 45650

గేయం :

# జయహో! జయ ప్రియదర్శి!

-గోలి సీతారామయ్య
సెల్ : 99491 45650



**జయహో జయ ప్రియదర్శి !**
**జయహో అశోక చక్రవర్తి !**
శోకంలేని లోకం కోసం
పరితపించిన ధర్మమూర్తివి
జనశ్రేయస్సే పరమావధిగా
పాలించిన తొలి చక్రవర్తివి !
చిత్తశుద్ధితో మతసహనానికి
నాందీపలికిన క్రాంతిమూర్తివి

రణభేరిని మరుభూమికి పంపి
ధర్మభేరి మరి మ్రోగించావు !
నిర్భయమ్ముతో పౌరులందరూ
నిదురించేలా కరుణించావు

జయహో ! అశోక చక్రవర్తీ!
నీ ఘన చరితను కీర్తించనీ !

కళింగ మారణ హోమంలోన
నేల కొరిగిన జనరాశిని చూసి
ప్రవహించిన రక్తధారలు గాంచి
ప్రభవించిన దుఃఖాగ్నిలోన
క్షాళనమైన శాంతి దూతవు

ఉపగుప్తుని ఉపదేశం పొంది
ధమ్మాశోకునిగా మారినావు !

రణరక్కసి మృత్యుఘోషను
నిలువరించిన స్థిత ప్రజ్ఞుడవు
వేదన నిండిన ప్రజగుండెల్లో
శాంతిసుధలు కురిపించావు !

శత్రురాజులదాడుల నుండి
క్రూరమృగాల కోరల నుండి
రక్షణయే రాజు పనియనే
పరిమిత పరిధులు చెరిపావు !

పరిపాలించే మహారాజులకు
కరుణ భావన కావాలన్నావు
"ప్రజలంతా నా కన్నబిడ్డలనే
అమృత వాక్కును పలికావు" !

జయహో! అశోక చక్రవర్తీ
నీ సమరస చరితను చాటనీ !

రైతుబిడ్డలకు సైదోడుగా
సైనిక శ్రేణిని నడిపించావు !
కుత్తుక తెంచేటి కత్తులను
నాగేటి కర్రులుగా మలిచావు !

కొండకోనల్లో జలనిధులు
గలగలమని ప్రవహించెనులె
బీడుభూమి పులకింతలతో
పచ్చదనాన్ని ప్రసవించెనులె

హర్షంతోటి కర్షక జీవులు
కళకళలాడే పాడిపంటలు
తొలిగిపోయె కాటకమ్ములు
ఆనందంలో గ్రామసీమలు

రహదారుల నిర్మితి కొరకు
ధనాగారం తలుపులు తీశావు
బాటసారుల సేద తీర్చుటకు
చెట్లను ఎన్నో నాటించావు !

జనావళి దాహార్తి తీర్చుటకు
బావులు, చెర్వులు తవ్వించావు
వృధా కానీయక వర్షధారలు
జలాశయాలను కట్టించావు

విద్యా, వైద్యం, వ్యవసాయం
సకలరంగాల సమృద్ధి కోసం
పథకాలెన్నో రచించినావు
సమస్త సైనిక బలగాలను
ప్రజాసేవకై తరలించినావు

జయహో ! అశోక చక్రవర్తీ !
నీ అనంత కరుణ వర్ణించనీ !

త్రిపిటకముల ధర్మామృతాన్ని
దేశాదేశాలకు అందించాలని
బౌద్ధ భిక్షులుగా బిడ్డలిద్దరినీ
పంపినావు మరి సింహళానికి
బౌద్ధ సంఘాలకి సంపదనెంతో
సమర్పించిన మహాదాతవు !

జయహో ! అశోక చక్రవర్తీ !
నీ త్యాగ నిరతికి హారతులెత్తనీ !

ధర్మరక్షణకు నాల్గుదిక్కులు
పహరా కాసే సింహరాజులు
నీవు తీర్చిదిద్దిన శిల్పాకృతులు
నేడధికార చిహ్నమై వున్నాయి !
జాతీయ జెండాలో ధర్మచక్రం
నీవందించిన అపురూప వరం!

జయహో అశోక చక్రవర్తీ!
నీ యశోగీతిక నను పాడనీ !

యజ్ఞయాగాల క్రతువుల్లో
జంతువధలు నిషేధించావు
కులమత వర్ణభేదమ్ములనే
కంచుగోడలు కూల దోశావు
మాన్యుడైనా- సామాన్యుడైనా
ఒక్కటేనని ప్రకటించినావు

జయహో అశోక చక్రవర్తీ
నీ ధీర చరిత వినుతించనీ !

బౌద్ధం- సత్యం- సహజమని
బౌద్ధం మానవ జీవనమని
పంచశీల పాటించే మనిషి
వంచనలేని వర్తనుడౌనని

నీ ధర్మ భాష, నీ ధర్మ ఘోష
నీ శిలాక్షర శాసనమ్ములు
తరతరాల భారతజాతికి
ఎత్తిపట్టిన క్రాంతి జ్యోతులు

వేల వసంతాలు గడిచినా...
కాలం యుగాలుగా మారినా...

జయహో అశోక చక్రవర్తీ !
మరువబోము నిను ఎన్నటికీ !
మాకాదర్శం నీవు ఎప్పటికీ !

నీ పాలన ఒక ఔన్నత్యం
నీ పాలన నిత్య నూతనం !
నీ పాలన ఒక మహోన్నతం
నీ పాలన బంగారు యుగం
చారిత్రక భరతా వనిలో
నీ స్థానం హిమవన్నగం !

నీ వెగరేసిన ధమ్మకేతనం
వన్నెతరగని కాంతిపుంజం !
ఎల్లవేళలా మానవాళికది
కల్లలెరుగని సద్ధర్మం !

జయహో జయ ప్రియదర్శీ !
జయహో అశోక చక్రవర్తీ !

నీ పాద ముద్రలతో పునీతమై
పుడమి తల్లి పులకించెనులె
బౌద్ధ తాత్విక గగనములోన
నీ కీర్తి చంద్రికలు చిరస్థాయిలే!

జయహో అశోక చక్రవర్తి !
నీకిదె వందన మందారం
అందుకో కవితా సుమహారం !

---

(అక్టోబరు 20,21 తేదీలలో కుంచనపల్లి అరవింద హైస్కూల్‌లో జరిగిన రాష్ట్ర బౌద్ధ సాహితీ సదస్సులో చదివిన గేయం)

# అశోకుని చివరి రోజులు

-ఎస్. వీరనారాయణరెడ్డి

**అ**శోకుని చివరి దశలో ఎన్నో విషాద సంఘటనలు ఆయన్ని తరుముకొచ్చాయి. తన పట్టమహిషి మరణం, రెండో భార్య తిష్యరక్షిత దురాగతాలు, సోదరుడు విగత అశోకుని దుర్మరణం, బౌద్ధ సంఘాలకు తన కోరిక మేరకు బంగారు నాణాలు దానం చేయలేక పోవడం లాంటివి కొన్ని.

**పట్టమహిషి మరణం :** అశోకుని పట్టమహిషి అసంధిమిత్ర తమ వివాహానంతరం ఇరవై తొమ్మిదో ఏట అకస్మాత్తుగా మరణించింది. భార్య మరణంతో అశోకుడు తీవ్ర వేదనకు గురైనాడు. ఆమె మరణించిన మూడేళ్ళ వరకూ ఆయన ఈ విషాదం నుండి తేరుకోలేదు. ఆ పట్టమహిషి స్థానాన్ని కూడా మరెవ్వరికీ ఇవ్వలేదు. మూడేళ్ళ తర్వాత ఆ స్థానం తన మరో భార్య తిష్యరక్షితకు ఇవ్వక తప్పింది కాదు.

**తిష్యరక్షిత దురాగతాలు :** రాణి పద్మావతి కుమారుడైన ధర్మవివర్ధనుడు (కుణాళుడు) అశోకుడు తక్షశిలకు పాలనాధికారిగా పంపుతాడు. తిష్యరక్షిత కుణాళునిపై మోజు పడుతుంది. తన కోరిక కుణాళునికి చెబుతుంది. కుణాళుడు ఆమెను తల్లిగా సంబోధించి ఆమె కోర్కెను తిరస్కరిస్తాడు. ఇది జరిగిన కొన్నాళ్ళకు తక్షశిలలో తలెత్తిన అల్లర్లను అణచడానికి అశోకుడు కుణాళుణ్ణి తక్షశిలకు పంపుతాడు. ఆ తర్వాత కొంతకాలానికి అశోకుడు తీవ్రవ్యాధికి గురౌతాడు. తిష్యరక్షిత అశోకునికి సపర్యలు చేసి రోగం నయం చేయిస్తుంది. దీనికి ప్రతిగా ఒక వారం రోజులు తనకు పాలనాధికారం కావాలని కోరుకుంటుంది. దానికి వృద్ధరాజు అంగీకరిస్తాడు. ఈ అధికారాన్ని అడ్డం పెట్టుకుని, రాజముద్రికను సంపాదించి కుణాళుడి కళ్ళు పెరికించాలని రాజ్యభ్రష్టుణ్ణి చేయాలని అశోకుని పేర ఒక రాజాజ్ఞ తయారు చేసి తక్షశిల పంపుతుంది. కుణాళుడు కళ్ళు పోగొట్టుకొని రాజ్యభ్రష్టుడౌతాడు.

ఇలాంటి అనైతిక కర్కశ హృదయురాలైన తిష్యరక్షిత పట్టమహిషి అవుతుంది.

తిష్యరక్షిత బౌద్ధాభిమాని కాదు. మహారాణి అయిన వెంటనే ఆమె చూపు అశోకుడు అమితంగా ప్రేమించే బోధివృక్షం మీద పడింది. ఓ చండాల స్త్రీ సహాయంతో, మండూ చెట్టు ముల్లుతో బోధివృక్షానికి విషం పెట్టిస్తుంది. దానితో ఆ వృక్షం క్రమేపీ క్షీణించడం ప్రారంభించింది. ఇది చూసి అశోకుడు వేదన చెందాడు. ఆయన కృంగిపోయాడు. అశోకుడు ఇలా క్షీణించిపోవడం చూసి తిష్యరక్షిత భయపడింది. ఆ వెంటనే బోధివృక్షాన్ని బ్రతికించాలనే ఉద్దేశ్యంతో వేయి కుండల పాలను చెట్టు మొదట్లో పోయించి, ఆ బోధివృక్షాన్ని నెమ్మదిగా బ్రతికించింది. దీన్ని చూసి అశోకుడు తేరుకున్నాడు. తిష్యరక్షిత పనికి ఉబ్బితబ్బిబ్బయ్యాడు. ఈ ఆనందంలో 'పంచవార్షిక' సభను జరిపాడు. బోధివృక్షానికి పెద్ద ఎత్తున ఉత్సవం చేశాడు.

**విగత అశోకుని మరణం :** తన తమ్ముడైన విగత అశోకుని మరణం అశోకుని మరింతగా క్రుంగదీసింది. ఆ రోజుల్లో ఆజీవక సంప్రదాయం వుండేది. వారు బౌద్ధ వ్యతిరేకులు. ఒకసారి పుండరవర్ధన ప్రాంతానికి చెందిన 'ఆజీవకులు' బుద్ధుని ప్రతిమలకు అపచారం చేశారు. ఈ విషయం తెలిసి ఈ అపచారం చేసినవారి 'తలలు నరకండి' అని అశోకుడు ఆజ్ఞలు జారీ చేశాడు. ఇంకా అలా 'తెంపిన' ప్రతి తలకూ ఒక్కొక్క బంగారునాణెం ఇస్తానని కూడా ప్రకటించాడు. ఇలాంటి సమయంలో ఓ రోజున...విగత అశోకుడు మార్గమధ్యంలో వుండగా అనుకోకుండా రోగపీడితుడయ్యాడు. మార్గమధ్యంలో ఓ ఇంట్లో విశ్రాంతి తీసుకుంటాడు. ఆ



బోధి వృక్షానికి వందనమాచరిస్తున్న సమ్రాట్ అశోకుడు

ఇంటి యజమాని ఒక ఆవుల కాపరి. పొడవైన జుట్టు గడ్డాలూ వున్న విగత అశోకుని ఆకారం చూసి ఇతను 'ఆజీవకుడే' అనుకొని తన భార్య ప్రోత్సాహంతో నిద్రిస్తున్న విగత అశోకుణ్ణి ఆ యింటి యజమాని చంపి, తల కొట్టి మరునాడు అశోకుని వద్దకు తీసుకొని వెళ్ళాడు. బహుమతిగా బంగారు నాణెం అడుగుతాడు.

ఆ తెచ్చిన తల తన తమ్మునిదే అని తెలుసుకొని అశోకుడు తల్లడిల్లిపోయాడు. నిర్వేదం చెందాడు. ఇకపై తన రాజ్యంలో 'శిరచ్ఛేద' శిక్ష ఉండదని, దాన్ని రద్దు చేశాడు.

**అశోకుడు-ఆమ్లకస్థూపం :** అశోకుడు తన చివరి రోజుల్లో తీవ్ర అనారోగ్యానికి గురయ్యాడు. ఆయనకు ఒక నెరవేరని కోరిక వుంది. బౌద్ధ సంఘానికి దానం ఇచ్చే విషయంలో అనాథ పిండికుని దాటిపోలేకపోయినా, కనీసం ఆయన దరిదాపులకైనా రావాలని అనుకునేవాడు. దీనికై కనీసం ఓ వందకోట్ల బంగారు నాణాలు సంఘానికి దానం చేయాలనుకున్నాడు. అనారోగ్యం పాలయ్యేనాటికి 96 కోట్ల నాణాలు ఇచ్చాడు. మిగిలిన 4 కోట్ల బంగారు నాణాలు ఇచ్చే విషయంలో అశోకునికి మనుమని నుండి ప్రతిఘటన ఎదురైంది. మంత్రుల సలహా మేరకు కుణాలుని కొడుకు 'సాంప్రది' కోశాగారం నుండి బంగారు నాణాలు బైటకు పోకుండా కట్టడి చేశాడు. అప్పటికి అశోకుని సర్వాధికారం నామమాత్రంగానే మిగిలిపోయింది. చేసేది లేక తన దానగుణం విడవలేక, తనకు భోజనం పెట్టే బంగారు పళ్ళాలను నెమ్మదిగా ఒక్కొక్కటి సంఘానికి దానంగా పంపేవాడు. ఈ విషయం తెలిసి, ఆయనకి వెండి కంచాల్లో భోజనం పంపేవారు. ఆయన అవీ బౌద్ధసంఘానికి దానంగా పంపాడు. చివరికి రాగి కంచాలు కూడా దానంగా పంపాడు. అశోకుని దానం విషయంలో మనుమనికి కోపం వచ్చింది. అతనికి పంపే ఆహారాన్ని కూడా కట్టడి చేశాడు. ఒక పింగాణీ పళ్ళెంలో ఒక 'అర ఉసిరికాయ' మాత్రమే ఆహారంగా పంపేవాడు.

అది చూసి అశోకుడు నిర్వేదం చెందాడు. తన పరివారాన్ని, మంత్రుల్ని పిలిపించి ఆ అర ఉసిరికాయ ముక్కని అతని అరచేతిలో పెట్టుకొని...

"ఈ మహా రాజ్యానికి మహారాజు ఎవరు?" అని ప్రశ్నించాడు.


దురాలోచనలో నిమగ్నమైన
రాణి తిష్యరక్షిత

వారంతా వినమ్రంగా తలలు ఊపి "మీరే మహారాజా!" అన్నారు.

ఆ మాటలకు అశోకుడు నిర్వేదంగా నవ్వాడు.

అతని కళ్ళు కన్నీటితో నిండిపోయాయి. తన అరచేతిని చూపి...

"నా తృప్తికోసం మీరలా అంటున్నారు. నా పరిస్థితి ఇది.." అని తన ఎదురుగా వున్న ఒక సేవకుణ్ణి దగ్గరకు పిలిచి-

"ఈ ఉసిరికాయ ముక్కని తీసుకొని వెళ్లి, సంఘానికి దానంగా ఇవ్వు. ఈ దానం కుక్కుటారామంలోని భిక్షులందరికీ చెందాలని చెప్పు" అని ఆ ఉసిరికాయ ముక్కను సైతం ఇచ్చి పంపాడు.

ఆ ఉసిరికాయ ముక్కను గ్రహించిన కుక్కుటారామంలోని ప్రధాన భిక్షువు తోటి భిక్షువులతో...

"ఒక మహాదాత...ఓ మహాచక్రవర్తి, అయిన అశోకుని ఆధిపత్యం..సువిశాల జంబూద్వీపం నుండి ఈ ఉసిరికాయ ముక్కకు పరిమితమైపోయింది" అని చెప్పి...ఆ ఉసిరికాయ ముక్కను మెత్తగా నూరి ఆహారంలో కలిపి భిక్షుసంఘం మొత్తానికి పంచాడు.

ఈ సంఘటనకు గుర్తుగా కుక్కుటారామంలోని అమ్లక స్థూపం (ఉసిరికాయ స్థూపం) నిలుస్తుందని కుమారలత తన 'కల్పన మాండితిక'లోనూ, యువాన్‌చువాంగ్ (చైనా యాత్రికుడు) తన రచనలో వివరించారు.

**భూమండల దానం :** అశోకుని అంతిమరోజుల్లో మరో సంఘటన జరిగింది. అశోకునికి ఆంతరంగికునిగా విశ్వాసపాత్రునిగా గుర్తింపు పొందిన ...రాధగుప్తుడు. రాధగుప్తుడు ఒకరోజు అశోకుని దగ్గరకు వచ్చి..."మహారాజా! ఈ భూమండలానికి మీరే చక్రవర్తులు" అని చెప్పాడు. ఈ మాటలు విని అశోకుడు నిలువెల్లా కంపించాడు. చుట్టూ చూశాడు. కుక్కుటారామం వైపు తిరిగి అంజలి ఘటించి ఇలా అంతిమ ప్రకటన చేశాడు" ప్రభుత్వ ఖజానా తప్ప, ఈ సమస్త భూమండలం మొత్తాన్ని బౌద్ధ సంఘానికి దానంగా ఇస్తున్నాను. ఈ దానం నేను ఏ బ్రహ్మలోక పదవికో, ఇంద్రలోక పదవికో ఆశించి కాదు. కనీసం ఓ రాజుగా తిరిగి పుట్టాలనే కోర్కెతో కూడా కాదు. ఎందుకంటే- ఈ చక్రవర్తి పదవి నిరంతరం అలలతో అస్థిరంగా వుండే సముద్రం లాంటిది. కానీ...నేను చేసిన ఈ దానం నాకు ఒక ఫలాన్ని ఇస్తుంది. అది ఎవ్వరూ అపహరించలేనిది, అరహంతులు నిరంతరం గౌరవించేది, ఎలాంటి ఘర్షణలకూ లోనుకానిదీ, జితేంద్రియమైనదీ అయిన మనస్సు మీద సార్వభౌమాధికారాన్ని పొందుతాను. ఇదే నేను చేసిన ఈ దానఫలం" అని ధ్యానముద్రలో కూర్చొండిపోయాడు.

దీన్ని ఒక రాజాజ్ఞగా రాయించి, దాని మీద తన (పంటి ముద్రతో) రాజముద్ర వేశాడు.

అశోకుడు చివరికి తన 71వ ఏట తుదిశ్వాస విడిచాడు.

అశోకుడి పార్థివ శరీరానికి నీలిరంగు, పసుపురంగు వస్త్రాలు చుట్టి ఖననం చేశారు.

అశోకుని మరణానంతరం రథగుప్తుని సలహా మేరకు సంప్రతి మిగిలిన 4 కోట్ల బంగారు నాణాలను బౌద్ధ సంఘానికి అశోకుని పేర దానంగా సమర్పించి, ఆయన వాగ్దానాన్ని నెరవేర్చాడు.

అశోకుడి అవశేషాల మీద ఏలాంటి స్థూపాన్ని నిర్మించిన ఆధారాలేవీ కన్పించలేదు.

పైన చెప్పిన సంఘటనలన్నీ అవదానాలను బట్టి తెలుస్తున్నాయి.

అశోకుని గురించి శ్రీలంకకు చెందిన 'మహావంశ' అనే బౌద్ధ గ్రంథంలో ఇలా వుంది.

"బుద్ధుని క్షణికవాద సిద్ధాంతాన్ని అశోకుడు సంపూర్తిగా ఆకళింపు చేసుకున్నాడు"

ఒక మహాచక్రవర్తిగా బంగారు నాణాల్ని సంఘానికి దానం చేసిన దానం కంటే...బంగారు, వెండి, రాగి, పింగాణీ పాత్రల్ని సైతం సంఘదానం చేసిన కీర్తికంటే... చివరికి తన ప్రాణాల్ని నిలిపే ఆహారాన్ని సైతం దానంగా పంపిన వైనం అపూర్వం..అజరామరం.



తిష్యరక్షిత దుష్టచేష్టలకు ముక్కలైన బౌద్ధ కళాఖండం

బౌద్ధాన్ని ఇంతగా ఆకళింపు చేసుకున్న వ్యక్తి కాబట్టే చరిత్ర గగనంలో ధృవతారగా మిగిలాడు.

ఒకటి కాదు రెండు కాదు. అన్ని రంగాల్లో ఉన్నతమైన పరిపాలన అందించిన తొలి భారతీయ సార్వభౌమునిగా అశోకచక్రవర్తి చరిత్ర పుటల్లో నిలిచాడు. బుద్ధుడు స్థాపించిన ధమ్మ చక్రాన్ని తన రాజ్యం దాటి సుదూర ప్రాంతాలకు పరివర్తింప చేశాడు. వివిధ ప్రాంతాల్లో వున్న సామాజిక అస్థిరతలు, సంస్కృతులు, ఆలోచనల్లో మార్పుకు శ్రీకారం చుట్టాడు.

ఒక ప్రాంతీయ విశ్వాసంగా వున్న బౌద్ధాన్ని విశ్వవ్యాపితం చేశాడు. బుద్ధుని బోధలు శ్రీలంక, బర్మా, ఆఫ్ఘనిస్తాన్, మధ్య ఆసియా, మధ్యధరా సముద్ర తీరాల వరకూ మార్మోగేలా చేశాడు. యుద్ధాలు, హింస, రాజ్య విస్తరణలను ఒక 'విధాన' నిర్ణయంగా నియంత్రించిన ఒక ఒక్క చక్రవర్తి అశోకుడు. 'ప్రజలు తన బిడ్డలు' అని ప్రకటించించిన తొలిరాజు కూడా అశోకుడే.

పనికిమాలిన సాంఘిక ఆచారాలూ, జంతుబలులతో కూడిన క్రతువులూ ఇలాంటి అనేక సాంఘిక దురాచారాల నుండి ప్రజలను నైతిక, ఆధ్యాత్మిక మార్గాలకు మరల్చాడు. కౌటిల్యుడి రాచరిక సిద్ధాంతానికి భిన్నంగా కొత్త పరిపాలనా పద్ధతిని ప్రవేశపెట్టాడు. 'రాజు ధర్మంగా పాలించాలి' అనేదే ఈ కొత్త విధానం. ఆనాడే కాదు...ఈనాటి ఆధునిక పాలకులు కూడా అశోకుని విధానాల నుండి నేర్చుకోవాల్సింది ఇంకా ఎంతో వుంది. ఆనాడే అశోకుడు ఎన్నో సంక్షేమ కార్యక్రమాల్ని అమలు చేశాడు. రాజుల మనసుల్లో తండ్రి హృదయాన్ని నెలకొల్పిన అశోకుడు నాటికీ నేటికీ పాలకులందరికీ మార్గదర్శకుడు.

అశోకుని మహోన్నతికి మరో విషయం ఏమంటే...అతని శాసనాలు. లిపిబద్ధంగా మనకు దొరికిన తొలి శాసనాలు ఇవే. అశోకుడు 'బ్రాహ్మీ' లిపి రూపంలో చరిత్ర నమోదుకు ఒక ఆధారం అందించాడు. లిపికి రూపశిల్పి అయ్యాడు. లిపికే కాదు...శిల్పకళకు కూడా ఆద్యుడు అశోకుడే. ఆయన కాలానికి చెందిన చారిత్రక అవశేషాలు ఈ దేశం నాలుగు మూలలా బైటపడ్డాయి. పరిపాలనలో, నైతికతలోను, కళాత్మకతలోనూ ఈ చక్రవర్తిని మించిన పాలకుడు మరెవ్వరూ లేరనే విషయాన్ని ఈ అవశేషాలు తెలుపుతున్నాయి.

ఈ నేల నలుచెరగులా ధర్మాన్ని విస్తరింపజేసిన అశోకుడు నిజంగా 'చతుర్భాగ చక్రవర్తి'. ధమ్మచక్రాన్ని నడిపించిన ఈయన నిజమైన 'ధమ్మిక'. ప్రజల్ని కన్నబిడ్డల్లా పాలించిన ఈయన అచ్చమైన ధర్మరాజు.

అనువాదం : **యల్లాప్రగడ సీతాపతి**

రచయిత సెల్ : *99485 91944*

# చైనాలో అశోకారామం

-యార్లగడ్డ కిరణ్మయి (అమ్ములు)

**అ**శోకారామం చైనాలోని జీజియాంగ్ అనే రాష్ట్రంలో ఉన్న జింగ్‌బో అనే పట్టణంలో ఉంది. ఆ పట్టణంలో ఉన్న ఐదు పర్వతాలలోని ఒకటైన 'అశోక పర్వతం' మీద ఈ అశోకారామం నిర్మించబడింది. ఇది చాలా ప్రాచుర్యం పొందింది. ఎందుకంటే ఈ ఆరామం శాక్యముని బుద్ధుని అవశేషాల మీద నిర్మించబడింది. అశోకుడు చైనాలో నిర్మించిన ఆరామాలలో ఇప్పటికీ ఉన్న అతి పురాతన ఆరామాలలో ఇదీ ఒకటి. ఈ ఆరామాన్ని 1983వ సంవత్సరంలో 'హేన్' రాష్ట్రం ముఖ్య జాతీయ ఆరామంగా గుర్తించబడింది. ఇది 'జెన్' బౌద్ధ సంప్రదాయానికి చెందిన ఆరామం.

ప్రాచీన బౌద్ధగ్రంథాల ప్రకారం అశోకుడు క్రీ.పూ 3వ శతాబ్దంలో భారతదేశాన్ని పరిపాలించాడు. ఆ సమయంలో అశోకుడు బౌద్ధునిగా మారి, బౌద్ధధర్మాన్ని ప్రపంచం అంతటా వ్యాపింపజేశాడు. అశోకుడు బుద్ధుని అవశేషాలపై ఎన్నో ఆరామాలను నిర్మించాడు. ప్రపంచవ్యాప్తంగా వాటిని పవిత్ర స్థలాలుగా చేశాడు. మొత్తం 84,000 ఆరామాలను నిర్మించాడు. బౌద్ధ వాఙ్మయముల ప్రకారం ఒక్క చైనా దేశంలోనే 19 బౌద్ధారామాలు ఉన్నట్లు చెప్పబడింది. అశోకుని ఆదేశాల మేరకు నిర్మించిన ఆరామం కాబట్టి దీనికి "అశోకారామం" అని పేరు వచ్చింది.

అశోకారామం క్రీ.పూ 282లో పాశ్చాత్య జిన్ రాజవంశం (316-265) కాలంలో నిర్మించబడింది. అప్పటినుండి ఆ ఆరామం ఎన్నోసార్లు పునర్నిర్మించబడింది. ప్రస్తుత ఆరామం క్వింగ్ రాజవంశం (1644-1840) కాలం తర్వాత పునర్నిర్మించబడింది. 1980 వ సంవత్సరంలో దీనికి పూర్తిగా ఆధునిక రూపం తీసుకువచ్చారు. ఈ అశోకారామంలో 600 హాలులు, అనేక గదులు, మంటపాలు ఉన్నాయి. ఇది 14,000 చదరపు మీటర్ల విస్తీర్ణంలో గొప్పగా నిర్మించబడింది. ఈ ఆరామం భవనాలు, శిల్పాలు, తోటలు, చిత్రాలు కలిగి చాలా గొప్పగా నిర్మించబడింది.

అశోకారామం చైనా బౌద్ధ చరిత్రలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుంది. ఇది ఏడు అంతస్తులు గల ఆరామం దీన్ని చైనా భాషలో 'డగోబా' అంటారు. ఈ ఆరామం వెనుక ఒక పెద్ద బుద్ధుని విగ్రహం కూడా ఉంది.

ఈ అశోకారామం చుట్టూ ఎన్నో చూడదగిన చారిత్రాత్మక ప్రదేశాలు ఉన్నాయి. అక్కడ ఉన్న ఒక పెద్ద రాయి మీద కశ్యప బుద్ధుని ఎడమ పాదం మోపిన గుర్తులు ఉన్నాయి. ఆ రాతి మంటపాన్ని 'ఫోడా' మంటపం అంటారు. ఈ రాతి మంటపంలో 'స్యూనా' అనే పెద్ద రాయి ఉంది. అది ఎంత పెద్దది అంటే ఒకేసారి పదిమంది దానిమీద కూర్చోవచ్చు. ఇంకో చూడదగిన ప్రదేశం 'సప్తబుద్ధ సరోవరం' ఈ ఆరామం ఈ సరోవరం ఒడ్డున ఉంది. సప్తబుద్ధులు ఈ సరోవరంలో స్నానమాచరిస్తారని అంటారు. ఈ సరోవరం వల్ల ఈ ఆరామం ప్రాంతం ఎంతో చల్లగా ఉంటుంది. వేసవిలో హాయిగా ఉంటుంది. కాబట్టి వేసవికాలం ఈ ఆరామాన్ని చూడ్డానికి ఎంతోమంది సందర్శకులు వస్తారు. మన దేశాన్ని పాలించిన ఒక చక్రవర్తి పేరు చైనాలో ఒక పర్వతానికి, కొన్ని బౌద్ధారామాలకి ఉండటం ఎంతో విశేషం. మనకెంతో గర్వకారణం. ❋

-రచయిత్రి సెల్ : *90006 86001*

# దేవానాంపియ-పియదస్సి అశోక



అశోకుని శాసనాల్లో, అశోకుడు తనను దేవానాంపియ (దేవానాం ప్రియ) అని పిలుచుకొన్నాడు. ఈ విషయంపై గతంలో చాలా చర్చ జరిగింది. అశోకుని కంటే ముందరి రాజులు కూడా దాదాపు ఇదే అర్థం వచ్చే 'దెవానుప్పియ' అన్న బిరుదును పొంది నట్లు ఔపపాతిక సూత్రంలో ఉంది. అశోకుడు, దేవానాం పియ, పియదసి రాజా అనీ, దేవానాంపియ రాజా పియదసి అనీ, పియదసి రాజా అనీ, దేవానాం పియరాజా అనీ, కొన్నిసార్లయితే కేవలం దేవానాం పియ అని సంబోధించుకున్నాడు. అశోకుని పూర్వీకులను కూడా అశోకుడు తనలానే దేవానాం ప్రియులని 8వ శిలా శాసనంలో పేర్కొన్నాడు. అశోకుని మనుమడైన దశరథుడు కూడా బరాబర్ కొండ గుహల వద్ద చెక్కించిన శాసనంలో తనను దేవానాం ప్రియుడనే సంబోధించుకొన్నాడు. క్రీ.పూ 150 నాటి వాడనుకొంటున్న పతంజలి, దేవానాం ప్రియ శబ్దానికి భవత్, దీర్ఘాయుస్, ఆయుష్మత్ (భవాన్ దీర్ఘాయుర్ దేవానాంప్రియ ఆయుష్మాన్) అనే అర్థంలో వివరించాడు. తరువాత క్రీ.శ. 7వ శతాబ్దిలో బాణుడు హర్షచరితంలో హర్షుని దేవానాం ప్రియుడని రెండుసార్లు సంబోధించాడు.

దివ్యమైన, మంచిని మాత్రమే ప్రజల హితమే కోరుకొనే వారు, చేసేవారు దేవతలని కొనియాడబడితే, అలానే అన్ని జీవరాసులకూ మంచినే చేసిన అశోకుని దేవతలకు ప్రియుడైన వాడన్న అర్థంలో దేవానాం ప్రియుడన్న బిరుదు దక్కిందని చాలామంది ఇంతకుముందే చెప్పారు. అశోకుని ధమ్మ మార్గానే ముమ్మూర్తులా ఆచరించిన శ్రీలంక రాజైన తిస్స కూడా అశోకుని మాదిరే దేవానాం పియతిస్స బిరుదును ధరించాడు.

ఇది ఇలా ఉంటే సృష్టికర్త అయిన దేవుడికి అసలే మాత్రం ప్రాధాన్యత నీయని బౌద్ధ ధమ్మాన్ని ఆచరించిన అశోకుని పట్ల బౌద్ధేతర పండితులు ఆ బిరుదుకు వక్రభాష్యం చెప్పి చులకన చేశారు.

క్రీ.శ. 12వ శతాబ్దిపు హేమచంద్రుని అభిదాన చింతామణి, క్రీ.శ 17వ శతాబ్దపు భట్టోజీ దీక్షితుని సిద్ధాంత కౌముది గ్రంథం దేవానాం ప్రియ శబ్దం 'శుంఠ' శబ్దంతో సమానమని చెప్పి మహదానంద పడిపోయారు. మనోరమా వ్యాఖ్యానంలో 'మూర్ఖాహి దేవానాంప్రీతిం జనయంతి దేవపసుతిందితి' అని వక్రీకరించారు.

అశోకుని శాసనాల్లో అశోకుడు తనను 'పియదసి' అని కూడా సంబోధించుకొన్నాడు. శ్రీలంక గ్రంథాల్లో అశోకుని తాత చంద్రగుప్త మౌర్యునికి పియదస్సన అనే బిరుదున్నట్లు పేర్కొంటున్నాయి. పియదస్సి అంటే దయార్ద్ర హృదయంతో చల్లని చూపులు గలవాడనీ, సూక్ష్మదృష్టి గల రాజుగా, అశోకుని ప్రియదర్శిగా (మంచినే చూడటానికి ఇష్టపడి, మంచినే చూచేవాడుగా) ఈ పదాన్ని బహుశ అశోకుడు తనకు ఆపాదించుకొని ఉండవచ్చు. ❋

-బుద్ధభూమి బృందం

# అశోక శాసనాలు

(పూజ్యభిక్షు ధమ్మికుని ఆంగ్లమూలానికి ఎస్. వీరనారాయణరెడ్డిగారి సహకారంతో తెలుగు అనువాదం)

-డా॥ఈమని శివనాగిరెడ్డి

**అ**శోకుని శాసనాలను 14 శిలాశాసనాలు, 6 స్థంభ శాసనాలు, రెండు ప్రత్యేక (కళింగ) శాసనాలు, రెండు చిన్నశాసనాలు, బెరాట్ శిలాశాసనం, సంఘభేద స్థంభ శాసనం, లుంబినీ స్థంభశాసనం, నిగలీసాగర స్థంభశాసనం, రాణి శాసనం, 3 బరాబర్ కొండ గుహశాసనాలు, ఇంకా కొన్ని ఇతరత్రా శాసనాలుగా విభజించవచ్చు.

14 శిలాశాసనాలు గిర్నార్ (మహారాష్ట్ర), కాత్స (ఉత్తరాంచల్), ధౌళి (భువనేశ్వర్), జౌగడ (ఒరిస్సా), షాబాజ్‌గర్హి (పాకిస్తాన్), మాన్‌షెరా (పాకిస్తాన్), సోపారా (మహారాష్ట్ర), ఎర్రగుడి (ఆంధ్రపదేశ్)లలో ఉన్నాయి. 6 స్థంభశాసనాలు, తోప్రా (పంజాబ్), మీరట్ (ఉత్తరప్రదేశ్), అలహాబాద్ (ఉత్తరప్రదేశ్), రధియా(తారియా అరరాజ్- బీహార్), మెధియా (తారియా-నందన్‌ఘర్- బీహార్), రాంపూర్వా (బీహార్)లలో ఉన్నాయి. రెండు ప్రత్యేక శిలాశాసనాలు ధౌళి(ఒరిస్సా) (ఈ శాసనాలనే శిలాశాసనం 11,12,13 అని పిలువబడిన అశోక శాసనాలు) లోనూ ఉన్నాయి.

చిన్నశిలాశాసనాలు : 1, 2 గా పిలువబడినవి చాలా చోట్ల ఉన్నాయి. వీటిలో చిన్న శిలాశాసనం-1 ఉత్తరాది, దక్షిణాది లిపులని రెండు రకాలు. ఉత్తరాది లిపి చిన్న శిలాశాసనం 1, బీహార్‌లోని సహస్రం, మధ్యప్రదేశ్‌లోని నిరూప్‌నాథ్, రాజస్తాన్‌లోని బైరాట్, మధ్యప్రదేశ్‌లోని గుజర్రాలలో ఉండగా, దక్షిణాది లిపి చిన్న శిలాశానం-1, కర్నాటకలోని బ్రహ్మగిరి, సిద్ధాపుర, జతింగ రామేశ్వరం, మాస్కి, పాత్కీగుండులోనూ, ఆంధ్రప్రదేశ్‌లోని ఎర్రగుడి, రాజుల మందగిరిలోనూ ఉన్నాయి. ఇంకా బాబ్రూ శాసనం రాజస్థాన్‌లోని బైరాట్ దగ్గరుంది. నాలుగు చిన్న స్థంభశాసనాల్లో, ఉత్తరప్రదేశ్‌లోని సారనాథ్, ఉత్తరప్రదేశ్‌లోని కౌశాంబి, మధ్యప్రదేశ్‌లోని సాంచి, ఉత్తరప్రదేశ్‌లోని అలహాబాద్ స్థంభశాసనంపై గల రాణీ శాసనం, నేపాల్‌లోని లుంబినీ, నిగలీ సాగర్‌లలో ఉన్నాయి. బరాబర్ కొండ గుహ (బీహార్‌లోని గయకు దగ్గర) వద్ద మూడు శాసనాలున్నాయి.

శిలాశాసనాల్లో 14 శిలాశాసనాలు, చిన్న శిలా శాసనం, కళింగ శాసనాలు, బైరాట్ శాసనాలు సహజ సిద్ధంగా ఉన్నరాయి/ గుండులపై చెక్కి ఉండగా, లుంబినీ, నిగలీసాగర్, సంఘభేద శాసనం, రాణీశాసనం, స్థంభశాసనాలు, స్థంభాలపై చెక్కబడినాయి. వీటిలో చిన్నశిలా శాసనాలలో క్రీ.పూ. 257లో 14 శిలా శాసనాల కంటే ముందే చెక్కించగా, 14 శిలాశాసనాలను 13, 14 వ పాలనా సంవత్సరాలలో అశోకుడు చెక్కించాడు. కళింగ శాసనం క్రీ.పూ 256 లోనూ, బరాబర్ గుహ శాసనాలు క్రీ.పూ. 250 లోనూ, లుంబినీ, నిగలీ స్థంభ శాసనాలను క్రీ.పూ. 249లోనూ, 6వ స్థంభ శాసనాలను క్రీ.పూ 245-42 లోనూ, చిన్న స్థంభ శాసనాలను క్రీ.పూ 240 లేక ఆ తర్వాత వేయించాడు. పరిశీలించగా అశోకుడు క్రీ.పూ 257-232 సం॥ల మధ్య అన్ని శాసనాలను వేయించాడని తెలుస్తుంది.

విషయపరంగా అశోకుని శాసనాలలో బౌద్ధ ధమ్మ శాసనాలు నైతిక శాసనాలు, దానశాసనాలని కూడా వర్గీకరించవచ్చు. బౌద్ధ ధమ్మలిపులు బైరాట్, లుంబినీ, నిగలీసాగర్, కౌశాంబి, సాంచి, సారనాథ్‌లలో ఉన్నాయి. నైతిక నియమాలు, రూపనాధ్ సహస్రం, బైరాట్,

మాస్కి, బ్రహ్మగిరి, సిద్ధాపుర, జతింగ రామేశ్వరం, గిర్నార్, కాల్సీ షాబాజ్‌గర్హి మాన్ షెరాలలో నున్న 14 శిలా శాసనాలు. 1-10,14 శిలాశాసనాలు, మీరట్, తోప్రా స్థంభ శాసనాలుండగా, బరాబర్‌గుహ, రాణీ శాసనాలు దానశాసనాలు.

**మొదటి శిలా శాసనం :**

దేవతలకు ప్రియమైన, ప్రియదర్శి రాజు చేత ఈ ధమ్మలిపి రాయబడింది. ఇక్కడ (తన సామ్రాజ్యంలో) జంతువులను చంపటం గానీ, బలి ఇవ్వటం కానీ చేయరాదు. దేవతా ప్రియుడైన ప్రియదర్శిరాజు, కొన్ని పండుగలు జరుపరాదనీ, దేవతాప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు ఆమోదించిన కొన్ని పండుగలను జరుపటానికి అనుమతించాడు.

ఇంతకుముందు దేవతలకు ప్రియుడైన ప్రియ ధర్మరాజుకు చెందిన వంట యింట్లో కూర కోసం ప్రతిరోజూ వందలు, వేల జంతువులను చంపేవారు. కానీ ఈ ధర్మలిపి రాయడం వల్ల రోజుకు రెండు నెమళ్లు, ఒక లేడి-ఇలా రెండు ప్రాణులు మాత్రమే చంపబడుతున్నాయి. అయితే లేడిని కూడా రోజూ చంపడం లేదు. ఇకముందు ఈ మూడు జీవాలను కూడా చంపటానికి వీలులేదు.

**రెండో శిలా శాసనం :**

దేవతలకు ప్రియుడైన ప్రియదర్శిరాజు తన రాజ్యం అంతటా సరిహద్దు వెలుపలున్న చోళ, పాండ్య, సత్యపుత్ర, కేరళపుత్ర, తామ్రపర్ణి రాజ్యాలలోనూ, యవనరాజైన అంతియోకుని రాజ్యంలోనూ, ఇంకా అంతియోకుని ఇరుగు పొరుగు రాజ్యాలలోనూ, దేవతలకు ప్రియుడైన, ప్రియదర్శిరాజు, జంతువులకు, మనుషులకు విడివిడిగా రెండు రకాలైన చికిత్సా విధానాలను ప్రవేశపెట్టాడు. మనుషులకు, పశువులకు ఉపయోగపడే ఔషధ మొక్కలు ఎక్కడెక్కడ లేవో అక్కడ బయటి నుంచి తెప్పించి నాటాడు. ఇలాగే వేర్లు, పండ్లు ఎక్కడెక్కడ దొరకటం లేదో, ఆ మొక్కలను తెప్పించి పెంచుతున్నాడు. మనుషులకు, జంతువులకు ఉపయోగపడేందుకు దారుల వెంట చెట్లు నాటి, బావులు తవ్వించాడు.

**మూడో శిలా శాసనం : (గిర్నార్) :**

దేవతలకు ప్రియమైన రాజు ప్రియదర్శి ఇలా చెబుతున్నాడు. 'నా రాజ్యాభిషేకమైన పన్నెండో సంవత్సరంలో ఇది ఆజ్ఞాపించబడింది. నా రాజ్యంలోని అన్నిచోట్లా, యుక్తులు, రజుకులు, ప్రాదేశికులు ఐదేళ్లకోసారి, కింది ధమ్మ విషయాలను తెలియజెప్పటానికి ఇతర రాచ కార్యాల కొరకూ తమ పాలనా ప్రాంతాల్లో యాత్రలు చేయాలి.

"తల్లితండ్రులను గౌరవించడం మంచిది. స్నేహితులు, పరిచయస్తులు, బంధువులు, బ్రాహ్మణులు, తాపసుల పట్ల దయతో ఉండి దానాలు చేయటం మంచిది. జీవరాశికి ప్రాణహింస తలపెట్టకుండటం మంచిది. తక్కువ ఖర్చు చేయటమే కాక చాలా తక్కువ సంపద మాత్రమే కలిగి ఉండటం కూడా మంచిది. ఈ ధర్మాలను తప్పకుండా ఆచరించవలెనని, యుక్తులను పరిషత్తులు ఆజ్ఞాపించాలి".

**నాలుగో శిలా శాసనం : (గిర్నార్)**

పూర్వకాలంలో అనేక సం॥రాల వరకూ జీవరాశిని చంపడం వాటిని హింసించటం, బంధువులు, బ్రాహ్మణులు, శ్రమణుల పట్ల అమర్యాదకరంగా మెలగటం పెరిగింది. కాని ఇపుడు దేవానాం ప్రియ ప్రియదర్శి ధర్మాన్ని ఆచరించటం వల్ల యుద్ధభేరిల ఘోష బదులు ధమ్మ ఘోష వినిపిస్తుంది. విమానాలు, శుభప్రదమైన ఏనుగులు, అగ్ని కీలలు ఇంకా ఇతర దివ్యరూపాలు కొన్ని వందల ఏండ్ల నుంచి కనిపించటం లేదు. అయితే దేవానాం ప్రియ

ప్రియదర్శి జీవరాశిని చంపకుండా హింసించకుండా ఉండేట్లు చేయడం వల్లనూ, బంధువులు, బ్రాహ్మణులు, శ్రమణుల పట్ల మర్యాదగా ప్రవర్తించేట్లు చేయటం వల్ల తల్లి, తండ్రి పెద్దలనూ గౌరవించేట్లు చేయడం మూలాన మునుపటి దివ్యరూపాలు కనబడటం పెరిగింది.

ఇంకా ఇతరులను ఆచరించటాన్ని దేవానాంప్రియ, ప్రియదర్శి ప్రోత్సహించటం వల్ల, ఇవి ఇంకా ఇతర ధర్మాలను ఆచరించటం పెరిగింది.

దేవానాం ప్రియ, ప్రియదర్శి కొడుకులు, మనుమలు, మునిమనుమలు ధర్మాన్ని ఆ కల్పాంతం ప్రోత్సహిస్తూ, ధర్మం, శీలాలను పాటిస్తూ, ధర్మాన్ని అనుసరిస్తూ ఉంటారు. ధర్మాన్ని ఆచరించటమే అన్నిటికంటే ఉత్తమమైంది. శీలంలేని వాడు ధర్మాన్ని ఆచరించలేడు. అందుచేత ధర్మాన్ని పెంపొందించటం శ్రేయస్కరం.

నా తరువాతి తరం వారు, ఈ శాసనాన్ని చూచి సంతోషించి, ధమ్మాచరణకు పాటుపడి, ధర్మానికి హాని జరగకుండా చూడటానికి ఈ శాసనం రాయబడింది. దేవానాం ప్రియుడైన ప్రియదర్శి రాజు తాను సింహాసన మెక్కిన తరువాత పన్నెండేండ్లకు ఈ శాసనాన్ని రాయడమైంది.

**ఐదో శాసనం: (కాల్సి)**

దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు ఈ విధంగా చెప్పాడు. మంచి పనులు చేయటం కష్టం. ఎవరైనా మంచి పనులు చేస్తున్నారంటే, వారు కష్టమైన పనులు చేస్తున్నట్లే. నేను ఎన్నో మంచి పనులు చేశాను. నా కొడుకులు, మనుమలు, ముది మనుమలు, ఇంకా



మధ్యప్రదేశ్ దాటియా జిల్లాలోని గుజర్రా శాసనం దొరికిన ప్రాంతం

వారి తరువాతి తరాలవాళ్లు ఎల్లకాలం ఇదే రకంగా ఆచరిస్తే వారు కూడా మంచే చేస్తారు. కానీ వారు వీటిని నిర్లక్ష్యం చేసినట్లైతే చెడు చేసిన వారౌతారు. చెడు చేయటం నిజంగానే తేలికైన పని కదా! ఇంతకుముందు ధర్మమహా మాత్రలు లేనందువల్ల, నాకు పట్టాభిషేకం జరిగిన 13 ఏళ్లకు వాళ్లను నియమించాను. ఇప్పుడు వాళ్లు, అన్ని మతాలవారితో కలిసి పనిచేస్తూ, ధర్మాన్ని అంటిపెట్టుకొని వున్నవారి సుఖసంతోషాల కోసం పాటుపడతారు. యవన, కాంభోజ, గాంధార, రాష్ట్రిక, పితినికులు ఇంకా పశ్చిమ, సరిహద్దుల్లో నున్న ప్రజల్లో ధర్మవృద్ధికి పాటుపడుతున్నారు. వారు ఇంకా ధర్మం కోసం అంకితమైన సైనికులు, ప్రభువులు, బ్రాహ్మణులు, గహపతులు, పేదలు, వృద్ధులు ఎలాంటి వేధింపులకు గురి కానీయకుండా, వారి సుఖ సంతోషాల కోసం పాటుపడుతున్నారు. ఈ ధర్మమహా మాత్రలు, చెరసాలలో బందీలై ఉన్న నేరస్తుల బాగోగుల కోసం పాటుపడుతూ, ఈ నేరస్తునికి తాను నేరస్తుడు పోషించాల్సిన కుటుంబముందనో, ఈ

నేరస్తుడు పిచ్చివాడైనందున వేసిన సంకెళ్లను తొలగించాలనో, ఇతడు ముసలి వాడైనందుననో, వారిని చెరసాల నుంచి విడుదల చేసే పనుల్లో వున్నారు. వారు ఇక్కడా, ఇతర ప్రాంతాల్లోని పట్టణాల్లోనూ, నా అక్కా చెల్లెళ్ళు, అన్నదమ్ములు, ఇంకా నా ఇతర బంధువుల ఇళ్లల్లోనూ ధర్మాన్ని నిలబెట్టడం కోసం పాటుపడుతున్నారు. వారు అన్నిచోట్లా ఇదే పనిలో మునిగిపోయి వున్నారు. నా రాజ్యంలో ధర్మం కోసం పాటు పడుతున్నా ప్రజల్లో ఎవరు ధర్మనిరతులో, ఎవరు ధర్మాన్ని నిలబెడుతున్నారో, ఎవరు కరుణామయులో తెలుసుకోవటానికి ఈ ధర్మ మాత్రులు కృషి చేస్తున్నారు. చాలాకాలం నిలుస్తుందనీ, దీనిని చూచిన వారసులు దీని ప్రకారం నడచుకోవలసిన ఈ ధమ్మ శాసనాన్ని రాతి మీద చెక్కించాను.

**ఆరో శాసనం :**

దేవానాంప్రియుడైన, ప్రియదర్శి రాజు ఇలా చెబుతున్నాడు: ఇంతకు పూర్వం రాచకార్యాలను చక్కబెట్టడం గానీ ఆ విషయంగా ఎల్లపుడూ రాజుకు నివేదిక లందటం గానీ జరుగులేదు. కానీ, నేనిప్పుడిస్తున్న ఆజ్ఞ ఏమిటంటే, ఏ సమయంలోనైనా, అంటే నేను భోజనం చేస్తున్నా, అంతఃపురంలో ఉన్నా, శయనాగారంలో ఉన్నా, రథంలో ఉన్నా, పల్లకీలో పోతున్నా, ఉద్యాన వనంలో ఉన్నా ప్రజల సంగతులు ఎప్పటికప్పుడు నాకు నివేదించబడుతుండాలి. ఎందుకంటే నేనెక్కడున్నా ప్రజాపనులను నెరవేరుస్తుంటాను. దానం చేసే సందర్భంలో గానీ, ఆజ్ఞలను జారీ చేసినప్పుడు గానీ, ఒక్కోసారి నేను మహా మాత్రుల మీద ఒత్తిడి కల్పించినపుడు గానీ, ఏ విషయంలోనైనా అంగీకారం కుదరకపోయినా, పరిషత్తుల్లో వివాదాలు తలెత్తినా, అట్టి విషయాలను నాకు వెంటనే తెలియజేస్తుండాలి. ఇదే నా ఆజ్ఞ. నేను పడుతున్న శ్రమలో గానీ, రాచకార్యాలు నిర్వహించటంలో గానీ నాకు సంతృప్తి లేదు.

నిజానికి అందరి ప్రజల సుఖ సంతోషాలు, సంక్షేమాలను వృద్ధి చేయటమే నా ముఖ్యమైన విధి అని అనుకుంటున్నాను. ఎందుకంటే ప్రజల్లో సౌఖ్యం పెంపొందించటం కంటే మంచిపని లేనందువల్ల. ఈ లోకంలో, స్వర్గలోకంలోనూ ప్రజలు సుఖసంతోషాలతో ఉండేటట్లు నేను మంచి పనులు చేసి, వారి రుణం తీర్చుకొంటున్నాను.

చాలాకాలం నిలుస్తుందనీ, నా కొడుకులు, మనుమలు, ముదిమనుమలు దీని కనుగుణంగా నడుచుకొని సర్వలోకహితం కోసం పాటు పడతారని ఈ ధమ్మలిపిని రాతిమీద చెక్కించటమైంది. ఎంతో శ్రమకోరిస్తేనే గానీ ఇలాంటి పనులు చేయలేము.

**ఏడో శిలా శాసనం : (కాల్సి)**

దేవానాం ప్రియ, ప్రియదర్శి అయిన రాజు అన్ని మతాల వాళ్లూ వారి కిష్టమొచ్చిన చోటు నివసించవచ్చునీ, వారంతా స్వయం నిగ్రహం, భావశుద్ధి కలిగి ఉండాలని కోరుతున్నాడు. ప్రజలు రకరకాల కోరికలు, రకరకాల వ్యామోహాలు కలిగి ఉంటారు కాబట్టి వారు ధర్మాలలో అన్నింటిని గానీ, లేక కొన్నింటిని గానీ ఆచరిస్తుంటారు. అయితే ఎక్కువ దానాలను పొందుతూ, నిగ్రహం, భావశుద్ధి, కృతజ్ఞత, గట్టి పట్టుదల (ధృడమైన అంకిత భావం) లేనివారు నీచులౌతారు. దేవతలకు ప్రియుడైన ప్రియదర్శి రాజు ఇలా చెబుతున్నాడు : నేను చేసిన మంచి పనులనన్నిటినీ ప్రజలు ఆమోదించుటయే కాక వారు కూడా మంచి పనులనే చేస్తున్నారు. తల్లితండ్రులు, గురువులను గౌరవిస్తూ వయసు మళ్లినవారి పట్ల మర్యాదగా ప్రవర్తిస్తూ, బ్రాహ్మణులు, సన్యాసులు పట్ల ఆదరణతో ఉంటూ పేదలు, నిరుద్యోగులు, చివరికి సేవకులతో కూడా ప్రేమ పూర్వకంగా మెలుగుతూ వృద్ధిలోకి వచ్చారు. ఇకముందు కూడా వృద్ధిలోకి వస్తారు.

దేవతలకు ప్రియుడైన ప్రియదర్శి రాజు ఇలా చెబుతున్నాడు: ప్రజలు ధర్మ నియమం,

ధర్మాన్ని ఆచరించటం అనే రెండు విధాలుగా ధర్మాభివృద్ధి చేస్తూ, తామూ వృద్ధిలోకి వచ్చారు. ధర్మ నియమం కంటే ధర్మాన్ని ఆచరించటం వల్లే ఎక్కువ ఫలితం దక్కుతుంది. కొన్ని జంతువులను చంపకూడదని ఆజ్ఞాపించటమే నేను చేసిన ధర్మ నియమం. కానీ నేను చేసిన ధర్మ నియమాలు ఇంకా చాలా ఉన్నాయి. జీవరాశికి హాని తలపెట్టకుండా, చంపకుండా ఉండాలన్న నియమానికి కట్టుబడి ధర్మాన్ని ఆచరిస్తూ ప్రజలు వృద్ధిలోకి వస్తున్నారు.

ఈ విషయం గురించి, దేవతలకు ప్రియుడైన ప్రియదర్శి రాజు ఈ విధంగా చెబుతున్నాడు. చిరకాలం ఉండటానికి ఎక్కడైతే రాతి స్థంభాలు, రాతి పలకలున్నాయో అక్కడంతా ఈ ధమ్మ లిపిని చెక్కించాను. నా కుమారులు, మనుమలు ఉన్నంతవరకూ, సూర్యచంద్రులు ఉండేంతవరకూ ఈ ధమ్మ లిపి నిలిచి, నేనాదేశించినట్లే ప్రజలు ధర్మాన్ని ఆచరిస్తారు. ధర్మాన్ని ఆచరించటం ద్వారా ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సుఖాన్ని పొందుతారు. నేను రాజ్యాభిషిక్తుడనైన తరువాత 27వ సంవత్సరంలో ఈ ధమ్మ లిపిని రాయించాను.

రాజ్యాభిషిక్తుడైన తరువాత దేవతలకు ప్రియుడైన ప్రియదర్శిరాజు, శాక్యముని బుద్ధుడు ఇక్కడ జన్మించినందువల్ల ఈ ప్రదేశాన్ని సందర్శించి దీనిని పూజించాడు. లుంబినీ గ్రామంలో భగవానుడైన బుద్ధుడు జన్మించినందువల్ల, ఒక శిలా ప్రతిమను, స్థంభాన్ని నిలబెట్టాడు. లుంబినీ గ్రామవాసులు పన్నులు చెల్లించనక్కరలేదనీ, వారికొచ్చే ఫలసాయంలో ఎనిమిదో వంతు చెల్లిస్తే సరిపోతుందనీ శాసనం చేశాడు.

దేవతలకు ప్రియుడైన ప్రియదర్శిరాజు ఇలా ఆజ్ఞాపిస్తున్నాడు: ఇప్పటివరకూ సంఘటితంగా ఉన్న భిక్షు సంఘాన్ని ఎవరైనా చీల్చటానికి ప్రయత్నిస్తే దాన్ని అనుమతించరాదని కోశాంబిలో నున్న మహామంత్రులను ఆదేశించాడు. ఒకవేళ ఒక భిక్షువుగానీ, భిక్షుణీ గాని సంఘాన్ని చీల్చినట్లయితే వారికి తెల్లబట్టలను ధరింపజేసి విహారాన్ని విడిచిపెట్టి మరోచోట నివాసముండేట్లు చర్యలు తీసుకోవాలి.

## ఎనిమిదో శాసనం : (గిర్నార్)

పూర్వకాలంలో, రాజులు విహారయాత్రల కెళ్లినపుడు జంతువులను వేటాడటం లాంటి వినోదాల్లో పాల్గొనేవారు. కానీ, దేవానాం ప్రియుడు రాజ్యాభిషిక్తుడైన పది సం॥రాల తరువాత సంబోధికి బయలుదేరటంతో ధర్మయాత్రలను ప్రారంభించాడు. ఈ ధర్మయాత్రల్లో బ్రాహ్మణులు, శ్రమణులను సందర్శించి వారికి దానాలు చేయడం, ముసలివారిని దర్శించి వారికి బంగారు దానాలు చేయటం, పల్లె జనాన్ని చూచినపుడు వారికి ధర్మాన్ని బోధించటం, తగిన రీతిలో వారితో ధర్మంపై చర్చించటం లాంటి పనుల్లో మునిగి పోయేవాడు. ఈ విధంగా చేస్తూ దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు ఎంతో ఆనందాన్ని పొందేవాడు.

## తొమ్మిదో శాసనం : (కాల్సి)

దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు ఈ విధంగా చెబుతున్నాడు: ప్రజలు రోగంతో బాధపడుతున్నప్పుడో, వేడుకలు, కూతుళ్ల పెళ్ళిళ్లు చేస్తున్నప్పుడో, పిల్లలు పుట్టినపుడో, వేరే చోటికి ప్రయాణమైనప్పుడో, ఇంకా ఇతర సందర్భాల్లోనో, కొన్ని మంగళప్రదమైన వ్రతాలను చేస్తున్నారు. స్త్రీలయితే కొన్ని పనికిమాలిన, ప్రయోజనం లేని ఉత్సవాలను చేస్తున్నారు. ఈ విధమైన ఉత్సవాలను చేయాల్సిందే గానీ అవి అనుకొన్నంత ఫలితాల నందివ్వలేవు. ధర్మ వ్రతాన్ని అవలంబించటం చేత ఎంతో ఫలితం దక్కుతుంది. సేవకులు, ఉద్యోగుల పట్ల మంచిగా ప్రవర్తించటం, గురువులను గౌరవించటం, ప్రాణుల పట్ల ఓర్పు, ఓదార్పు కలిగి ఉండటం, బ్రాహ్మణులు, శ్రమణుల పట్ల ఉదారంగా ఉండటం, ఈ ధర్మవ్రతంలో చేరి ఉన్నాయి. కాబట్టి

ప్రతి తండ్రి, కొడుకు, సోదరుడు, యజమాని, స్నేహితుడు, పరిచయస్తుడు, ఇరుగు పొరుగు వారికి ఇదే మంచి వ్రతం. దీని ఫలితం దక్కేంతవరకూ ఆచరిస్తానని చెప్పాలి. ధర్మం తప్ప ఇతర వ్రతాల నుంచి ఫలితం దక్కడం అనుమానమే. ఒకవేళ ఆ వ్రతాల వల్ల ఫలితాలు దక్క వచ్చు, దక్కకపోవచ్చు కూడా. ఒకవేళ దక్కినా, ఆ ఫలితం ఈ లోకం వరకే పరిమితమవుతుంది. కానీ ధర్మ వ్రతానికి కాలావధి లేదు. ఒకవేళ దాని వల్ల ఈ లోకంలో ఆశించిన ఫలితం దక్కకున్నా, స్వర్గంలో పుణ్యప్రాప్తి కలుగుతుంది. ఒకవేళ దాని ఫలితం ఈ లోకంలో దక్కినా ఇక్కడా, మరో లోకంలోనూ గొప్ప పుణ్యాన్ని పొందటం మాత్రం నిజం.



దక్షిణ ఆఫ్ఘనిస్తాన్‌లోని కాందహార్ శిలాశాసనం

## పదో శాసనం : (గిర్నార్)

తన ప్రజలు ఇప్పుడూ, ఇకముందూ ధర్మాన్ని ఆచరించి, ఆచరించేట్లు చేయటం ద్వారా కలిగే పేరు, కీర్తులే గొప్పవని, ఇతరత్రా వచ్చే పేరు, కీర్తులు అంతగొప్పవి కావని దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు భావిస్తున్నాడు. దీనికోసమే దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు కీర్తిని, పేరును కోరుకుంటున్నాడు. దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు చేసే కృషి ప్రజలకు స్వర్గలోక సంక్షేమాన్ని ఇచ్చేందుకు దారితీస్తుంది. పుణ్యకార్యాలు చేయకుండటమే చెడు. ఇతరమైన ఫలితాలను ఆశించకుంటే తప్ప అల్పుడైనా, గొప్పవాడైనా ఈ ధర్మాన్ని ఆచరించటం కష్టం. నిజానికి గొప్పవానికే దీనిని ఆచరించటం చాలా కష్టం.

## పదకొండో శాసనం : (గిర్నార్)

దేవానాం ప్రియుడు, ప్రియదర్శి రాజు ఇలా చెబుతున్నాడు: ధర్మాన్ని దానం చేయటం కంటే మించిన దానం లేదు. ధర్మాన్ని బోధ ద్వారా ప్రచారం చేయటాన్ని మించిన ప్రచారం లేదు. ధర్మం ద్వారా సంక్రమించే సంబంధానికి మించిన సంబంధం లేదు. సేవకులు, ఉద్యోగుల పట్ల మర్యాదగా మెలగటం, తల్లి దండ్రులంటే గౌరవం, స్నేహితులు, పరిచయస్తులు, బంధువులు,

శ్రమణులు, బ్రాహ్మణుల యెడ దయతో ఉండటం, ఇతర ప్రాణులను హింసించకుండా ఉండటమే ధర్మ వ్రతం. కావున తండ్రి, కొడుకు, సోదరుడు, యజమాని, స్నేహితుడు, పరిచయస్తుడు, ఇరుగుపొరుగువాడు, 'ఇదే మంచిది, ఇలానే చేయాలి' అని చెప్పాలి. ధమ్మదానం వల్ల ఈ లోకంలో సుఖాన్ని పరలోకంలో గొప్ప పుణ్యాన్ని పొందుతాడు.

**పన్నెండో శాసనం :**

దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు అన్ని మతాలకు చెందిన శ్రమణులను, గృహస్తులను, దానం చేయటం ద్వారా ఇంకా ఇతర పనుల ద్వారా గౌరవిస్తున్నాడు. అయితే దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు, అన్ని మతాల్లోని ముఖ్య ధర్మాల వృద్ధికి ఇచ్చినంత విలువ, గౌరవాలను దానాలు, ఇతర గౌరవాలకు ఇవ్వడు. సరైన కారణం లేకుండా, ఇతర మతాల వారిని విమర్శించటం, తమ మతాన్ని పొగడటం, అవసరమైన మేరకే మాట్లాడటం అనే వాటిని పాటిస్తే ముఖ్య ధర్మాల వృద్ధి జరుగుతుంది. ఒకవేళ విమర్శకు తావుంటే అది కూడా సున్నితంగానే ఉండాలి. అయినా ఇతర మతాలను గౌరవించటం మంచిది. ఇలా చేయటం వల్ల తమ మతాన్ని తాము వృద్ధి చేసుకొన్న వారౌతారు. అలా చేయలేకపోతే తమ మతానికే కాక ఇతర మతాలకు సైతం హాని చేసినవారౌతారు. ఎవరైతే మితిమీరిన అభిమానంతో తమ మతాన్ని తామే పొగుడుకొని ఇతర మతాలను దూషిస్తారో, వారు వారి మతానికే ఎక్కువ హాని చేసిన వారౌతారు. అందువల్ల వివిధ మతాల మధ్య చక్కటి సంబంధాలుండటం మంచిది. ఇతర మతాల ధర్మాలను విని వాటిని గౌరవించాలి. దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు, అందరూ అన్ని మతాల ముఖ్య ధర్మాలను తెలుసుకోవాలని చెప్పాడు.

ఎవరైతే వారి వారి మతాల పట్ల అభిమానం కలిగి ఉంటారో వారికి, దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు దానాలకు, గౌరవాలకు ఎక్కువ విలువ ఇవ్వడనీ, మతాల మూల ధర్మాల వృద్ధిని మాత్రమే అతడు గౌరవిస్తాడని చెప్పాడు. దీనికోసం ధర్మ మహామాత్రులు, స్త్రీల ఆవాసాలపై అధికారం గల మహామాత్రులు, ఇతర ప్రాంతాధికారులు, ఇంకా ఇతర అధికారులు నియమింపబడినారు. దీనివలన తమ తమ మత శాఖలు వృద్ధి పొందటమే కాక ధర్మం తేజరిల్లుతుంది కూడా.

**పదమూడో శాసనం :**

దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు తనకు పట్టాభిషేకమైన ఎనిమిదో ఏట కళింగులను జయించాడు. లక్షా 50 వేలమంది ఆ రాజ్యం నుంచి బయటికి పంపేయబడినారు. లక్షమంది చంపేయబడటమే కాక ఇంకా అంతకంటే ఎక్కువ మందే చనిపోయారు. కళింగను జయించిన దేవానాం ప్రియుడు, ధర్మంపట్ల అనురక్తి, ధర్మం, ధర్మబోధ పట్ల అనురాగాన్ని పెంచుకున్నాడు. కళింగులను జయించినందుకు దేవానాం ప్రియునికి పరితాపం కలిగింది.

ఒక రాజ్యం జయింప బడినప్పుడు జనాన్ని చంపటం, జనం చనిపోవటం, జనాన్ని దేశాన్నుంచి పంపేయడం, దేవానాం ప్రియునికి చాలా బాధను కలిగించిన మాట నిజం. అక్కడ నివసించే వారిలో పెద్దలు, తల్లితండ్రుల పట్ల గౌరవంతో మెలిగే వారు, అత్యంత విశ్వాసంతో మెలిగే స్నేహితులు, పరిచయస్తులు, బంధువులు, సేవకులు మరియు ఉద్యోగస్తులు, గాయపడటం, చనిపోవటం లేక వారికి ప్రియమైన వాళ్ల నుంచి విడిపోవటం అనే అంశాలు దేవానాం ప్రియునికి మరింత బాధ కలిగించాయి. ఈ బాధలకు లోను కానటువంటి వారు, గాయపడిన, చనిపోయిన, దేశం విడిచి వెళ్లిన వారి స్నేహితులు, పరిచయస్తులు, సహచరులు, బంధువులు, కనిపించనపుడు మరింత బాధకు గురైనారు.

అందరూ పాలు పంచుకొన్న ఈ బాధలు, దేవానాం ప్రియుణ్ని శోకానికి గురి చేశాయి. ఒక్క యవన దేశంలో తప్ప శ్రమణులు, బ్రాహ్మణులు లేని దేశం, అలాగే ప్రజలు ఏదో ఒక మతాన్ని విశ్వసించని దేశం లేనే లేదని చెప్పాలి. అందుచేత కళింగ దేశాన్ని జయించినప్పుడు నూరో వంతు మందో, వెయ్యోవంతుమందో చంపబడో, చనిపోయో, లేక దేశం నుంచి బయటికి పంపబడో వుంటారు గాబట్టి ఆ విషయం దేవానాం ప్రియుణ్ణి బాధించింది. ఇప్పుడు తప్పు చేసిన వారిని కూడా అవకాశాలున్నంత వరకూ క్షమించి వదిలేయాలని దేవానాం ప్రియుడు అనుకొన్నాడు.

దేవానాం ప్రియుని రాజ్యంలో గల ఆటవికులకు సైతం సక్రమ మార్గంలో జీవించే విధంగా తీర్చిదిద్దటమైనది. దేవానాం ప్రియునికి ఆటవికులను శిక్షించే అధికారమున్నా, అతనికి కలిగిన శోకం వల్ల హింసా మార్గంలో పోతున్న వారిని వారి చర్యలపట్ల సిగ్గుపడేట్లు చేయగలిగినాడు. దేవానాం ప్రియుడు అహింస, అన్ని జీవరాశుల పట్ల పక్షపాత వైఖరి లేకుండా ఉండాలని కోరుకున్నాడు.

ధర్మ విజయమే అత్యుత్తమ విజయంగా దేవానాం ప్రియుడు భావించాడు. ఈ విజయమే ఆరువందల యోజనాల వరకూ యవనరాజు అంతియోకసు పాలిస్తున్న రాజ్యం వరకూ దాని తరువాత హలెమా, ఆరిటిగోనోస్, మగస్ మరియు అలెగ్జాండర్లు పాలిస్తున్న రాజ్యాల వరకూ, అలాగే దక్షిణాన చోళులు, పాండ్యులు మొదలుకొని, తామ్రపర్ణి వరకూ వ్యాపించింది.



అశోకుని స్తంభశాసనం

తన సామ్రాజ్యంలో యవనులు, కాంభోజులు, నాభకులు, నాభ పంక్తులు, భోజులు, పితినికులు, ఆంధ్రులు, పులిందులు మొదలైనవారు అన్నిచోట్లా దేవానాం ప్రియుని ధర్మ శాసనాన్ని అనుసరిస్తున్నారు. రాజదూతలు పోని రాజ్యాలలోని ప్రజలు దేవానాం ప్రియుని ధర్మాన్ని, ఆజ్ఞలను ధర్మ బోధలను విని ఆచరిస్తూ, ఇకముందు కూడా అవలంబించటానికి పూనుకొన్నారు. ప్రతిచోటా కలిగిన ఈ ధర్మ విజయం వల్ల ఎంతో ఆనందం కలుగుతుంది. అయితే ఈ ఆనందం అంత లెక్కలోకి తీసుకోవాల్సింది గాదు. పరలోకంలో దొరికే ఫలాలే మరింత ముఖ్యమని దేవానాం ప్రియుడు తలపోస్తున్నాడు. నా కొడుకులు, ముదిమనుమలు, ఈ ధమ్మలిపిని చూచి, కొత్త విజయాలను సాధించనక్కరలేదనీ, ఒకవేళ కొత్త విజయాలు పొందాలని కోరిక కలిగినా ధర్మ విజయమే అన్ని విజయాల్లోకి గొప్ప విజయమని, ఇదే ఈ లోకంలోనూ, పరలోకంలోనూ మంచి ఫలాలనిస్తుందని తెలిపాడు. ధర్మ ప్రచారం వల్ల కలిగి సంతోషమే తమకు ఈ లోకంలోనూ, పరలోకంలోనూ నిజమైన ఫలాలనిస్తాయని వారు అనుకోవాలి.

## పధ్నాలుగో శాసనం : (గిర్నార్)

దేవానాం ప్రియుడు, ప్రియదర్శి అయిన రాజు, ధమ్మ లిపులను చిన్నవిగాను, మధ్యరకంగానూ, వివరంగానూ రాయించాడు. సామ్రాజ్యం విశాలమైనందువల్ల అన్నిచోట్లా అన్ని లిపులూ చెక్కించటానికి వీలుపడలేదు. ఈ లిపుల్లోని కొన్ని విషయాలు మళ్లీ మళ్లీ చెప్పుకునేంత రమ్యంగా ఉండటం చేత ప్రజలు వీటికి అనుగుణంగా నడచుకొంటారు. కొన్ని లిపులు పూర్తిగా లేకున్నట్లైతే,

ఆ ప్రాంతాన్ని బట్టి, విషయంపై అక్కడి వారికి ఇష్టం లేకపోవటం వల్ల, లేక లిపికారుని పొరపాటు వల్ల జరిగాయి.

## కళింగ శాసనం 1. (ధౌలి)

దేవానాం ప్రియుడు తోసలి నగర న్యాయాధికారులైన మహామాత్రులతో ఇలా చెప్పాలంటున్నాడు. నాకు ధర్మమని తోచిన ప్రతిపనీ సరైన మార్గములోనే చేయటానికి పూనుకొంటాను. ఈ విషయంలో నా ఆజ్ఞలు కార్యసాధకులైన మీకు ఎంతో ఉపయోగకరంగా ఉంటాయని భావిస్తాను. నేను మిమ్మల్ని కొన్నివందల వేలమంది ప్రజలపై అధికారులుగా నియమించింది మీరు వారందరి ప్రేమానురాగాలను పొందాలనే.

ప్రజలందరూ నా పిల్లలతో సమానమే. నా సొంత పిల్లల విషయంలో వారు ఇక్కడా, పరలోకంలో, సుఖ సంతోషాలతో ఉండాలని కోరుకొంటానో, అలాగే అందరి ప్రజల విషయంలో కూడా కోరుతున్నాను. నా ఈ కోరిక ఎంత గాఢమైందో మీకు తెలియదు, ఒకవేళ మీలో ఎవరికైనా తెలిసినా, అది పూర్తిగా తెలిసినట్లు కాదు. ఈ విషయం పట్ల మీరు శ్రద్ధ తీసుకోవాలి. పరిపాలన సజావుగా సాగించటంలో కొందర్ని చెరసాలలో బంధించటం గానీ, కొందరితో కఠినంగా వ్యవహరించటం గానీ, మరి కొందర్ని సరైన కారణాలు లేకుండా చంపటం గానీ జరగటం వల్ల ఎంతోమందికి శోకం కలుగుతుంటుంది. అందువల్ల మీరు విధులు నిర్వర్తించేపుడు పక్షపాతం లేకుండా అందరి ఎడలా సమదృష్టితో మెలగాలి. ఈర్ష్య, కోపం, దుర్మార్గం, అసహ్యం, ఉదాసీనత, సోమరితనం లేక అలసట అనే వాటివల్ల పై విధంగా జరగకుండా చూడాలి. అందుచేత, ఈ పనులు మీ వల్ల జరగకుండటమే మీ ఉద్దేశం కావాలి. ఇందుకు ప్రతివారూ కోపం లేకుండా, ఓర్పుతో మెలగాలి. పరిపాలన సజావుగా సాగించటంలో విసుగుచెందిన వారికి అంతకంటే ఉన్నతమైన పదవులు దక్కవు. విసుగు చెందని వారికి పదోన్నతి లభిస్తుంది. మీరు దీన్ని అర్థం చేసుకొన్న వారుంటే, మీతోటి ఉద్యోగులతో, మీ విధులను మీరు సక్రమంగా నిర్వర్తించండి. ఇది దేవానాం ప్రియుని ఆజ్ఞ అని చెప్పండి. మీ విధులను మీరే సరైన విధంగా నిర్వర్తిస్తే మంచి ఫలితం దక్కుతుంది. లేకపోతే అటు పరలోక సుఖం గానీ, ఇటు రాజు అనుగ్రహం కానీ కలుగవు. సరిగా (మీ ధర్మాన్ని మీరు పాటిస్తే) విధులు నిర్వర్తించినట్లైతే మీరు రాజు రుణాన్ని తీర్చుకోవటమే కాకుండా, స్వర్గాన్ని కూడా పొందగలరు. ఈ ధమ్మలిపిని ప్రతి తిష్య నక్షత్రం రోజున అందరూ వినాలి. ఒక తిష్య నక్షత్రానికీ, మరో తిష్య నక్షత్రానికీ మధ్య కనీసం ఒకసారైన దీనిని వినవచ్చు. ఈ విధంగా చేయటం వల్ల మీరు మీ ధర్మాన్ని నిర్వర్తించినవారౌతారు.

నగర న్యాయాధికారులు వారి విధుల నిర్వహణలో, ప్రజలు అన్యాయంగా చెరసాల కెళ్లటం గానీ, లేక బాధలకు గురి కావటం గానీ జరిగే వీలున్నందున, ఈ ధమ్మ శాసనాన్ని ఇక్కడ చెక్కించాను. న్యాయాధికారులు నా ఆజ్ఞలను సరిగా అర్థం చేసుకొని వాటి ప్రకారం వారు నడచుకొంటున్నారో లేదోనని తెలుసుకోటానికి నేను ప్రతి ఐదేళ్ళకో మారు ఇందుకోసం తొందరపాటు లేని, క్రూరులు కాని, దయాగుణం గలిగిన మహామాత్రులను యాత్రలకు పంపుతున్నాను. అలాగే ఉజ్జయిని రాకుమారుడు కూడా పై గుణాలు కలిగిన మహామాత్రులను, పై విషయాలను తెలుసుకోటానికి మూడేళ్లకోసారి పంపుతుండాలి. తక్షశిల నుంచి కూడా అలాగే జరగాలి. ఈ మహామాత్రులు, తనిఖీలకై యాత్రల కెళ్లినపుడు వారి విధులను సక్రమంగా నిర్వర్తిస్తూనే, న్యాయాధికారులు రాజు ఆజ్ఞల ప్రకారం నడచుకొంటున్నారో లేదో తెలుసుకోవాలి.

## కళింగ శాసనం 2. (ధౌలి)

దేవానాం ప్రియుడు ఈ విధంగా చెబుతున్నాడు: సమీపంలోని మహామాత్రులకు రాజాజ్ఞ ఉద్దేశించబడింది. నేను ధర్మమనుకొన్న ప్రతిదీ, సరైన తీరులో జరిగేట్లు చూడాలనుకొంటున్నాను. ఈ విషయంలో నా ఆజ్ఞలే మీ కార్యసాధనకు మంచి మార్గాన్ని చూపిస్తాయనుకొంటున్నాను. ప్రజలందరూ నా సంతానంతో సమానం. ఈ లోకంలోనూ, పరలోకంలోనూ, నా సొంత పిల్లల సుఖ సంతోషాలను నేనెలా కోరుకుంటానో అలాగే నా ప్రజల విషయంలో కూడా కోరుకొంటాను.

నా రాజ్య సరిహద్దుల్లో నేను జయించని రాజ్యాల్లోని ప్రజలు; "రాజు మమ్మల్నేమి చేయాలని కోరుకొంటున్నార" ని అనుకోవచ్చు. వారు నాకు భయపడనక్కరలేదనీ నాపట్ల వారు విశ్వాసం కలిగి ఉండాలని, నా వల్ల వారు సౌఖ్యాన్నే గానీ దుఃఖాన్నీ పొందరని నా విశ్వాసం. క్షమించదగిన వారిని రాజు క్షమిస్తాడనీ, ఈ లోకంలో పరలోకంలో సుఖాన్ని పొందేందుకు ధర్మాన్ని ఆచరిస్తున్నవారిని ప్రోత్సహిస్తాడని వారు తెలుసుకోవాలి. నేను నా ప్రజల రుణాన్ని తీర్చుకోవటానికి, ధర్మాన్ని ఆచరించటంలో నా దృఢమైన ప్రతిజ్ఞ వ్రతాల గురించి, మీకు తెలియజేయటానికి ఈ ఆదేశాన్నిస్తున్నాను. అందుచేత మీరు విధులను నిర్వర్తిస్తూ, ధర్మాన్ని ఆచరిస్తూ, 'రాజు తండ్రివంటివాడనీ, తనలాగే మనల్ని ప్రేమిస్తుంటాడనీ మనం ఆయనకు పిల్లల లాంటి వారమనీ వారు తెలుసుకొని విశ్వాసం కలిగి ప్రవర్తించేట్లు చేయండి.

అందుకోసమే మీకు ధర్మోపదేశం చేసి, నా దృఢతరమైన దీక్షను తెలిపి, అనుకున్నది సాధించటానికి నా మట్టుకు నేను పరిపూర్ణంగా ఆచరిస్తున్నాను. మీరు ఆ ప్రాంత ప్రజల్లో విశ్వాసాన్ని నింపి వారికి ఈ లోకంలో, పరలోకంలో సుఖ, సంతోషాలు దొరికేట్లు, మీ విధులను నిర్వర్తిస్తే మీరు నా రుణం తీర్చుకోవడమే కాక స్వర్గాన్ని కూడా పొందుతారు. అన్నివేళలా సరిహద్దు ప్రాంత ప్రజల్లో విశ్వాసాన్ని కలిగించి, ధర్మాన్ని ఆచరిస్తారనే ఉద్దేశంతో ఈ శాసనాన్ని రాయించటమైంది.



కారాకోర్ శిలాశాసనం

## చిన్న శిలా శాసనాలు

**1. గవిమట్ శాసనం** : దేవానాం ప్రియుడు ఇలా చెబుతున్నాడు. నేను ఉపాసకుడనై ఇప్పటికి రెండున్నర సంవత్సరాలైనా, నేను ఇప్పటివరకూ ఎలాంటి ఉత్సాహాన్నీ చూపించలేదు. అయితే నేను సంఘాన్ని దర్శించిన ఒక సంవత్సరం పైగా ఎంతో ఉత్సాహంతో ఉన్నాను. జంబూ ద్వీపం ప్రజలతో ఆ కాలంలో కలసి ఉండని దేవతలను నేను కలిశాను. ఇది ఉత్సాహ ఫలితమే కానీ, ఏదో గొప్పవాళ్లు మాత్రమే చేయగలిగింది కాదు. వినయంగా ఉండే చిన్నవాళ్లు కూడా ఉత్సాహవంతులైతే స్వర్గాన్ని పొందుతారు. బీదవారూ, గొప్పవారూ నా రాజ్య సరిహద్దుల్లో ఉండే ప్రజలు కూడా ఉత్సాహవంతులై ఉంటారని, ఆ ఉత్సాహం చాన్నాళ్లుండాలనీ ఈ శాసనాన్ని ప్రకటిస్తున్నాను. అప్పుడు ఆ ఉత్సాహం క్రమంగా ఎక్కువై, బాగా ఎక్కువై, ఒకటిన్నర రెట్లు ఎక్కువవుతుంది. రాజు యాత్రలో నున్నప్పుడు 256 సార్లు ఈ శాసనాన్ని ప్రకటించాడు.

## 2. ఎర్రగుడి శాసనం

దేవానాం ప్రియుడు ఈ విధంగా చెప్పాడు. దేవానాం ప్రియుడు ఆదేశించినట్లుగా మీరు నడుచుకోవాలి. మీరు రజ్జుకులకు, రజ్జుకులు గ్రామ ప్రాంతాల్లో ఉండే ప్రజలకు, స్థానిక అధికారులకు, రాష్ట్రికులకు ఈ విధంగా తెలియజెప్పండి. "ప్రతివారూ తల్లితండ్రుల మాటలను వినాలి. అదేవిధంగా పెద్దల మాటలను గౌరవించాలి. జీవరాశి పట్ల దయతో మెలగాలి. సత్యాన్నే పలకాలి. ఈ ధర్మవాక్యాలనే ప్రతివారూ చాటించాలి. ఈ విధంగా దేవానాం ప్రియుని మాటల్లో మీరు ఆదేశించండి.

మీరు కూడా ఏనుగుల మీద స్వారీ చేసేవారికి, లిపికారులకు, రథికులకు, బ్రాహ్మణులకు ఆ విధంగా చెప్పండి "మీరు, మీ శిష్యులకు పూర్వపు పద్ధతిలోనే నడచుకోమని చెప్పండి. ఈ ఆదేశాన్ని అందరూ పాటించాలి. ఇందులోనే గురువులకు గౌరవముంది. ఈ ఆదేశాల వెనుక గల నియమాలను, తమ మగ బంధువుల ద్వారా ఆడ బంధువులు ఆచరించేట్లు సరైన తీరులో తెలియజెప్పాలి. పురాతన పద్ధతి ప్రకారం ఇదే నియమాన్ని తమ శిష్యుల్లో ప్రవేశపెట్టాలి. మీరు సూచించిన మార్గములోనే, సరైన పద్ధతిలో చెబితే పై నియమం మీ శిష్యుల్లో ఎక్కువగా ప్రబలమౌతుంది. ఇది దేవానాం ప్రియుని ఆజ్ఞ.

## 3. భైరాత్ శాసనం

మగధరాజైన ప్రియదర్శి భిక్కు సంఘానికి అభివాదాలు తెలిపి, సంఘం ఆరోగ్యంగా, సంతోషంగా ఉండాలని కోరుకొంటూ ఇలా అన్నాడు. "గౌరవనీయులైన ఆచార్యులారా! నాకు బుద్ధుడు, ధమ్మం, సంఘం అంటే ఎంత గౌరవ పూర్వకమైన విశ్వాసముందో మీకు తెలుసు. గౌరవ ఆచార్యులారా! బుద్ధ భగవానుడు చెప్పినవన్నీ సుభాషితాలే. సద్ధర్మం కలకాలం కొనసాగటానికి దాని అర్థాన్ని వివరించటం, గౌరవ ఆచార్యులారా! నాకు సరైన ధర్మంగా తోస్తుంది. బుద్ధుని ధమ్మ వచనాలైన, వినయ సూత్రాలు, పవిత్ర జీవన విధానం, రాబోయే భయాలు, శాక్యమునిపై గల గాధలు, ఉపతిస్సుని ప్రశ్నలు, రాహుల సుత్తం మొదలుగా గల అంశాలను, ఇంకా గౌరవ ఆచార్యులారా, బుద్ధుడు సత్యాన్ని గురించి చెప్పిన ప్రవచనాలను భిక్షువులు, భిక్షుణీలు మళ్లీ మళ్లీ వింటూ, వాటిని మననం చేసుకొంటారని, ఉపాసిక, ఉపాసకులు కూడా ఈ విధంగానే చేస్తారని నేను కోరుకొంటున్నాను. మీరు నా అభిప్రాయాన్ని తెలుసుకొంటారని వీటిని రాయిస్తున్నాను.

# ఏడు స్థంభ శాసనాలు

## మొదటి స్థంభ శాసనం

దేవానాం ప్రియుడు ఈ విధంగా చెబుతున్నాడు. నేను రాజ్యాభిషిక్తుడనైన 26 ఏళ్ల తరువాత ఈ ధర్మ లిపి రాయబడింది. ధమ్మం చేయాలనే గొప్ప కోరిక, గొప్ప ఆత్మ పరిశీలన, గొప్ప గౌరవం, పాపమంటే భయం, గొప్ప ఉత్సాహాల పట్ల మమకారం లేకపోతే ఈ లోకంలో గానీ, పరలోకంలో గానీ సుఖం దొరకటం కష్టతరమౌతుంది. కానీ నా ఆదేశం మూలంగా, ధమ్మనిరతి, ధమ్మం పట్ల మమకారాలు రోజు రోజుకూ పెరగటమే కాక, ఇకముందు కూడా పెరుగుతాయి. ఉన్నత, మధ్యమ, అధమ స్థాయిల్లో గల నా ఉద్యోగులు, ధమ్మాన్ని ఆచరిస్తూ, ధర్మనిరతికి లోబడి, మిగతా ప్రజలు కూడా ధర్మనిరతులై ధమ్మాన్ని ఆచరించేట్లు చేస్తారు. సరిహద్దుల్లో నియమించబడిన మహామాత్రులు కూడా ఈ విధంగానే చేస్తున్నారు. ధమ్మ విధానం ద్వారా ధర్మాన్ని కాపాడుకొని, ధమ్మ మార్గం ద్వారా సుఖాన్ని పొందుతారనేదే నా ఆదేశం.

## రెండవ స్థంభ శాసనం

దేవతల ప్రియుడైన ప్రియదర్శి రాజు చెబుతున్నాడు. ధమ్మం ఎంతో మంచిది. కానీ ధమ్మం అంటే ఏమిటి? కొద్దిపాటిగా మాత్రమే చెడు. చాలా మంచితనం, దయ, దానం, సత్యం, పవిత్రత అనే మంచి గుణాలే ధమ్మం. నేను అనేక విధాలుగా ధమ్మచక్షు దానం చేశాను. రెండుకళ్లు నాలుగు కాళ్ల జంతువులు, పక్షులు, నీటిలో నివసించే జంతువులకు ప్రాణదానంతో పాటు అనేక విధాలుగా నా అనుగ్రహం చూపాను. ఇవే కాకుండా నేను ఎన్నో మంచి పనులు చేశాను.

ప్రజలు ఈ ధర్మాన్ని ఆచరిస్తారని అది చానాళ్ళు కొనసాగుతుందనీ, ఈ ధమ్మలిపిని రాయించాను. దీనిని పాటించేవాడు ఖచ్చితంగా కొద్దో గొప్పో మంచిపనులు చేస్తాడు.

## మూడో స్థంభ శాసనం

దేవానాం ప్రియుడు ప్రియదర్శి రాజు ఈ విధంగా చెబుతున్నాడు: ప్రజలు 'ఈ మంచి పని నేను చేసాను' అని చెబుతూ మంచి పనులనే చేస్తారు. కానీ వాళ్లు 'ఈ పాపం చేశాను దీన్ని పాపమంటారు అని వాళ్లు చేసిన పాపాలను వాళ్లు చెప్పుకోరు. కానీ ఇలా చూడడం అంత తేలికేం కాదు. దాని గురించి ఇలా అనుకోవాలి. ఇవే పాపానికి, హింసకు, క్రూరత్వానికి, కోపానికి, గర్వానికి, అసూయకు దారి తీస్తాయి. వీటి వల్ల నేను నాశనం కాకుండుగాక! అంతేగాక, ఇంకా ఇలా అనుకోవాలి. ఈ పనుల వల్ల నాకు ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సంతోషం కలుగుతుంది.

## నాలుగో స్థంభ శాసనం

దేవానాం ప్రియుడు ఈ విధంగా చెబుతున్నాడు: నేను పట్టాభిషిక్తుడనైన 26 సంవత్సరాలకు ఈ ధమ్మలిపిని రాయిస్తున్నాను. నేను నియమించిన రజ్జుకులు ప్రజల మధ్య, వందల వేలమందిలో పని చేస్తున్నారు. మొరలను వినడం, న్యాయాన్ని అందించటం అనే రెండు ప్రధాన విధులను ప్రజల సంక్షేమం, సుఖం కోసం నిర్భయంగా విశ్వాసంతో నిర్వహిస్తారని వారికి ఆ విధులను అప్పగించటం జరిగింది.

రజ్జుకులు ధర్మ నిరతులై, ఈ దేశంలోని ప్రజలను మంచి పనులు చేయటానికే ప్రోత్సహించి వారు ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సుఖాన్ని పొందుతారని గుర్తుంచుకోవాలి. రజ్జుకులు నా వద్ద పని చేయటానికి ఉత్సాహ పడుతుంటారు. రజ్జుకులు, వారి విధులను సక్రమంగా నిర్వర్తించి నన్ను ఆనందింప చేయమని పై అధికారుల ఆదేశాలను కూడా పాటిస్తారు. దాదికి తన బిడ్డను అప్పగించినవాడు! ఈ దాది నా బిడ్డను సరిగా చూచుకొంటుందను కొన్నట్లుగానే, నా ఈ దేశంలోని ప్రజల హితం, సుఖం కోసం పని చేయటానికి నాచే నియమించబడిన రజ్జుకులకు అప్పగించాను.

మొరలను వినీ, నాయం చేసే విధులను రజ్జులకే ఎందుకు వదిలి పెట్టానంటే, వారు నిర్భయంగా, నిర్మొహమాటంగా, నిక్కచ్చిగా తమ విధులు నిర్వర్తిస్తారనే. శిక్షను విధించటంలోనూ, న్యాయం చేయటంలోనూ, వారు ఒకే విధంగా ప్రవర్తించాలని నేను కోరుకొంటున్నాను.

నా ఆజ్ఞలు రజ్జుకులకు చేరటానికి ఒక్కోసారి మూడు రోజులు పట్టొచ్చు. అలాంటి సందర్భాల్లో, కారాగారవాస శిక్ష గానీ, మరణశిక్ష గానీ, విధించటానికి మూడు రోజుల వ్యవధిని రజ్జుకులకు ఇస్తున్నాను. ఈ మూడు రోజుల వ్యవధిలో నిందితుల బంధువులు ప్రాణ భిక్ష పెట్టమనో, లేక శిక్ష తగించమనో వేడుకోనటానికి అవకాశం చిక్కుతుంది. ఒకవేళ నిందితుల తరపున వేడుకోవటానికి బంధువులు ఎవరూ లేనట్లైతే, నిందితులే ఉపవాసం ఉండటానికో

లేక దానాలు ఇవ్వటానికో సమయం చిక్కుతుంది. ఇలా వ్యవధి కాలం దాటిపోయినా, పరలోక సౌఖ్యాన్నైనా పొందుతారనీ, దీనివల్ల ప్రజల్లో, ధర్మాన్ని ఆచరించటం, ఆత్మ నిగ్రహం, దానం చేసే గుణాలు పెరుగుతాయి.

## ఐదో స్థంభ శాసనం

దేవతలకు ప్రియుడైన ప్రియదర్శిరాజు ఈ విధంగా చెబుతున్నాడు: నాకు పట్టాభిషేకమైన 26వ సం॥ములో, చిలుకలు, మైనాలు, అరుణ పక్షులు, చక్రవాకాలు, బాతులు, హంసలు, నందిముఖాలు, గేలాట పక్షులు, గబ్బిలాలు, రాణీచీమలు, ఎముకలు లేని చేపలు, నీటికోళ్లు, తాబేళ్లు, ముళ్లపందులు, ఉడతలు, సుమరాలు, ఆంబోతులు, ఓక పిండాలు, ఖడ్గ మృగాలు, అడవి పావురాళ్లు, పెంపుడు పావురాళ్లు, అడవి గాడిదలు, ఉపయోగం లేని, తినడానికి పనికిరాని నాలుగు కాళ్ల జంతువులను కాపాడాలే గాని, చంపకూడదని నేను ఆజ్ఞాపించాను. కడుపుతో ఉన్న, లేక లేగలకు పాలిస్తున్న మేకలు, గొర్రెలు, పందులను, ఆరు నెలల కంటె తక్కువ వయసున్న లేగలను చంపకూడదు. కోళ్లను కోయరాదు. ఇతర జీవులను ఊకలో పెట్టి కాల్చకూడదు. అలాగే జంతువులను చంపే ఉద్దేశంతోనో లేక ఏ కారణామూ లేకుండా అడవులను తగల బెట్టరాదు. ఒక జంతువును మరో జంతువుకు ఆహారంగా పెట్ట రాదు. మూడు చాతుర్మాస దినాల్లోను, పుష్యమాసం పున్నమి, చతుర్దశి, అమావాస్య లేక పున్నమినాడు చేపల్ని కాపాడాలే కాని, అమ్మకూడదు.


గుజర్రా శిలాశాసనం

ఈ దినాలలో జంతువులను గానీ, చేపల్ని గానీ, ఏనుగులను గానీ చంపరాదు. నెలలోని పదిహేను రోజుల్లో ఎనిమిది, పధ్నాలుగు, పదిహేనవ దినాల్లో తిష్య, పునర్వసు, నక్షత్రాల్లో మూడు చతుర్మాస దినాలు, ఇంకా మిగతా పర్వదినాల్లో ఎద్దులకు వట్టకొట్టకూడదు. (వృషణములు తీసేయకూడదు) ఇంతకుముందే వృషణాలు తీసేయబడిన గొర్రెలు, పొట్టేళ్లు, పందులు మొదలైన వాటికి మళ్లీ వృషణాలు తీసేయకూడదు. తిష్య, పునర్వసు నక్షత్రాలలో చాతుర్మాస దినాలు, చాతుర్మాస అమావాస్య, పున్నమినాడు, గుర్రాలు, ఎద్దులకు ముద్ర (చురక) లు వేయరాదు.

నేను రాజ్యాభిషిక్తుడనైన ఇరవై ఆరు సంవత్సరాలలో 25 సార్లు కారాగారంలో ఉన్నవారికి అయుధాలను ఇవ్వటం జరిగింది.

## ఆరో స్థంభ శాసనం

దేవతలకు ప్రియుడైన రాజు ఈ విధంగా చెబుతున్నాడు: నేను రాజ్యాభిషిక్తుడనైన తరువాత 12వ సం॥లో ప్రజల హితం కోసం, సుఖం కోసం, ధర్మాభివృద్ధి కోసం, నా ఆదేశాలను అతిక్రమించకుండా ఈ ధమ్మలిపులను రాయించాను. 'ప్రజలకు హితం, సుఖం ఎలా చేకూరతాయి' అని ఆలోచిస్తూ నా బంధువులనే కాక, దగ్గర వున్నవారినీ, దూరంగా ఉన్నవారినీ, కూడా సుఖంగా ఉండేట్లు శ్రద్ధ వహించి నడచుకొంటున్నాను. సమాజంలోని అందరికీ ఈ విధంగా జరిగేట్లు శ్రద్ధ తీసుకొంటున్నాను. అన్ని మతాల వారినీ, వివిధ మర్యాదలతో గౌరవించాను. అయినా, ప్రజల్ని నేను స్వయంగా కలవటమే ముఖ్యమనుకొంటున్నాను.

## ఏడో స్థంభ శాసనం

దేవతలకు ప్రియుడైన రాజు ఇలా చెబుతున్నాడు : పూర్వకాలంలో రాజులు ధర్మాన్ని ఆచరిస్తూ ప్రజల్ని వృద్ధిలోకి రావాలని ఆశించారు. కానీ, దీనికి విరుద్ధంగా, ధర్మాన్ని ఆచరించక ప్రజలు వృద్ధిలోకి రాలేదు. ఈ విషయం మీద దేవతలకు ప్రియుడైన ప్రియదర్శి రాజు ఈ విధంగా చెప్పాడు. "పూర్వ కాలంలో రాజులు, ధర్మాన్ని ఆచరిస్తూ ప్రజలు వృద్ధిలోకి రావాలని కోరుకున్నట్లు నాకనిపిస్తుంది. కాని దీనికి విరుద్ధంగా, ధర్మాన్ని ఆచరించక ప్రజలు వృద్ధిలోకి రాలేక పోయారు. ఇప్పుడిక ఏ విధంగా ప్రజల్ని ధర్మాచరణకు పురికొల్పాలి? ఏ విధంగా ప్రజల్ని, ధర్మాచరణ ద్వారా వృద్ధిలోకి వచ్చేట్లు చేయాలి? ధర్మాన్ని ఆచరిస్తూ వారి ఉన్నతికి ఎలా పాటుపడగలను? దేవతలకు ప్రియుడైన ప్రియదర్శి రాజు ఈ విషయంగా ఇంకా ఇలా చెబుతున్నారు. "నేను ధర్మశాసనాలను వినిపించి, ధర్మంపై తగిన ఆదేశాల నివ్వాలని అనిపిస్తుంది. ప్రజలు వీటిని విని, ధర్మాన్ని అవలంబించి, ధర్మాభివృద్ధి ద్వారా వారంతట వారే వృద్ధిలోకి వస్తారు." ఇందుకోసమే ధర్మశాసనాలను వినిపించటమే కాక, వివిధ ధర్మాదేశాలనిచ్చాను. ప్రజల మధ్య పని చేస్తున్నవారు వాటిని చాటించి, ప్రజలకు వివరిస్తారు. వందల వేలమంది మధ్య పనిచేసే రజ్జుకులను కూడా ఆదేశించాను. "ధర్మం పట్ల అనురక్తి గలిగిన వారిని ప్రోత్సహించండి" అని ఆదేశించాను. దేవతలకు ప్రియుడైన రాజు ఇలా చెబుతున్నాడు. "ఈ విషయాన్ని గుర్తించే నేను ధర్మ స్థంభాలను నిలిపి, ధర్మ మహామాత్రలను నియమించి, ధర్మ శాసనాలను వినిపించాను."

దేవతలకు ప్రియుడైన ప్రియదర్శి రాజు ఇలా చెబుతున్నాడు: పశువులకు, మనుషులకు నీడనిచ్చేందుకు రోడ్లుపక్కన మర్రిచెట్లను నాటించాను. మామిడితోటలను పెంచాను. ఎనిమిది క్రోసులకు ఒకటి చొప్పున బావులు తవ్వించి, సత్రాలు కట్టించి, అనేకచోట్ల పశువులు, మనుషులు నీరు తాగటానికి చలివేంద్రాలను ఏర్పాటు చేశాను. అయితే ఇవన్నీ చెప్పుకోదగిన పనులు కావు. పూర్వపు రాజులందరూ, ప్రజలు సుఖ సంతోషాలతో ఉండేట్లు కృషి చేశారు. ఈ పనులన్నీ నేనెందుకు చేశానంటే, ప్రజలందరూ ధర్మాన్ని ఆచరిస్తారనే.

దేవతలకు ప్రియుడైన, ప్రియదర్శి రాజు ఈ విధంగా చెబుతున్నాడు: శ్రమణులు అన్ని మతాలకు చెందిన ప్రజలకు ఉపయోగపడే అనేక మంచి పనులు జేయటంలో నేను నియమించిన ధర్మ మహామాత్రులు మునిగి ఉన్నారు. భిక్షు సంఘాల వ్యవహారాలను కూడా చూడమని వారిని ఆదేశించాను. అలాగే, బ్రాహ్మణులు, ఆజీవికుల వ్యవహారాలను కూడా చూడమని మరికొందరు ధర్మమహామాత్రులను ఆదేశించాను. కొందరిని నిర్గ్రంధుల వ్యవహారాలను చూడమని ఆదేశించాను. నిజానికి వివిధ మతాల వ్యవహారాలను చూడటానికని మరికొందరు ధర్మ మహా మాత్రులను ఆదేశించాను. నా ధర్మమహామాత్రులు మాత్రం ఈ విషయాల్లోనే కాక, ఇతర వ్యవహారాలను కూడా చూస్తారు.

దేవతలకు ప్రియుడైన, ప్రియదర్శి రాజు ఈ విధంగా చెబుతున్నాడు: వీరు ఇంకా నాకు ముఖ్యులైన కొందరు, నేను, నా రాజులు ప్రకటించిన దానాలను పంచిపెడుతున్నారు. నా అంతఃపురంలోనూ, ఇక్కడా, ఇంకా నా అధీనంలో నున్న ఇతర రాష్ట్రాలలోనూ, అనేక ధార్మిక కార్యక్రమాలను వారు నిర్వహిస్తున్నారు. ధర్మాచరణకు, ధర్మవృద్ధికి నా కుమారులను, నా ఇతర రాజుల కుమారులను దానాలు చేయవలసిందిగా ఆజ్ఞాపించాను. దయ, దానం, సత్యం, పవిత్రత, మంచితనాల కలయిక అయిన ధర్మం ప్రజల్లో వృద్ధి చెందుగాక! ❃

రచయిత సెల్ : *98485 98446*

# ప్రపంచానికే ఆదర్శ పాలకుడు- అశోక చక్రవర్తి

-సవేరా

**కొం**దరు వారి వ్యక్తిగత ఆనందం కోసమే జీవించి కాలగర్భంలో కలిసిపోతారు. మరికొందరు వారి కుటుంబ సంక్షేమమే లక్ష్యంగా మనుగడ సాగించి మరుగున పడిపోతారు. అతి కొద్దిమంది మాత్రమే ప్రజాశ్రేయస్సే జీవితాశయంగా బ్రతికి చిరస్థాయిగా నిలిచిపోతారు. ఈ మూడవ శ్రేణికి చెందిన వ్యక్తి నాటికి నేటికి ఏనాటికీ గౌతమ బుద్ధుడే. అందుకే ఆయన ఆసియా ఖండపు అఖండ జ్యోతిగానే గాక సమస్త భూమండలానికి జ్ఞాన సూర్యుడుగా వెలుగొందుచున్నాడు.

ఆ తథాగతుని ధమ్మాకాశంలో ధృవతారగా భాసిస్తున్నవాడు అశోకుడు. అశోకుని ప్రాధాన్యత ఏమంటే బౌద్ధ చరిత్రలోనే కాక ప్రపంచ చరిత్రలో ఎప్పటికీ నిలిచి ఉండే వ్యక్తి. "అశోకుడు బౌద్ధమత పోషకుడే కాదు- యధార్థమైన ప్రవక్త" అన్న చరిత్రకారుడు బండార్కర్ అభిప్రాయం అక్షర సత్యం.

**జననం బాల్యం- పరిణయం-పట్టాభిషేకం:**

అశోకుని తాతగారు విశ్వవిఖ్యాత చక్రవర్తులలో ఒకడైన చంద్రగుప్త మౌర్యుడు. ఈయన నిష్టాగరిష్టుడైన జైనమతస్తుడు. చంద్రగుప్తమౌర్యుడు తన వృద్ధాప్యంలో ఉల్లేఖనతో... (ఉపవాసంతో ధ్యానంతో మరణించడం) జైనక్షేత్రమైన శ్రావణ బెళగొళలో నిర్యాణం చెందాడు.

తాతగారి జైనమత సిద్ధాంతం, తండ్రిగారి మానవీయ తాత్వికాదర్శం, తల్లిగారి అజీవాక విశ్వాసం ఇలా మూడురకాల నమ్మకాలు నేపథ్యం, మతస్వేచ్ఛ, సామరస్యాల నిలయమైన రాజప్రాసాదం సమీప భవిష్యత్తులోనే చండాశోకుడు ధమ్మాశోకుడుగా పరివర్తన చెందడానికి, మౌర్య సామ్రాజ్యాధిపతి బౌద్ధ మహాచక్రవర్తిగా వెలుగొందడానికి దోహదం చేసియుండవచ్చు.



దేవశెట్టి కుమార్తె దేవితో అశోకుని పరిణయం

బాల్యమాదిగా అన్ని విద్యలను శ్రద్ధాసక్తులతో అభ్యసించిన అశోకుడు తాతను మించే మనవడూ, తండ్రిని మరిపించే తనయుడు, కాగలడనే నమ్మకం కల్గించాడు. మగధ సామ్రాజ్య పాలిత - పాలకవర్గాలకు యువరాజుగానే తండ్రి బిందుసారుని ఆదేశం మేరకు తక్షశిలలో తిరుగుబాటును అణచివేయడమే గాక 'భాసా' ప్రాంతాన్ని జయించి రాజ్య విస్తరణకు తోడ్పడ్డాడు. అశోకుని యుద్ధ నైపుణ్యాన్ని, రాజనీతిజ్ఞతనూ మెచ్చుకొన్న బిందుసారుడు అతనిని అవంతికి వైశ్రాయిగా నియమించాడు.

అశోకుడు తన విజయోత్సాహంతో తిరిగి వస్తూ వేదిన ప్రాంతాధిపతియైన దేవశెట్టి ఇంట విడిది చేసాడు. అతని కుమార్తైయైన 'దేవి' ని ప్రేమించి పెండ్లి చేసుకున్నాడు. పాలించే రాజులకు ప్రేమించే హృదయమూ ఉంటుందని నిరూపించాడు. ఈ ఆదర్శ దంపతుల సంతతియే మహేంద్ర, సంఘమిత్రలు. అశోకుని దేవేరియైన దేవి రాణిగా అంతఃపుర రాజ భోగాలను ఆశించక జీవితకాలమంతా పుట్టినింటనే గడిపింది. ఈ మాతృమూర్తి నిరాడంబరతకు నిలువెత్తు నిదర్శనంగా ఆమె బిడ్డలైన మహేంద్ర సంఘమిత్రలు భిక్షుక జీవనంతో బౌద్ధధమ్మ వ్యాప్తికి అంకితం కావడం ఒక ఆదర్శయుత సాదృశ్యమే.

బహుభార్యత్వమొక రాజకీయ అవసరమైన ఆనాటి కాలంలో అశోకునికి ఐదుగురు భార్యలుండేవారు. వారిలో అసంధిమిత్ర మహారాణిగా, విశ్వాస పాత్రురాలైన ధర్మపత్నిగా మెలిగింది. ఆమె మరణానంతరం తిస్సారక్షిత మహారాణియై అశోకునికి తీవ్రమనస్తాపాన్నే మిగిల్చింది.

## రాజ్యాధికారం :

బిందుసారుడు మరణించే సమయానికి అశోకుడు ఉజ్జయినికి వైస్రాయిగా ఉన్నాడు. అప్పటికే ఒక యోధుడుగా, విజేతగా, ప్రతిభావంతుడుగా, పాలనాదక్షుడిగా అశోకుడు ప్రజల దృష్టిలో నిలిచియున్నాడు. రాజ్యాధికారం కోసం బిందుసారుని 101 మంది కుమారుల మధ్య (అశోకునితో సహా) భీకర యుద్ధం ప్రారంభమయింది. ఇది సుమారు 4 సంవత్సరాలు కొనసాగింది.

కౌరవ పాండవ కుటుంబ పోరులో నూరుగురు హతమైతే బిందుసారుని పుత్రబృందంలో 99మంది నేలకొరిగారు. సమర్థుడే నిలుస్తాడు (The fettest will survive) అన్నట్లు వీరుడైన అశోకుడు విజేతగా నిలిచాడు. క్రీ.పూ. 269లో మగధ సింహాసనాన్ని అధిష్టించాడు. అతనితో భుజం కలిపి పోరాడిన సోదరుడు తిష్యుడు సహ పాలకుడైనాడు.

## కళింగ యుద్ధం- పరివర్తన :

"ఏ దేశ చరిత్ర చూసినా, ఏ రాజు పాలన చేసినా యుద్ధ రహితం కాదు, ప్రజాహితమే ప్రధానం కాదు" - అనేది ఒక చారిత్రక సత్యం. 'రాజ్యం వీరభోజ్యం' అంటూ యుద్ధమూ, రాజభోగమే జీవిత లక్ష్యమైన పాలకులెవరైనా ప్రజాద్రోహులే.

"రాజ్యరక్షణ కోసమే యుద్ధం, ప్రజాహితం కోసమే పాలన" అనేది ప్రజాభిప్రాయం. అశోకుడు సింహాసనాన్ని అధిష్టించిన 12 వ ఏట క్రీ.పూ. 254లో తన సహజ రాజ్యకాంక్షతో గాని, తన సామ్రాజ్య ఏకీకరణ లక్ష్యంతో గాని కళింగపై దాడిచేసాడు. ఈ భయంకర యుద్ధంలో లక్షమంది సైనికుల మరణానికి కారకుడయ్యాడు. ఇందుకతడు చండాశోకుడుగా నిందించదగిన వాడే. అక్షరాలా అది ఘోరనేరమే. మానవేతిహాసంలో ఒక రక్తసిక్త అధ్యాయమే. అయితే అతి సాధారణంగా ప్రతి విజేత తన విజయాన్ని మరో ఘన విజయానికి సోపానంగా భావిస్తాడు. ఆక్రమిత రాజ్యాలతో తన సామ్రాజ్యం మహా సామ్రాజ్యం కావాలని ఆశిస్తాడు.

కాని కళింగ యుద్ధరంగంలో పడియున్న శవాల కుప్పలు, పారుతున్న నెత్తుటేరులు, క్షతగాత్రుల ఆర్తనాదాలు, వారి బంధుమిత్రుల హృదయ ఘోషలు అతని గుండెల్ని పిండినట్లయింది. అతనిలో మానవీయత మేల్కొంది.

అతని హృదయంలో పరివర్తన అంకురించింది. ప్రత్యణువునా పశ్చాత్తాపం ప్రతిధ్వనించింది. ఘోర క్రూర మారణ హోమానికి బదులు శాంతి అహింసలు ప్రాతిపదికలుగా గల బౌద్ధమే శరణ్యమని భావించాడు. కరుణ, ప్రజ్ఞ, శీలం, స్వేచ్ఛ, సమత, సమానత్వాలను ప్రబోధించిన బుద్ధుడే తనకు మార్గదాతయని విశ్వసించాడు. పూజ్య ఆచార్య ఉపగుప్తుని నుండి ధమ్మదీక్షను

స్వీకరించాడు. నెత్తురు తాగే ఖడ్గాన్ని విడిచి ధమ్మచక్రాన్ని ఆశ్రయించాడు.

రాజ్యాల దురాక్రమణదారుడే శాంతిప్రేమల ప్రబోధకుడైనాడు. యుద్ధ విజయానికి బదులు ధమ్మ విజయానికి అంకితమైనాడు. చండాశోకుడు ధమ్మాశోకుడైనాడు. ఇలా క్రొత్త జీవితాన్ని ప్రారంభించాడు చక్రవర్తి అశోకుడు.



యుద్ధరంగంలో చండాశోకుడు

**అశోకుని బౌద్ధ జీవనం :**

అశోకుడు బౌద్ధుడే కాలేదని కొందరు, అశోకుడు బౌద్ధాన్ని కాలానుగుణంగా మార్పులు చేసి, ఆకర్షణీయంగాను, ఉత్తేజపూరితం గాను రూపొందించాడని మరికొందరు అభిప్రాయపడ్డారు. కాని ఇవన్నీ చారిత్రకాధారాలు లేని ఊహాపోహలే.

అశోకుడు గౌతమ బుద్ధుడిని పలుసార్లు ప్రభువు (ది లార్డ్) అని గుండె గొంతులోంచి కీర్తించాడు. ఈ ధరణిపై బౌద్ధమే సరియైన ధర్మమని ఉద్ఘాటించాడు. రెండున్నర సంవత్సరాల పాటు ఉపాసక జీవితాన్ని గడిపి బుద్ధుడికి, ధమ్మానికి, సంఘానికి శరణు పొందాడు. సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రాలైన లుంబినీ, బుద్ధగయ, నిగలిసాగర్ మొదలగు ప్రదేశాలను భక్తిశ్రద్ధలతో సందర్శించాడు.

**బౌద్ధ ధమ్మపోషణ :**

రాజుల ప్రభుత్వాల పోషణ, సంపన్నుల ఆదరణ తోడైనప్పుడు ఏ మతమైనా ప్రచారంలో ముందుంటుంది. ఈ ప్రచారం ఆచరణకు దోహదపడుతుంది. ప్రపంచంలో బౌద్ధాన్ని స్వీకరించి, పోషించిన చక్రవర్తులలో అశోకుడు అగ్రగణ్యుడు. అతడు బౌద్ధ సంఘాలకు అన్ని సౌకర్యాలను సమకూర్చేందుకు చేతికి ఎముక లేకుండా విరాళాలిచ్చాడు. గౌతమబుద్ధుని జీవితకాలంలో ముఖ్య అనుచరులైన సారిపుత్ర, మొగ్గల్లాన, మహాకాశ్యప, ఆనందుడు మొదలగువారి సమాధులను, స్మారక కేంద్రాలను సందర్శించి వాటి సక్రమ నిర్వహణకు చర్యలు చేపట్టాడు. జంతువుల వేట వినోదయాత్రల స్థానంలో ధమ్మయాత్రలను ప్రోత్సహించాడు. ఇవి ప్రధానంగా ధర్మగురువులను సందర్శించి వారి నుండి ధర్మోపదేశాలను పొందడానికి, నిస్సహాయులైన వృద్ధులను సేవించి తరించడానికి ఉద్దేశింపబడినవి. ఇటువంటి ధార్మిక యాత్రలకు 156 రాత్రులు, తన విలువైన సమయాన్ని అశోకుడు వెచ్చించి ఆదర్శంగా నిలిచినట్లు చారిత్రక ఆధారాలున్నాయి.

**మూడవ బౌద్ధ (సంగీతి) సభ నిర్వహణ :**

ప్రశస్తమైన బౌద్ధధమ్మం పట్ల ప్రజలందరి సదవగాహన కోసం బుద్ధుని ప్రబోధాన్ని ప్రజల కందించే క్రమంలో తన రాజధాని నగరమైన పాటలీపుత్రలో మొగ్గలిపుత్త తిస్స నాయకత్వంలో మూడవ బౌద్ధ మహాసభ (సంగీతి) జయప్రదంగా నిర్వహింపజేసాడు. ఈ సభకు సుమారు వెయ్యిమంది బౌద్ధ భిక్షువులు హాజరైనారు.

దేశవిదేశాలకు మాన్య భిక్షువులను పంపించి బౌద్ధధమ్మాన్ని ప్రచారం చేయించాలని ఈ

మహాసభలో తీర్మానం చేయబడింది. దీని ప్రకారం అనేకమంది బౌద్ధ ప్రచారకులు వివిధ ప్రాంతాలకు నియమించబడ్డారు. అప్పుడే మన ఆంధ్రదేశంలోని అమరావతికి "మహాదేవ" అనే మతప్రచారకుడు విచ్చేసాడు. అమరావతిలో జగత్ప్రసిద్ధమైన మహాస్థూపాన్ని ప్రతిష్టించిన తర్వాత ఆయన శ్రీలంకలో స్థూపాల నిర్మాణానికి వెళ్ళాడు.

## స్థూపాలు- చైత్యాలు- విహారాలు- స్థంభాల నిర్మాణం :

అశోకుడు జ్ఞాన సూర్యుడైన బుద్ధుని ప్రసిద్ధ బోధనలను శిలాఫలకాలపైన, స్థంభాలపైన, స్థూపాలు, చైత్యాలు, విహారాలు, గుహలలోను చెక్కించాడు. ఇవన్నీ అప్పటికి ప్రాచుర్యంలోనున్న బ్రాహ్మీ, ప్రాకృతలిపులలో అక్షరీకరించబడ్డాయి. ఈ నిర్మాణాలు, చెక్కడాలు భారతీయ శిల్పకళకు, భవన నిర్మాణ నైపుణ్యతకు, బౌద్ధధమ్మ విశిష్టతకు చెరగని శిలాక్షర సాక్ష్యాలుగా వెలుగొందుతున్నాయి.

ఇలా శిలాక్షరాలుగా శాశ్వత రూపంలో సిద్ధపరచబడిన తథాగతుని ధమ్మప్రబోధం ప్రజల్ని మరింత ఆకర్షించి, చైతన్యపరచి, బౌద్ధులుగా మార్చినదనుటలో అతిశయోక్తిలేదు. ఒక్క అశోకుని కాలంలోనే మనదేశంలోని అనేక ప్రాంతాలలో 84 వేల బౌద్ధస్థూపాలు నిర్మించబడ్డాయి. ఇది నాటికి నేటికీ భవన- శిల్పకళా చరిత్రలో ఒక అద్భుత ప్రపంచ రికార్డుగా పేర్కొనవచ్చు.

అశోకుడు బుద్ధుని జన్మస్థలమైన లుంబినీని దర్శించి పూజార్హమైన ఆ గ్రామంలో పన్నులు రద్దు చేసినట్లు అక్కడ బయల్పడిన శాసనము (స్థంభంపై)ను బట్టి తెలుస్తోంది. హ్యూయాన్‌త్సాంగ్, పాహియాన్‌ల రచనలను బట్టి కూడా ఇక్కడ అనేక స్థూపాలు, చైత్యాలు, విహారాలు నెలకొల్పబడినట్లు వెల్లడౌతోంది.

మన జాతీయ చిహ్నమైన నాలుగు సింహాల శిల్పమూ, జాతీయ పతాకంలోని దమ్మచక్రమూ అశోకుడు సారనాథ్‌లో నిర్మించిన స్థంభం నుండే స్వీకరించబడ్డాయి. ధమ్మప్రచారం కోసం అశోకుడు వేయించిన శాసనాలు ఒరిస్సా, ఆంధ్ర, కర్నాటక ప్రాంతాలలో లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. మన రాష్ట్రంలో ఇప్పటికి బయల్పడిన సుమారు 300 బౌద్ధక్షేత్రాలలో అత్యధిక భాగం అశోకుని కాలం నాటివే. వీటిలో అమరావతి నుండి ఆదుర్రు దాకా, సారనాథ్ నుండి నందలూరు దాకా అన్నీ దర్శనీయ స్థలాలే. ప్రతీ క్షేత్రం, ప్రతీ శాసనం అశోకుని బౌద్ధసామ్రాజ్య విశిష్టతకి చెరగని అక్షరప్రభలే. వీటి నిర్మాణానికి విరాళాల నిచ్చిన వివిధ వర్గాలకు చెందిన దాతల జాబితాలు ఆనాటి ప్రజల బౌద్ధాభిమానానికి, ఆచరణకి తిరుగులేని ఆనవాళ్ళే.

ప్రజాహితమే తన అభిమతమైన అశోకుడు అస్తవ్యస్తంగానున్న న్యాయవ్యవస్థను, శిక్షాస్మృతిని సంస్కరించాడు. ఒకే రాజ్యం, ఒకే ప్రజ అన్న భావంతో తన రాజ్యమంతటా ఒకే విధమైన న్యాయ విధానాన్ని రూపొందించి ఆచరణలో పెట్టాడు. భిక్షువులలో కొందరు నిమ్న కులస్థులన్న చులకన భావంతో చూసిన యసుడనే మంత్రివర్యుని కులహంకారాన్ని తొలగించి సంస్కరించాడు. చంటి బిడ్డను సంరక్షణ నైపుణ్యం గల దాది(నర్సు)కి అప్పగించినట్లు తన ప్రజల సుఖసంతోషాల బాధ్యతను న్యాయాధికారులకు అప్పగించాడు.

## విదేశాలకు విస్తరించిన బౌద్ధం :

ప్రజాసంక్షేమానికి పనికివచ్చే విజ్ఞానమైనా, విశిష్ట ధర్మమైనా అది విశ్వవ్యాప్తం కావాలి. అందుకు వ్యక్తులు, సంస్థలు, ప్రభుత్వాలు త్యాగనిరతితో ముందుకు రావాలి. అశోకుడు వ్యక్తిగాను, చక్రవర్తిగాను తనదైన, అరుదైన త్యాగనిరతితో బౌద్ధధమ్మాన్ని, బౌద్ధసాహిత్య సంపదను సర్వ జగత్తుకి అందించిన మహనీయుడు. సామంతుడైనా తన బిడ్డ చక్రవర్తి కావాలనుకోవడం సర్వసాధారణం. కాని చక్రవర్తియే తన బిడ్డలిద్దరిని భిక్షు సంఘానికి సమర్పించడం అసాధారణం.

"సంతతి క్షేమానికన్నా సమాజ సంక్షేమమే మిన్న" అన్న సదాశయంతో అశోకుడు తన బిడ్డలైన మహేంద్ర, సంఘమిత్రలను శ్రీలంక (పూర్వపు సింహళం) దేశానికి ధమ్మ ప్రచారం కోసం బౌద్ధ భిక్షువులుగా పంపించాడు. ఈ అన్నాచెల్లెళ్ళ అనిర్వచనీయమైన కృషి ఫలితంగానే శ్రీలంక నేటికీ ఒకమేటి బౌద్ధదేశంగానే గాక బౌద్ధధార్మిక కేంద్రంగా, బౌద్ధసాహితీ నికేతనంగా విరాజిల్లుతోంది.

**బౌద్ధ సంఘాల ప్రక్షాళన :**

అశోకుడు నిబద్ధ బౌద్ధ చక్రవర్తిగా, వితరణ శీలిగా భిక్షుక సంఘాలకు అవసరమైన అన్ని సౌకర్యాలను అందుబాటులోకి తెచ్చి వారి ధార్మిక, సాంఘిక, సేవా కార్యక్రమాలకు వీలు కల్పించాడు. వీటితో విశుద్ధ భిక్షువులతో పాటు ధర్మ విరోధులు, పరాన్న భుక్కులు కూడా ఆకర్షితులైనారు. ఆషాఢభూతుల్లా అక్కడ తిష్టవేశారు. దీనితో భిక్షు సంఘంలో ఊహించరాని విధంగా క్రమశిక్షణ లోపించింది. ఈ అవాంఛనీయ పరిణామాల నుండి సంఘాన్ని ప్రక్షాళన చేసేందుకు అశోకుడు భిక్షువుల సాధారణ సమావేశాన్ని (సమోధమ్మ) ఏర్పాటు చేశాడు. తాను సాధించిన ధార్మిక జ్ఞానంతో ధమ్మ విరోధులైన భిక్షువులను సంఘం నుండి బహిష్కరించాడు. ఈ విధంగా భిక్షుసంఘం పరిశుద్ధమయింది.

**ఆదర్శ పాలన :**

"నేను భోజనం చేస్తున్నా, స్త్రీల సమక్షంలో ఉన్నా, శయ్యామందిరంలో ఉన్నా, ఉద్యానవనంలో ఉన్నా, అన్నివేళలా, అన్ని స్థలాలలో ప్రజల మేలుకోరే చర్యలు, సంప్రదింపుల కోసం ప్రభుత్వ ప్రతినిధులు నిరభ్యంతరంగా నన్ను దర్శించవచ్చు. నా ప్రజలందరి సంక్షేమం కోసం నేను అహర్నిశలు అవిశ్రాంతంగా పనిజేస్తాను" అని ప్రకటించి, ఆఖరిశ్వాస వరకు ఆచరించిన ఆదర్శ పాలకుడు అశోక సార్వభౌముడు. పాలితుల మాన ప్రాణాలను, సిరిసంపదలను కాపాడి ఈ ప్రపంచంలో భౌతికాభ్యున్నతిని సాధించడమే కాదు, వారి నైతిక స్థాయిని సమున్నతంగా పెంచి, వారికి ఆనందమయ జీవితాన్ని ప్రసాదించిన పాలనాదక్షుడు అశోకుడు.

"చంటి బిడ్డల సంరక్షణకు, సంతోషానికి ఒక నైపుణ్యం గల దాది (నర్సు) శ్రద్ధ వహించినట్లే నా రాజ్య ప్రజల సంక్షేమం కోసం నేను నియమించిన రాజప్రతినిధులు బాధ్యత వహిస్తారు" అన్న అశోకుని మాటల్లో ప్రజలపట్ల ఆయనకున్న పితృభావం ప్రస్ఫుటమౌతుంది. లైంగికానందాన్నిచ్చే మానవ యంత్రాలుగా చూడబడిన స్త్రీలు అశోకుని కాలంలో స్వేచ్ఛగా తత్వశాస్త్రాన్ని సైతం అధ్యయనం చేసే అవకాశాన్ని పొందగలిగారు.

అశోకుడు యోధులు మెచ్చిన మహాయోధుడే కాదు. రాజనీతి కోవిదులు మెచ్చిన రాజనీతిజ్ఞుడు; రోమన్ సామ్రాజ్యం కన్నా శక్తివంతమైన, సువిశాలమైన సామ్రాజ్యాధిపతియైనా రాజ్యవిస్తరణకు పాల్పడని శాంతిప్రియుడు అశోకుడు. "ఆయుధాలతో సాధించే విజయం కన్నా ధమ్మంతో సాధించే విజయమే నిజమైన విజయం" అని నమ్మిన దార్శనికుడు అశోకుడు. ధమ్మాశోకుని పాలనలో ఒక్క తిరుగుబాటు లేకుండా రాజ్యమంతటా శాంతి సమగ్రతా భావం విరాజిల్లడం చరిత్రకారులనే ఆశ్చర్య పరచిన విశేషం.

అశోకునికి ముందు దేశంలో పాలకుల నిరంకుశత్వం, ఆధిపత్యం, వర్గాల దోపిడీతత్వం, అట్టడుగు ప్రజల బానిసత్వం, అలవికాని అజ్ఞానాంధకారం వీటిన్నిటితో తిరోగమిస్తున్న విషాదమయ భారత చరిత్రలో 28 సంవత్సరాల సుదీర్ఘకాలం అత్యంత చైతన్యవంతంగా, శ్రేయోదాయకంగా సాగిన పాలనాకాలం ఒక్క అశోకుడిది మాత్రమే ననుట అతిశయోక్తి కాదు. అతని కాలంలో అధికార యంత్రాంగపు జులుంకి తెరదించబడింది.

"ప్రతి అంశం ధమ్మంతోనే రూపుదాల్చాలి, ధమ్మంతోనే నిర్వహించబడాలి; ధమ్మంతోనే

సాధించబడాలి; ధమ్మంతోనే అభివృద్ధి చెందాలి" అన్న ధమ్మాశోకుని విశిష్ట ఆశయ లక్ష్యాలు చాలావరకు విజయవంతమైనాయి.

"అహింస, ఆదరణ, శాంతి, సానుభూతి మొదలగు వాటితోనే మానవాళిని దుఃఖము నుండి, వేదనల నుండి విముక్తిచేసి, ఉద్ధరించగలం"– అని త్రికరణశుద్ధిగా విశ్వసించి, ఆచరించిన వ్యక్తి, ధార్మిక శక్తి ధమ్మాశోకచక్రవర్తి.

**ప్రజాహిత కార్యక్రమాలు :**

"నా రాజ్య ప్రజలంతా నా బిడ్డలతో సమానం. నా బిడ్డల క్షేమం నేను ఆశించినట్లే నా ప్రజలూ అన్ని విధాలా సుఖ శాంతులను పొందాలి" అన్న ఈ ఒక్క ఆదర్శం అశోకుని ప్రాచీన అధునిక ప్రపంచంలో అతిగొప్ప చక్రవర్తిగా నిలుపుతుందనుట నిర్వివాదాంశం.

**అసాధారణ వితరణ :**

అశోకుడు భిక్షు సంఘాలకు అత్యంత ఉన్నతంగా, ఉదారంగా సహకరించిన వివరాలను పాఠకులు కొంతవరకు గ్రహించి యుంటారు. అంతకుమించిన విశేషమేమిటంటే అశోకుడు తన తండ్రి వలెనే 60 వేల మంది శ్రమణులకు, బ్రాహ్మణులకు ప్రతిదినమూ భోజన సౌకర్యాన్ని సమకూర్చాడు.

**స్ఫూర్తిమంతమైన మతసహనం :**

మనిషి అభిమతమే మతం. మతం కోసం మనిషి కాదు– మనిషి కోసమే మతం. నీతిమంతమైన నడవడిని సుఖప్రదమైన మనుగడని నిర్దేశించేది మతం. కొందరు తన మతమే గొప్పదని భావించి అన్యమతాల పట్ల ద్వేషాన్ని పెంచుకొనేవారున్నారు. అలనాటి క్రూసేడుల నుండి ఈనాటి గుజరాత్ జినోసైడ్‌ల దాకా మత విద్వేషంతో నేలపై మనిషి నెత్తురింకని చోటు లేదంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

అయితే క్రీ.పూ. 3వ శతాబ్దిలోనే అశోకుడు మత సహనాన్ని పాటించిన మాన్యుడుగా అన్య మతాలను సైతం అభిమానించిన అసామాన్యుడుగా చరిత్ర సృష్టించాడు. మౌర్యసామ్రాజ్య రాజధానీ నగరమైన పాటలీపుత్ర రాజప్రాసాదం మూడు తరాలపాటు పలుమత విశ్వాసాల కూడలిగా ప్రసిద్ధి గాంచింది. ఈ మానవీయ మత నేపథ్యంతో పెరిగి పెద్దవాడైన అశోకుడు "పరమత సహనం ఒక మహోన్నత లక్షణం, అది మనిషి విశ్వాసానికి మరింత ఘనతను చేకూరుస్తుంది" అని విశ్లేషించి మతం వ్యక్తిగతమని నమ్మి, పరస్పరం గౌరవించుకొంటూ స్నేహభావం పరిమళించేలా, శాంతియుత సహజీవనం చెయ్యాలని అశోకుడు తన ప్రజలకు ఉద్బోధించాడు. తాను బౌద్ధమతానికి చెందినవాడైనా, ఆ మత వ్యాప్తికి అంకితమై పనిచేసినా వైదిక, జైన, మతాల పట్ల గౌరవాభిమానాలను చూపించి, భూరి విరాళాలను అందజేశాడు. అట్లే గయ దగ్గర గల గుహలను అజివికులకు కానుకగా ఇచ్చాడు. దీనిని బట్టి అక్బరు చక్రవర్తి కంటె 17 శతాబ్దాలకు పూర్వమే, ఏ రాజకీయ ప్రయోజనాన్ని ఆశించకుండా చిత్తశుద్ధితో మత సహనానికి ప్రతీకగా, స్ఫూర్తిమంతంగా విరాజిల్లిన చక్రవర్తి అశోకుడు.

**చరిత్రలో ఒక స్వర్ణయుగం :**

"చరిత్ర పుటల్లో నిలిచిపోయిన వేలాది చక్రవర్తుల పేర్ల మధ్య సర్వజన సమ్మతమైన సార్వభౌమాధికారంతో, రాచరికపు ఔన్నత్యంతో, మానవతా పరిమళాలతో, విశాల ప్రశాంతాకాశంలో చిరకాలం వెలిగేది అశోకుడు ఒక్కడే" అన్న సుప్రసిద్ధ చరిత్ర కారుడైన హెచ్.జి. వెల్స్ ప్రశంసొక్కటి చాలు అశోకుని పాలనాకాలం స్వర్ణయుగమని చెప్పడానికి. ఈ ప్రపంచంలో సర్వమానవాళినే కాదు, సకల ప్రాణికోటినీ తన విశాల దృష్టితో, దయార్ద్ర దృక్పథంతో

ప్రభావితం చేసిన, పరివేష్టించియున్న ఏకైక సార్వభౌముడు అశోకుడు మాత్రమే ప్రతివ్యక్తి జీవన సూత్రాలకు, సామాజిక ప్రవర్తనకు శాంతి, అహింస, ప్రజ్ఞ, కరుణ, సహనం, సదవగాహనలే పునాదియని నిర్వచించి, ఆచరించి ప్రచారం చేసి, ఫలితాన్ని రాబట్టిన ఒక వినూత్న తత్వవేత్త, ఒక విశిష్ట ప్రవక్త, ఒక మానవీయ రాజ్యాధినేత, ఒక విశ్వశాంతి స్ఫూర్తి ప్రదాత, ఒకే ఒక్కడు, అతడే అశోకుడు.

"ప్రపంచప్రఖ్యాత చక్రవర్తులైన అలెగ్జాండర్, చార్లిమేన్, కాన్‌స్టాంటైన్, సెయింట్‌పాల్ నెపోలియన్ వీరందరితో సరితూగే ఏకైక చక్రవర్తి అశోకుడు. రష్యాలోని ఓల్గా నదీతీరం నుండి జపాన్ దేశపు పసిఫిక్ మహాసముద్ర తీరం దాకా ఆయన ధార్మిక సిద్ధాంతాల సాక్షిగా, సాధించిన విజయాల సాక్షిగా ఆయన కీర్తిప్రతిష్టలు యధాతధంగా భాసిస్తూనే ఉన్నాయి" అన్న విజ్ఞుల నిశ్చితాభిప్రాయం ఒక నగ్నసత్యం. "అశోకుని కాలం నుండి బౌద్ధధమ్మ ఆచరణతో భారత జాతి విశిష్టత మరింతగా శోభిల్లింది" అన్న ప్రముఖ చరిత్రకారుడు డి.డి.కోశాంబి గారి కితాబు ప్రత్యక్ష నిదర్శనం. ❋

రచయిత సెల్ : *99497 51916*

*"భారతదేశ చరిత్రలో సమున్నత స్వాతంత్ర్యం, ఔన్నత్యం, వైభవం వెల్లివిరిసిన కాలం ఒకే ఒక్కటున్నది. అది మౌర్య సామ్రాజ్యం మహోజ్వలంగా వెలుగొందిన కాలం. మిగిలిన రాజ్యాల, రాజుల పాలనా కాలమంతా దేశం పరుల చేతిలో పరాజయాలతోను, పలు రంగాలలో గాఢాంధకారంలోనూ మ్రగ్గిపోయింది. అట్లే కొంతవరకు చాతుర్వర్ణ వ్యవస్థ నిర్మూలింపబడి, బహుజనులుగా నున్న శూద్రులు వారి స్వశక్తితో రాజ్యపాలకులైన కాలం మౌర్యుల పాలనా కాలంలో మాత్రమే"*

(డా॥అంబేడ్కర్ రచనలు-ప్రసంగాలు, సంపుటి-3)

## గుల్బర్గా ధమ్మయాత్ర

*2012 డిసెంబరు నెలలో కర్ణాటక రాష్ట్రంలోని 'గుల్బర్గా యాత్ర' జరుగును. దక్షిణ భారతదేశంలోనే అతిపెద్ద పాలరాతి బుద్ధవిహార సందర్శించుట. ఇది 70 ఎకరాల విస్తీర్ణంలో నిర్మించబడింది. ఈ యాత్రకు రాదలచినవారు మరిన్ని వివరాలకు సంప్రదించగలరు.*

*-**ఎన్.జగన్నాధం,** కార్యదర్శి, సంఘమిత్ర బుద్ధవిహార ట్రస్టు.*

*విశాఖపట్నం, సెల్ : 99489 80600*

## బుద్ధభూమి-సంవత్సర చందాలు

| | |
|---|---|
| **సిహెచ్.శ్రీనివాస్** గారి ద్వారా, పాల్వంచ | 16 చందాలు |
| **బొమ్మల కట్టయ్య** గారి ద్వారా, వరంగల్ | 14 చందాలు |
| **జి.నవీన్** గారి ద్వారా, విశాఖపట్నం | 10 చందాలు |
| **పి.రాంబాబు** గారి ద్వారా, రామచంద్రాపురం | 10 చందాలు |
| **జి.చిన్నస్వామి** గారి ద్వారా, తిరుపతి | 10 చందాలు |
| **ఎస్.కొండలరావు** గారి ద్వారా, పాడేరు | 10 చందాలు |
| **బళ్లా ధర్మరాజు** గారి ద్వారా, విశాఖపట్నం | 7 చందాలు |
| **గోలి మధు** గారి ద్వారా, మంగళగిరి | 3 చందాలు |

# ప్రజాసేవకు మార్గ నిర్దేశకుడు-అశోకుడు

-రేకా చంద్రశేఖరరావు

ఉపాధ్యాయుడు ఒక విద్యార్థిని అశోకుడ్ని గురించి చెప్పమనగానే ఆ విద్యార్థి ఒక్కక్షణం కూడా తడుముకోకుండా "అశోకుడు విశాలమయిన రోడ్లు వేయించెను, రోడ్లకు రెండువైపులా చెట్లు నాటించెను. గ్రామాలలో పెద్ద పెద్ద చెరువులను త్రవ్వించెను. గ్రామానికి గ్రామానికి మధ్యలో సత్రములు కట్టించెను. వాటి ప్రక్కన పెద్దబావులు త్రవ్వించెను" అని గడగడా వేమన పద్యం అప్పచెప్పినంత సులువుగా చెబుతాడు. అశోకునికి ముందుగానీ, ఆ తర్వాత గానీ ఏ ఒక్క చక్రవర్తి గురించి ఈ రకంగా ఏ విద్యార్థి చెప్పలేదు. అది ప్రజాసేవకుడయిన సమ్రాట్ అశోకుడి గొప్పతనం. అశోకుడు గురించి కాసేపు ఆగి తర్వాత మాట్లాడుకుందాం. కాసేపు మా ఊరి విషయానికి వద్దాం.

నేను మంగళగిరి వాసిని. నాకు 10, 15 సంవత్సరాల వయసులో అనగా 1965-1970లలో మా మంగళగిరి ఎలా వుండేదో చూద్దాం. మంగళగిరి వూరి పండుగలుగా చెప్పుకోదగినవి రెండు 1) తిరునాళ్ళు అంటే హోళీ నాడు వస్తుంది. 2) ముక్కోటి, వైకుంఠ ఏకాదశినాడు వస్తుంది. ఈ రెండు పండుగలకు తప్పనిసరిగా పిల్లలు, పెద్దలు అందరూ మంగళగిరి పానకాల రాయుడి గుడి దాకా కొండ ఎక్కేవారు. ఆ గుడి కొండకు పైన వుండేది. అక్కడి నుండి చూస్తే మంగళగిరి మొత్తం కనపడేది. మంగళగిరి గ్రామం మరియు ఊరి చుట్టూ పచ్చటి చెట్లు కనపడేవి. ఇళ్ళు కనపడేవి కావు. మంగళగిరి అంతా వేపచెట్లతో నిండి వుండేది. నాల్గువైపులూ చూస్తే దక్షిణాన ఎర్రచెరువు, నల్ల చెరువు, చిన కాకాని చెరువు, తూర్పున రత్నాల చెరువు, కుమ్మరి చెరువు, ఆత్మకూరు చెరువు, పడమర నవులూరు చెరువు కనపడేవి. అక్కడ ప్రతి చెరువుకూ ఒక కథ వుంది. ఆ విషయాలు ఇక్కడ సందర్భం కాదు గనుక చెప్పడం లేదు. మంగళగిరిలో దాదాపు ప్రతి ఇంటిలో చిన్నది కానీ, పెద్దది కానీ వేపచెట్టు వుండేది. పిల్లలు ఆ చెట్లు ఎక్కి దిగుతూ ఆటలు ఆడేవారు. పండిన వేప కాయలు తీపిగా, రుచిగా వుండటంతో పాటు ఆరోగ్యమని తినేవారు.

ఇంకా మంగళగిరి నుండి తాడేపల్లి వెళ్ళే జాతీయ రహదారి (ఇప్పుడు జాతీయ రహదారి బైపాస్‌గా మారింది) దానికి రెండు పక్కలా పెద్దపెద్ద చెట్లు వుండేవి. అలాగే మంగళగిరి-వడ్లపూడి మధ్యలో కూడా రోడ్డుకి ఇరువైపులా పెద్ద చెట్లు వుండేవి. ఇంకా మంగళగిరి-నిడమర్రు రోడ్డులో రైలుగేటు దాటిన తర్వాత నిడమర్రు వరకు పెద్ద పెద్ద చింతచెట్లు గుబురుగా ఎక్కడా ఖాళీ లేకుండా వుండేవి. ఈనాటికి కూడా నిడమర్రు రోడ్డులో మాత్రమే ఆ రకమయిన చెట్లు కొన్ని వున్నాయి. మిగతా అన్ని వైపులా పెద్దపెద్ద చెట్లను నరికివేశారు. వాటి స్థానంలో కొన్ని మొక్కలను నాటినప్పటికీ అవి వృక్షాలు మాత్రం కాలేవు. మంగళగిరి అన్నివైపులా వర్షాకాలంలో చెరువులు నిండి పొర్లుతూ వుండేవి. ఈనాడు ఒక్క చెరువు కూడా లేని దుస్థితిలో వుంది.

ఆనాడు మంగళగిరి దాదాపు ప్రతి ఇంటిలో- నూటికి 60 కుటుంబాలలో-మగ్గం నేయడం గానీ, చేనేతకు సంబంధించిన అనుబంధ పనులు గానీ జరిగేవి. ఉదయం 6 గంటల నుండి అన్ని రోడ్లు మొలలతో నిండి వుండేవి. (చేనేత పరిశ్రమలో చీర నేయడానికి ముందు మొల కట్టడం చాలా ముఖ్యమయిన పని) అందుకని లారీలు, కార్లు వంటివి 10 గంటల తర్వాతనే ఊరిలోకి వచ్చేవి. ఈనాడు ఆ పరిస్థితిలో పూర్తి మార్పు వచ్చింది. చేనేత వృత్తిదారులు 30 శాతం లోపే మిగిలారు. ఈనాటి విధ్వంసకర అభివృద్ధిలో భాగంగా మంగళగిరి కూడా తన

సహజ లక్షణాల్ని కోల్పోయింది. మంగళగిరి గాలిగోపురం- మంగళగిరి కొండ గనుక లేనట్లయితే 40 సంవత్సరాల క్రితం మంగళగిరి వదిలివెళ్ళిన వారు కూడా మంగళగిరిని పోల్చుకోవడం సాధ్యం కాదు. అందుకోసమో ఏమో కొంతమంది స్వార్థపర రాజకీయ వాదులు, ఇంకా 200 సంవత్సరాలు పైగా వుండగలిగిన గట్టిదనం గలిగిన గాలి గోపురాన్ని కూల్చి వేయాలని, నూతన గాలిగోపుర నిర్మాణం పేరుతో ప్రభుత్వ కాంట్రాక్టులు సంపాదించవచ్చని ప్రయత్నించారు. ఆ ప్రయత్నాలను హేతువాదులు, బుద్ధిస్టులు వ్యతిరేకించి "మంగళగిరి గాలిగోపుర పరిరక్షణ కమిటీని" ఏర్పరచి 'ఆసరా' సంస్థ సహాయ సహకారాలతో ఆందోళన నిర్వహించి, ప్రజల్ని చైతన్య పరిచి, గాలిగోపురాన్ని పడగొట్టకుండా కాపాడారు. ప్రాచీన కళా సంపదను, మంగళగిరి ఉనికికి నిదర్శనంగా వున్న గాలిగోపురాన్ని మంగళగిరి ప్రజలు ఆందోళన చేసి కాపాడుకోవడం ఇటీవల జరిగిన సంఘటన.

ఇదంతా చెప్పడం ఎందుకంటే?

మానవ సమాజ వికాసంతో ప్రజావసరాలు- పర్యావరణం మొదలయినవి నాగరికతగా- సంస్కృతిగా అభివృద్ధి చెందాయి. వాటిని మన ముత్తాతలు, వారి ముత్తాతలు... ముత్తాతలు కొనసాగించుకుంటూ వచ్చారు. అలాంటి సంస్కృతీ- నాగరికతా వికాసంలో అశోకుడి సేవలు చిరస్మరణీయం.

అశోకుడికి ముందు పాలనా పరంగా తమ అవసరాల కోసం రాజులు కొన్ని పనులు చేసి వుండవచ్చు. కానీ అశోకుడు పాలనాపరంగా చేయడంతో పాటు హృదయపూర్వకంగా, ప్రజాహితం కోరి అనేక గొప్ప పనులు చేశాడు. రాజ్యాధికారాన్ని నిలుపుకోవటానికి మాత్రమే రాజులు, చక్రవర్తులు అందరూ పాలన చేస్తే, అశోకుడు ఆ దృక్పథంతో కాకుండా బుద్ధుని బోధనల ప్రభావంతో- ప్రజలకు మేలు చేయాలనే లక్ష్యంతో ఎన్నో గొప్ప పనులు చేశాడు.

ఎప్పుడయితే అశోకుడు బౌద్ధాన్ని స్వీకరించాడో అప్పటి నుండి యుద్ధకాంక్షని త్యజించి, ప్రజాక్షేమం కోసం కృషి చేశాడు. అందులో భాగంగానే చాలా ముందుచూపుతో విశాలమయిన రోడ్లు నిర్మించాడు. ఆ రోడ్లకు రెండువైపులా బాటసారులు అలసట తెలియకుండా ప్రయాణించ డానికి, సేదదీరటానికి వీలుగా పెద్ద వృక్షాలను పెంచాడు. ఒక ఊరికి ఇంకో ఊరికి మధ్యలో ధర్మసత్రాలు కట్టించడం, మంచినీటి బావులు త్రవ్వించడం చేశాడు. బాటసారులకు ఆ సత్రాలు, బావులు ఎంతో ఉపయోగపడేవి. ప్రతి ఊరి చివరలో చెరువులను, కొన్ని వూర్లకు కలిపి సరస్సులను తవ్వించాడు. ఆ చెరువులు, సరస్సులలో వర్షపునీరుని నిల్వ వుంచి తాగునీటికి, సాగునీటికి వినియోగించేవారు. చెరువులు, సరస్సులను ఆసరాగా పశు, పక్ష్యాదులు, నీటి జీవులు బ్రతికేవి. వైద్యశాలలు, అక్షరాస్యత కోసం విద్యాలయాలు నిర్మించాడు. ఆనాడు బౌద్ధ విశ్వ విద్యాలయాల్లో విదేశాల నుంచి వేలాదిమంది విద్యార్థులు వచ్చి చదువుకునే వారు. ఆ విశ్వ విద్యాలయాలు వైద్యశాస్త్ర అభివృద్ధికి ఎంతో దోహదపడ్డాయి. ఇంకా ఆరామాలు, బౌద్ధ విహారాలను ఎంతో కళాత్మకంగా తీర్చిదిద్దాడు. తర్వాత కాలంలో ఆ ఆరామాలు, విహారాలను శైవ, వైష్ణవ ఆల యాలుగా హిందూ మతవాదులు మార్చుకున్నారు. కళలను, సంగీత, సాహిత్యాలను కూడా ఎంతో అభివృద్ధి చేసి బహుముఖంగా ప్రజాసేవ చేసినవాడు అశోకుడు. తర్వాత కాలంలో మంచి పరిపాలకులందరికీ అశోకుడు మార్గదర్శకుడయ్యాడు.

హర్షుడు, కనిష్కుడు మొదలయిన చక్రవర్తులు అశోకుని ఆదర్శంగా తీసుకొని కొనసాగారు. కనిష్కుడు నేటి ఆఫ్ఘనిస్తాన్‌లో ప్రపంచంలోనే అతి పెద్దదయిన బుద్ధ విగ్రహాన్ని నిర్మించాడు.

సహజసిద్ధంగా వున్న కొండను తొలిచి అద్భుతమైన బుద్ధ విగ్రహంగా మలిచాడు. తాలిబాన్ మతోన్మాదులు ఆ అద్భుత కళా ఖండాన్ని కూల్చివే యడం ఇటీవలి కాలపు విషాదం.



వ్యవసాయ సంస్కరణలకు పేరు గాంచిన షేర్షా చక్రవర్తిపై కూడా అశోకుని ప్రభావం ఎంతో వుంది. అక్బరు చక్రవర్తి కూడా అనేక సంస్క రణలు అశోకుని మార్గంలోనే చేశాడు. అక్బరు మత సహనానికి కూడా అశోకుడే మార్గదర్శకుడనడంలో అతిశయోక్తి లేదు.

తర్వాత కాలంలో మన తెలుగు నేలలో కాకతీయులు విశాలమైన, లోతైన చెరువులు, సరస్సులు త్రవ్వించి వ్యవసాయానికి పెద్ద పీట వేశారు. ఆ తర్వాత కాలంలో శ్రీకృష్ణదేవరాయలు ఆ వారసత్యాన్ని కొనసాగించాడు.

ఇంకా పాశ్చాత్యులు భారతదేశ చరిత్రను అధ్యయనం చేసి ఆధునిక కాలంలో- అశోకుని సంస్కరణల వంటివి- ముందుగా అన్వయించి పరిపాలనా సంస్కరణలు చేశారు. విద్య, వైద్యం- రహదారులు వంటి విషయాల్లో ఇంగ్లీషు- ఫ్రెంచి తదితర పాలకులకు భారత చరిత్ర అధ్యయనం ఎంతో ఉపయోగపడి వుంటుంది.

కానీ నేటి పాలకులు, ప్రభుత్వాలు చెట్టుకొమ్మ మీద కూర్చుని కొమ్మను నరుక్కున్న మూర్ఖుని లాగా మన పురాతన వారసత్వ సంపద అయిన చెరువులు, వృక్షాలను ధ్వంసం చేస్తున్నారు. చెరువులను ధ్వంసం చేసి, ఇళ్ళల్లో ఇంకుడు గుంటలకు అగచాట్లు పడుతున్నారు.

మన స్వయంకృతాపరాధం ఫలితంగా గ్రామాల సహజ సౌందర్యాన్ని నాశనం చేసుకున్నాం. పర్యావరణాన్ని ధ్వంసం చేసుకున్నాం. పట్టణాల్ని నగరాలుగా, మహానగరాలుగా మార్చుకుంటూ, క్రిక్కిరిసిన మహాజన సముద్రంగా మార్చుకుంటూ- కాంక్రీటు జంగిల్‌గా, మురికి కూపాలుగా, రోగగ్రస్త కేంద్రాలుగా మార్చుకుంటున్నాం. వాటి దుష్ఫలితాల్ని అనుభవిస్తూ వస్తున్నాం. అశోకుని ధర్మపాలనను మరిచిన ఫలితంగానే ఈ దుస్థితి దాపురించింది.

ఉన్నత సంస్కృతి- నాగరికతలను నిర్మించి మనకు అందించిన అశోకుని వంటి ప్రజా పాలకుని నుండి నేటి పాలకులు నేర్చుకోవాల్సింది ఎంతో వుంది. అశోకుని ధర్మ చక్రాన్ని జాతీయ జెండాలో పెట్టామని, నాలుగు సింహాలు మన జాతీయ చిహ్నాలని నేటి పాలకులు గొప్పలు చెప్పుకోవడం కాకుండా, నిజంగా అశోకుని స్ఫూర్తిని తీసుకోవాలి.

పర్యావరణాన్నీ -విద్య- వైద్యం- సంగీతం- సాహిత్యం- కళల్ని అశోకుడు కాపాడి పెంపొందించిన విధానాన్ని ప్రజలకు చేసిన సేవలను అధ్యయనం చేసి, అనుసరించగలిగితే సమాజానికి ఎంతో మేలు కలుగుతుంది. అశోకుడి సేవలను మార్గదర్శకంగా ప్రజలు ఆచరించాల్సినవి- పాలకులు ఆచరించాల్సినవి ఎన్నో వున్నాయి. అశోకుని చరిత్ర పరిశోధించి, అధ్యయనం చేసి దానిని సమగ్రంగా లోకానికి అందించడానికి అశోకుని పేరుమీద ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పాల్సిన అవసరం నేడు ఎంతైనా వుంది. ❋

రచయిత సెల్ : *90521 16161*

# అశోకుని శాసనాలు- ధమ్మలిపులు

-డా॥బెల్లంకొండ రమేశ్‌చంద్ర

అశోకుడు తాను నమ్మిన ధమ్మాన్ని ప్రజల సుఖశాంతుల కోసం దేశం నలుదిశల ధమ్మలిపులను చెక్కించాడు. అశోకుని శాసనాలు తూర్పున పుండ్రనగర్ (పాకిస్తాన్- బంగ్లాదేశ్) నుండి పడమట పురుషపురం (పెషావర్- పాకిస్తాన్) వరకు ఉత్తరాన కాశ్మీరం నుండి దక్షిణాన కర్నాటకం వరకు విస్తరించిన తన సామ్రాజ్యంలో పలుచోట్ల వేయించాడు. ఈ ధమ్మలిపులలో అశోకుడు తన ధమ్మాశయాలను, పాలనాశయాలను తనకు తానై వివరణాత్మకంగా పేర్కొన్నాడు. సమస్త భారతదేశ చరిత్రలో అశోకుని ముందు గాని, తరువాత గాని ఇంత విస్తృతంగా శాసనాలను వెలువరించిన వారు ప్రపంచ చరిత్రలోనే మరొకరు లేరు.

**భాష :** అశోకుని శాసనాలలో అత్యధిక శాసనాలు రాజధాని పాటలీపుత్రంలోని అధికార భాష అయిన పాళీ అని పిలువబడిన మాగధి ప్రాకృతంలోనే రచించబడ్డాయి తన రాజ్యంలో అంతర్భాగమైన ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతీయ భాషలైన అరమిక్, గ్రీక్ భాషలను ఉపయోగించాడు.

**లిపి :** అశోక సామ్రాజ్య వాయువ్య భాగంలో తప్ప మిగతా భారతదేశంలో శాసనాలన్నీ 'బ్రాహ్మీ' లిపిలో వ్రాయబడ్డాయి. పర్షియా సరిహద్దుల్లో ఉన్న శాసనాలు మాత్రం పర్షియన్, అరమైక్ భాషా సంబంధమైన 'ఖరోష్ఠి' లిపిలో వ్రాయటం జరిగింది. బ్రాహ్మీ లిపి మన ఇతర భారతీయ ప్రాంతీయ లిపుల లాగానే ఎడమ నుండి కుడికి వ్రాస్తారు. ఎంచేతంటే మన భారత ఉపఖండంలో ఉండే లిపులన్నింటికి బ్రాహ్మీలిపే మూలం. ఖరోష్టి లిపి మాత్రం అరబిక్ లిపి లాగా కుడి నుండి ఎడమకు వ్రాస్తారు.

కర్నాటకలోని బ్రాహ్మగిరిలో లభించిన లఘు శిలా శాసనమంతా బ్రాహ్మీ లిపిలో ఉండి, చివరి పంక్తి మాత్రం ఖరోష్ఠి లిపిలో వ్రాయడం విశేషం. దీన్ని రెండు లిపులలో ప్రావీణ్యత ఉందని తెలియజేయడానికి 'చపడ' అనే లిపికారుడు వ్రాశాడని అనుకోవచ్చు.

మన ఆంధ్రదేశంలోని కర్నూలు జిల్లా ఎర్రగుడి వద్ద లభించిన అశోకుని లఘు శాసనంలో కొన్ని పంక్తులు, బ్రాహ్మి లిపిలో కుడి నుండి ఎడమకు, ఎడమ నుండి కుడికి నాగేటి చాళ్ళను పోలినట్లు చెక్కారు. దీనినే బూలర్ మహాశయుడు వృషభాగతి (బూస్ట్రోఫెడాన్) పద్ధతి అని పేర్కొన్నాడు.



బుద్ధుని జన్మస్థలం లుంబినీలో
చెక్కించిన స్తంభశాసనం

క్రీ.శ. 1837 లో ఈస్ట్ ఇండియా కంపెనీ టంకసాల అధికారి ప్రాచ్య పండితుడు జేమ్స్ ప్రిన్సెప్ అశోక శాసనాలుగా గుర్తించాడు. ఆ పిమ్మట ఆ శాసనాల పూర్తి పాఠాల్ని అలెగ్జాండర్ కన్నింగ్‌హామ్, కీల్‌హన్, ఫ్లీట్, బూలర్ మొదలైన పాశ్చాత్య పండితులు ఎంతో కృషిచేశారు.

అశోకుని శాసనాలను స్థూలంగా రాతి శాసనాలు, గుహ శాసనాలు, స్తంభ శాసనాలుగా విభజించినప్పటికి రాతి శాసనాలను మరలా చిన్న శాసనాలు పెద్ద శాసనాలుగాను, స్తంభ శాసనాలు, చిన్న స్తంభ శాసనాలు, పెద్ద స్తంభ శాసనాలుగా

కూడా విభజించడం జరిగింది. చిన్న శాసనం ఉత్తర భారతదేశంలో సహస్రాం (బీహార్), అహ్రౌరియా (ఉత్తరప్రదేశ్), బైరాట్ (రాజస్తాన్), బహోపూర్ (ఢిల్లీ), రూపనాథ్ గుజ్జర్, పాంగురేలియా (మధ్యప్రదేశ్) లలో లభించగా, దక్షిణ భారతదేశంలో ఎర్రగుడి, రాజుల మందగిరి (ఆంధ్రప్రదేశ్) మాస్కి, నిట్టూరు, ఉదేగోళం, గాలిమఠం, పాల్కిగుండు, జతింగ రామేశ్వరం, సిద్ధపురం, బ్రహ్మగిరి, సన్నుతి (కర్నాటక) లలో వెలుగు చూశాయి.

గుజ్జర్, మాస్కి, నిట్టూరు, ఉదేగోళం శాసనాలలో మాత్రమే అశోకుని పేరు ప్రస్తావించ బడింది. మిగిలిన శాసనాలన్నింటిలో "దేవానాంప్రియ" 'ప్రియదర్శి' అనే పేర్కొనబడింది.

**చిన్న శిలా శాసనాల విషయం :**

మొదటి చిన్న శాసనంలో అశోకుడు బౌద్ధమతాన్ని తీసుకొన్న తరువాత రెండున్నరేండ్లు ధర్మానుసరణం, ధర్మవ్యాప్తికి కృషి చేయలేదని తరువాత సంఘాన్ని చేరి విశేషంగా కృషి సల్పినాడని, సమయం దొరికినప్పుడల్లా ధమ్మాన్ని శిలలపైన, శిలా స్తంభాలపైన చెక్కించాడని తెలుపబడింది. ఇక రెండో చిన్నశాసనంలో తల్లిదండ్రులకు సేవ చేయాలని, ప్రాణులన్నింటిని కాపాడాలని, గురువులను పూజించాలని, సత్యం పలకాలని, ఇట్లాంటి ధర్మ మార్గం దీర్ఘాయువు నిస్తుందని పేర్కొన్నాడు.

**పెద్దశిలా శాసనాలు :**

ఇవి మొత్తం 14. వీటి పాఠాల ప్రతులు, కొద్ది భేదాలతోనో, పూర్తిగానో, అసంపూర్తిగానో నాటి దేశంలోని షాబిజ్‌గడ్ (పెషావర్‌జిల్లా- పాకిస్తాన్) మన్సేహ్రా (హజారా జిల్లా -పాకిస్తాన్), కాల్సీ (డెహ్రాడూన్, ఉత్తరాఖండ్), గిర్నార్ (గుజరాత్), సోఫారా(మహారాష్ట్ర), దౌళి (పూరి జిల్లా ఒరిస్సా), జెగడ (గంజాం జిల్లా ఒరిస్సా), ఎర్రగుడి (ఆంధ్రప్రదేశ్)లలో లభించాయి. పైన పేర్కొన్న స్థలాల్లో షాబజ్‌గడ్, మన్సేహ్రాలలోని శాసనాలు ఖరోష్ఠి లిపిలోను, మిగిలిన స్థలాలలోని శాసనాలు బ్రాహ్మీ లిపిలో ఉన్నాయి.

**గుహశాసనాలు :**

బీహార్‌లోని బుద్ధగయ క్షేత్రానికి 25 కి.మీ దూరంలో వున్న బారాబర్ కొండగుట్టలలో అజీవక మత సన్యాసుల నివాసార్థమై అశోకుడు గుహలను తొలిపించిన విషయాన్ని అక్కడే ఉన్న మూడు శాసనాలు వివరణ ఇస్తున్నాయి.

**స్థంభశాసనాలు :**

అశోకుని శాసనాలన్నింటిలో పేర్కొనదగిన అద్భుత శిల్ప చాతుర్యం కిరీటంగా ఉన్న స్తంభ శాసనాలు. ఈ శాసనాలు ఏడు ఉన్నాయి. అవి ఢిల్లీ (మీరట్), లౌరియా అరరాజ్, లౌరియా నందన్‌ఘడ్, రాంపూర్వా (ఉత్తర బీహార్), అలహాబాద్ (ఉ.ప్రదేశ్), ఢిల్లీ (తోప్రా) స్తంభ శాసనాలు. తోప్రా శిలా స్థంభాన్ని యమునా నది ఒడ్డున ఉన్న తోప్రా నుండి ఫిరోజ్‌షా తుగ్లక్ ఢిల్లీకి మార్చాడు. అశోక శాసనాల్ని చదివి వివరించాల్సిందిగా తన ఆస్థాన పండితులను ప్రోత్సహించిన మొట్టమొదటి పరిశోధకుడుగా కీర్తి పొందాడు. తనకు తెలియకుండానే అశోకుని ప్రజా శ్రేయో సంస్కరణల్ని సుల్తాన్ ఫిరోజ్‌షా ప్రేమించాడు.

**స్థంభశాసనాల విషయం :**

రాతి శాసనాల మాదిరిగానే మొదటి స్థంభ శాసనం ధర్మాన్ని గురించి వివరించి, తన యావన్మంది ఉద్యోగులు ధర్మపరిపాలన చేయాలని అశోకుని ఆదేశాన్ని ప్రకటిస్తుంది. రెండో స్థంభశాసనం అశోకుడు తను ఆచరించిన ధర్మాన్ని ఉదాహరణలతో పేర్కొంటుంది. మూడో స్తంభశాసనం ఆత్మపరిశీలన అందరికి అత్యంత అవసరమని చెబుతుంది. రాజకీయ ఉద్యోగులలో,

ఉన్నతమైన రాజులలో ఏ విధంగా తమ ప్రవర్తన వల్ల, ధర్మోపదేశం వల్ల ధర్మవ్యాప్తికి కృషి చేయగలరో నాలుగో స్థంభశాసనం వెల్లడిస్తుంది. జీవహింసను, జంతువధను పరిమితం చేయడానికి అశోకుడు విధించిన చట్టపరమైన ఆంక్షలను అయిదో శాసనం వివరిస్తుంది. ఆరో శాసనం అశోకుడి ధర్మవాప్తికి చేస్తున్న శ్రద్ధను గురించి పేర్కొంటుంది. ఇక అశోకుడు ధర్మవాప్తికి చేసిన ప్రయత్నాలన్నింటిని గురించి తెలియజేస్తుంది.



**చిన్నస్థంభ శాసనాలు :**

ఇది అలహాబాద్ కోసం రాణీ స్తంభశాసనం, అలహాబాద్ కోశాంబి స్తంభశాసనం. సాంచీ (మధ్యప్రదేశ్), సారనాథ్ (ఉత్తరప్రదేశ్), రుమ్మిందై (నేపాల్), నిగలీసాగర్ (నేపాల్) స్తంభ శాసనాలున్నాయి. రాణి స్తంభ శాసనం అశోకుని ఆరు పెద్దశాసనాల తరువాత చెక్కబడింది. అశోకుని రెండో రాణి కౌరవాకి దానాలుగా ఇచ్చిన వనాలు, గుహలు ఆమె పేరనే గుణించాలని, అశోకుడే (దేవానాం ప్రియుడే) ఈ శాసనాన్ని వేయించాడు. ఇక లుంబినీదేవికి అపభ్రంశ రూపమే రుమ్మిందై. ఈ శాసనంలో బుద్ధుని జన్మస్థానమైన లుంబినీ వనంగా అశోకుడు గుర్తించి ప్రకటించడం, యాత్రా స్థలంగా స్థంభాన్ని స్థాపించి, ఇక్కడి ప్రజలు పన్నులు చెల్లించనవసరం లేదని, ఊరి ఫలసాయంలో ఎనిమిదో వంతు చెల్లించాలని శాసనం వేయించాడు.

అశోకుని స్తంభ శాసనం, చిన్న స్తంభశాసనాలు ఉత్తర భారతదేశానికే పరిమితమై ఉండటం గమనించదగ్గ విషయం. అదేవిధంగా రాతి శాసనాలు, చిన్న రాతి శాసనాలు తన సామ్రాజ్య సరిహద్దు ప్రాంతాలలో, రాష్ట్ర పాలనా కేంద్రాలలో చెక్కించడం కూడా గమనించాల్సిన విషయం. మన రాష్ట్రంలోని అమరావతిలో లభించిన అశోకునిదిగా భావిస్తున్న స్థంభశాసన శకలం పేర్కొనదగినది. దక్షిణ దేశంలో ఒక్క ఆంధ్రదేశంలోని స్థంభ శాసనం లభించడనం ఆలోచించదగ్గ విషయం.

అశోకుడు శాసనాలన్నీ రాష్ట్ర రాజధానులలోనో, జనసమ్మర్థంతో కూడిన పట్టణాలలోనో, యాత్రాస్థలాలలోనో, లేదా వాటి సమీపంలోనో, ప్రయాణ లేదా వ్యాపార రహదారుల ప్రక్కనో, కూడలి ప్రదేశాలలోనో ఏర్పాటు చేయబడ్డాయి ఈ శాసనాలను అశోకుడు రాజశాసనాలని కాకుండా ధర్మలిపులని, ధర్మశ్రవణాలని చాలా అర్థవంతంగా పేర్కొన్నాడు.

అశోకునికి ముందు రాజులెవరూ శాసనాలను చెక్కించలేదు. సింధూ నాగరికతా కాలం నాటి ముద్రికలపై నున్న సంకేతలిపి తరువాత సుమారు 1200 సంవత్సరాలకు అశోకుడు ధమ్మలిపులను చెక్కడానికి రాతిని ఉపయోగించి బ్రాహ్మీ లిపికి శాశ్వత తత్వాన్నిచ్చి భారత ఉపఖండ ప్రజలకు అక్షరాలను అందించి చరితార్థుడయ్యాడు.

రచయిత సెల్ : *94415 19781*

# బ్రాహ్మణ మత విజయం

*–డా॥ బి.ఆర్. అంబేడ్కర్*

**మ**గధ సామ్రాజ్యం ప్రారంభంలో చిన్నదే అయినా ఆ తర్వాత సమర్థులైన శిశునాగ వంశీయులు దాన్ని బాగా అభివృద్ధి చేశారు. ఈ వంశంలోని ఐదవ తరం వాడైన బింబిసారుని హయాంలో ఈ రాజ్యం సామ్రాజ్యమైంది; మగధ సామ్రాజ్యంగా పేరు ప్రఖ్యాతుల్ని పొందింది. శిశు నాగవంశీకుల పాలన క్రీ.పూ. 413 దాకా కొనసాగింది. ఆ సంవత్సరంలో శిశునాగవంశ చక్రవర్తి మహానందుడు మహా సాహసికుడైన నందుని చేతిలో మరణించాడు. నందుడు మగధ సింహాసనాన్ని ఆక్రమించి నంద వంశాన్ని స్థాపించాడు. నంద వంశం మగధ సామ్రాజ్యాన్ని క్రీ.పూ. 322 దాకా పరిపాలించింది. మౌర్య వంశ స్థాపకుడైన చంద్రగుప్తుడు చివరి నందరాజును పదవీచ్యుతుణ్ని కావించాడు. చంద్రగుప్తుడు సాధించిన విప్లవం వాస్తవంగా మగధ నాగ సామ్రాజ్య పునఃస్థాపన అవి చెప్పవచ్చును.

తమకు వారసత్వంగా సంక్రమించిన మగధ సామ్రాజ్య సరిహద్దులను మౌర్యులు తమ విజయాల వల్ల అధికంగా విస్తరించారు. అశోకుని (పరిపాలనా కాలంలో అతని) ఆధీనంలోని సామ్రాజ్యమెంత వృద్ధి పొందిందంటే ఆ సామ్రాజ్యం దానికున్న పేరుతో కాక మరో పేరుతో ప్రసిద్ధమైంది. అదే మౌర్య సామ్రాజ్యం లేదా అశోకుని రాజ్యంగా పేరు పొందింది. ఇక్కడి నుండి- రాత ప్రతిలో 4 నుండి 7దాకా ఉన్న పుటలు లభించలేదు. సం.

ఆనాడున్న అనేక మతాలలో ఒకటిగా అది వుండిపోలేదు. అశోకుడు దాన్ని రాజ్యమతంగా చేశాడు. ఇది బ్రాహ్మణ మతానికి తీవ్ర విఘాతమే. అశోక సామ్రాజ్యంలో బ్రాహ్మణులకు రాజ్యపోషణ కరువైంది. వారిని ద్వితీయ శ్రేణి పౌరులుగా చూడ్డంతో, తీవ్ర నిరాదరణకు గురయ్యారు. బ్రాహ్మణ మతంలో ప్రధానమైన జంతుబలుల నిషేధంతో బ్రాహ్మణుల అణచివేతకు శ్రీకారం చుట్టటం జరిగిందని చెప్పవచ్చు. యజ్ఞాచరణ వృత్తిని కూడా వారు కోల్పోయారు. ఈ యజ్ఞాలు తరచుగా చేయటం వల్ల కూడా బ్రాహ్మణులకు సంభావన బాగా ముట్టేది. కాబట్టి మౌర్య సామ్రాజ్యం అంతమయ్యేదాకా అంటే దాదాపు 140 సంవత్సరాల పాటు బ్రాహ్మణులు అణచివేతకు గురయిన వర్గాలుగా బ్రతికారు.

బౌద్ధ రాజ్యంపై తిరుగుబాటు ఒక్కటే పీడితులైన ఆ బ్రాహ్మణులకు మిగిలిన ఏకైక మోక్షమార్గం. మౌర్య పాలనపై తిరుగుబాటు జెండాను ఎగరవేయటానికి పుష్యమిత్రునకు ప్రత్యేక కారణముంది. పుష్యమిత్రుడు శుంగ గోత్రీకుడు. శుంగులు పశుబలులను, సోమయాగాలను చేసే సామవేది బ్రాహ్మణులు.

కాబట్టి అశోకుని శిలా శాసనంలో ప్రకటించిన విధంగా మౌర్య సామ్రాజ్యమంతటా జంతుబలుల నిషేధం వల్ల శుంగులు తీవ్రంగా బాధపడటం సహజం కూడా. సామవేది బ్రాహ్మణుడయిన పుష్యమిత్రుడు బ్రాహ్మణుల హీనస్థితికి మంగళం పాడాలని.

బ్రాహ్మణ మతాన్ని ఆచరించేటందుకుగాను వారికి స్వేచ్ఛను ప్రసాదించాలని ప్రథమంగా వాంఛించాడనటంలో ఆశ్చర్యం లేదు.

అప్పటిదాకా రాజ్యమతం హోదాలో ఉన్న బౌద్ధమతాన్ని నాశనం చేయటం, బ్రాహ్మణులను భారతదేశ సార్వభౌమ పరిపాలకులుగా రూపొందించటం పుష్యమిత్రుని రాజహత్యల లక్ష్యం. రాజ్య రాజకీయశక్తి వెనుకవుండగా బ్రాహ్మణ మతం బౌద్ధమతంపై విజయం సాధించగలుగు

తుంది. దీన్ని రెండు ఇతర పరిస్థితులు నిర్ధారిస్తున్నాయి.

మొదటిది పుష్యమిత్రుని ప్రవర్తనకు సంబంధించింది.

పుష్యమిత్రుడు సింహాసనం అధిష్టించిన తర్వాత అశ్వమేధ యజ్ఞం నిర్వహించాడనటానికి సాక్ష్యముంది. అశ్వమేధ యజ్ఞం సర్వోన్నత సార్వభౌముడు మాత్రమే నిర్వహించవలసిన వైదిక విధి. ఈ విషయంలో విన్సెంట్ స్మిత్ పరిశీలన ఇది.

బౌద్ధమత ప్రధాన లక్షణమైనటువంటిది. అశోకుని శాసనాలలో నిర్దేశింపబడునటువంటిది. అయిన జీవకారుణ్య పవిత్ర భావన- బ్రాహ్మణ ప్రభువులకు అత్యావశ్యకమైనటువంటిదీ మోక్షమార్గంగా సనాతన బ్రాహ్మణులు భావించేది అయిన జంతుబలి నిషేధానికి కారణమయింది. దీనికి వ్యతిరేకంగా బ్రాహ్మణులు ప్రతిస్పందన పుష్యమిత్రుని అశ్వమేధ యజ్ఞంతో తొలిసారి కన్పిస్తుంది. అదే 500 సంవత్సరాల తర్వాత తిరిగి సముద్రగుప్తుడు అతని వారసుల హయాంలో పరాకాష్టకు చేరింది.

సింహాసనాన్ని అధిరోహించిన తర్వాత పుష్యమిత్రుడు బౌద్ధ సన్యాసులకు వ్యతిరేకంగా అతడు వేయించిన దండోరా పట్ల అర్థమవుతుంది. ఒక్కో బౌద్ధ భిక్షువు తలకు 100 బంగారు నాణాలను వెలకట్టడం.

పుష్యమిత్రుని బౌద్ధమత వ్యతిరేకతకు పరాకాష్ట.

పుష్యమిత్రుని హయాంలోని బౌద్ధ మతస్థుల (పై జరిగిన) హింసను గూర్చి తెలుపుతూ డాక్టర్ హరిప్రసాద్ శాస్త్రిగారు ఈ విధంగా పేర్కొన్నారు.

"ఛాందసులు, పరమత సహనం లేనివారు అయిన శుంగుల సామ్రాజ్య పాలనలో బౌద్ధ మతస్తుల స్థితి ఎలా వుండేదో ఊహించుకోవచ్చు. చాలామంది బౌద్ధ భిక్షువులు ఇప్పటికీ పుష్యమిత్రులంటే చాలు మండిపడతారు. తిట్టడానికి తప్ప ఆ పేరు ఉచ్చరించరనేది చైనా పండితుల వల్ల తెలిసింది." ❊

*-డా॥ బాబాసాహెబ్ రచనలు- ప్రసంగాల నుండి.*



1956 అక్టోబరు 14న అంబేద్కర్ నాగపూర్‌లో బౌద్ధధమ్మం స్వీకరించిన ప్రాంతంలో నిర్మించిన నాగలోక్ బుద్ధవిహార.

సారనాథ్ యాత్ర

# బౌద్ధం సింహంలా సాగిపోవాలి

-బేబీ శ్రీశ్రీ బొర్రా

నేను ఆరవ తరగతి చదువుతున్నప్పుడు దసరా సెలవలలో మేము సారనాథ్ వెళ్ళాం. నేను, అమ్మ, నాన్న అమ్ములు, బావ వెళ్ళాం. మాతో పాటు రేపల్లె కృష్ణ అంకుల్ కూడా వచ్చారు. మేము ట్రైన్‌లో వెళ్ళాం. మా రిజర్వేషన్ అప్పటికి వెయిటింగ్ లిస్ట్‌లో ఉంది. ట్రైన్ ఏమో చాలా రద్దీగా కాలు పెట్టడానికి కూడా ఖాళీ లేకుండా ఉంది. మా ఇంటి ప్రక్క వేణు అంకుల్ రైల్వేలో టి.సి.గా పనిచేస్తున్నారు. ఆ అంకుల్ మాకు బలార్షా దాకా రిజర్వేషన్ చేయించారు. మేము ఎస్-4 లో ఎక్కాం కానీ, అంకుల్ రిజర్వు చేయించింది ఎస్-7 లో మేము వెళ్ళడానికి దాదాపు రెండు గంటలు పట్టింది. వెళ్ళే దారిలో అమ్ములు చేతిలో బ్యాగ్ తెగిపోయింది. ఆ ఇరుకులో బ్యాగ్ తెగిపోయేసరికి దానిని మొయ్యలేక అమ్ములుకి చాలా కోపం వచ్చింది. మాకేమో నవ్వు వచ్చింది. బలార్షా తరువాత చాలా దూరం తెల్లవార్లు నుంచొనే వెళ్ళాం. ఆ మరునాడు ఉదయం పది గంటల సమయానికి మొగల్ సరాయ్‌లో దిగాం. అక్కడి నుండి ఆటోలో సారనాథ్ వెళ్ళాం.

మేము అక్కడికి వెళ్ళేసరికి మాకు వీరనారాయణ రెడ్డి తాతయ్య, ఆంజనేయరెడ్డి తాతయ్య గార్లు ఫోన్ చేసి రూమ్స్ బుక్ చేయించారు. ఆ రూమ్స్ శ్రీలంక విహారం మహాబోధి సొసైటీ వాళ్ళవి. మేము వెళ్ళి కొంతసేపు విశ్రాంతి తీసుకొని స్నానాలు చేసి తెచ్చుకొన్న చపాతీలు తిన్నాం. ఆ ఆరామంలో శ్రీలంక వాళ్ళు దాదాపు వందమంది దాకా ఉన్నారు. వాళ్ళు కూడా సారనాథ్ చూడడానికి అంతకు ముందురోజే వచ్చారట.

ఇక మేము చూడడానికి బయలుదేరాం. మొదటగా మేము అక్కడ ఉన్న బౌద్ధారామానికి వెళ్ళాం. సారనాథ్ ప్రత్యేకత ఏమిటంటే బుద్ధుడు మొదటసారిగా తన జ్ఞానోదయాన్ని తన ఐదుగురు స్నేహితులకు బోధించారు. ఆ స్నేహితులే తరువాత బుద్ధుని మొదటి శిష్యులుగా మారారు. ఆ ఆరామంలో బుద్ధుడు అయిదుగురు శిష్యుల విగ్రహాలు ఉన్నవి. అవి పెద్దగా ఉన్నవి. ఇక అక్కడే బుద్ధుని 27 మంది శిష్యులు విగ్రహాలు కూడా చిన్నవిగా, వారి పేర్లతో ఉన్నవి. అక్కడ ఒక పెద్ద రావి చెట్టు కూడా ఉంది. ఆరామం లోపలి బుద్ధుని జీవిత చరిత్రను చిత్రీకరించారు. అది కూడా చాలా బాగా నచ్చింది. ఆ ఆరామానికి పక్కనే సారస పక్షుల కొలను ఉంది. అక్కడ కొన్ని సారస పక్షులు ఉన్నాయి. చాలా పెద్దగా మెడ క్రింద ఎర్రగా అందంగా ఉన్నవి. ఆ పక్షుల వలనే ఆ ఊరికి సారనాథ్ అనే పేరు వచ్చిందిట. మొదట ఆ ఊరు మృగదావనంగా పిలవబడేది అట. మృగదావనం అంటే జింకల వనం. ఇప్పటికి కూడా అక్కడ జింకలు ఉన్నాయి. అక్కడ జింకలకు పెట్టడానికి కీరదోస కాయలను అమ్ముతున్నారు. వాటిని కొని జింకలకు తినిపించాము.

దాని తరువాత సారనాథ్‌లో ప్రత్యేకమైన స్తూపం దగ్గరకు వచ్చాం. అది అశోకుడు కట్టించిన స్తూపం. నేను అదే మొదటిసారిగా అంత పెద్ద స్థూపాన్ని చూడడం. ఇంతవరకు చూసిన వాటికంటే ఎంతో పెద్దగా కనిపించింది. దాని చుట్టూ చిన్న చిన్న స్తూపాలు చాలానే ఉన్నవి. మేము వెళ్ళిన సమయానికే శ్రీలంక వాళ్ళు కూడా అక్కడకు వచ్చారు. ఇంకా జర్మనీ, చెక్‌దేశం, హంగరీ దేశాల వారు కూడా ఉన్నారు. వాళ్ళు ధ్యానం చేస్తున్నారు. మేము కూడా కొంతసేపు వాళ్ళ పక్కన కూర్చొని ధ్యానం చేశాం. ఆ స్తూపం ఎత్తు 61 మీటర్లట. ఇక అక్కడే అశోక స్తంభం వుంది. అది మామూలుగా అయితే కింద వృత్తాకారంలో పెద్ద పీఠం, దాని మీద పెద్ద స్తంభం నాలుగు సింహాలు (capital) దానిపైన అశోక స్తంభం ఉంది. అది కూడా ఐదు

ముక్కలుగా ఉంది. ఏమిటా అని అక్కడ వాళ్ళను అడిగితే మిగతావి పక్కనే ఉన్న మ్యూజియంలో భద్రపరిచారు అని చెప్పారు.

ఇక మేము మ్యూజియంకి వెళ్ళాం. వెళ్ళడం వెళ్ళడం ద్వారంకి ఎదురుగానే నాలుగు సింహాల భాగం ఉంది. ఎంతో పెద్దగా ఉంది. నల్లగా, నిగనిగలాడుతూ ఉంది. ఒక్కొక్క సింహం కింద ఒక్కొక్క జంతువు బొమ్మ ఉంది. వాటిని గొప్ప జంతువులు అంటారు. అవి ఏనుగు, ఎద్దు, సింహం, గుర్రం. అప్పుడు నాన్నకి ఒక అనుమానం వచ్చింది. అది ఏమిటి అంటే అస్సలు ఆ స్తంభానికి తూర్పు ఎటు మరియు ఏ ఏ దిక్కు ఏమిటి అని. అక్కడ వాళ్ళని అడిగితే ఎవరికీ తెలియదు అన్నారు. అక్కడి వాచ్‌మెన్ వచ్చి ఒక ఆయనకు తెలుసు ఆయన కొంత సేపటిలో వస్తారు అని చెప్పారు. ఆయన వచ్చి అప్పుడు చెప్పారు. దక్షిణాన ఏనుగు, ఉత్తరాన అశ్వం, తూర్పున సింహం. మరియు పశ్చిమాన ఎద్దు అని, ఆ స్తంభానికి దిక్కులు చెప్పారు.



సారనాథ్‌లోని గంధకుటి బుద్ధవిహార్ వద్ద బాల రచయిత్రి బేబీ శ్రీశ్రీ

ఇక మ్యూజియం చూద్దామని బయలుదేరాం. అక్కడున్న స్తంభంపైన అశోక చక్రం ఉంది. దానిలో చాలా భాగం లేదు. కొన్ని ముక్కలు పెట్టి అమర్చారు. నేను సారనాథ్‌లోని అశోక స్తంభం గురించి చదవడమే గానీ ఎప్పుడూ చూడలేదు. మొదటిసారిగా చూడడంతో చాలా సంతోషం అనిపించింది. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత అశోక చక్రాన్ని జాతీయ జెండాలో ధర్మ చక్రంగా, నాలుగు సింహాలను రాజముద్రగా తీసుకొన్నారు. అప్పటినుండి నాణేల మీద, నోట్లమీద వీటిని ముద్రిస్తున్నారు. నాలుగు సింహాలకు అర్థం ఏమిటంటే బౌద్ధం సింహం లాగా ప్రపంచ నలుమూలలకు సాగిపోవాలని అశోకుడి భావం. లుంబినీ, కుశీనగర్‌లో లాగా చాలా దేశాల ఆరామాలు అక్కడ లేవు. చైనావారి ఆరామం కూడా చాలా మామూలుగానే ఉంది. ఓ నాలుగైదు ఆరామాలు ఒక 'జైన' ఆరామం చూశాం. ఇక రాత్రికి మహాబోధి సొసైటీలోనే ఉండి ఉదయాన్నే బుద్ధగయకు బయలుదేరాం. ❋

–సెల్ : *93906 00157* పి.పి.

# అశోక దేవానాంప్రియా!

-రేకా నాగమల్లేశ్వరరావు

అశోక దేవానాం ప్రియా
ఘనత చరిత నీదేనయా
బుద్ధుని సూక్తులు వ్యాప్తం చేసిన
నిరుపమాన సుగుణామయా ॥అశోక॥

కళింగరణము మనసు మార్చగా
కరుణమూర్తివై వెలిగావు
మానవులంతా సమానమంటూ
ధమ్మపథం చేపట్టావు ॥అశోక॥

రక్తపాతము రాజ్యకాంక్షలు
మనుజుల దనుజుల చేయునని
నరజాతికి ఇటుల కూడదని
అనుభవమ్ముతో పలికినావు ॥అశోక॥

మన భరతపతాకకు వన్నె తెచ్చు
ఆ ధర్మచక్రము నీదె కదా
నాల్గుసింగములె నాల్గు దిక్కులకు
దేశరక్షణకు దిక్సూచి నీవె కదా ॥అశోక॥

రచయిత సెల్ : 92925 01299

# వార్తాపత్రికల రూపశిల్పి అశోకుడు

రాజ్యం అనే వ్యవస్థ నాలుగు స్థంభాల మీద నిలబడే ఒక భవనం లాంటిది. మొదటిది శాసన వ్యవస్థ. రెండోది న్యాయవ్యవస్థ. మూడోది రక్షణ వ్యవస్థ. కాగా..నాలుగోది పత్రికా వ్యవస్థ. పరిపాలనా వ్యవస్థ సక్రమంగా సాగాలంటే ఈ నాలుగు రంగాలూ నాలుగు మూలస్థంభాలే. పాలకులు రాజ్య రాజధానిలో వుంటారు. వారికి స్థానిక ప్రజల కష్టసుఖాలు ప్రత్యక్షంగా తెలుసుకునే అవకాశం వుండదు. కాబట్టి వారు ఆయా ప్రాంతాల అధికారులు ఇచ్చే సమాచారాన్ని బట్టి తమ పాలన కొనసాగిస్తుంటారు. ఒక్కోసారి అధికారులిచ్చే సమాచారం అంత నిజాయితీగా వుండదు. వాళ్ళు తమ తప్పిదాల్ని కప్పిపుచ్చి తప్పుడు సమాచారాన్ని ప్రభువులకు ఇచ్చే అవకాశం వుంటుంది. అందుచేత పాలన సరిగా వుండదు. ఈ పొరపాటు సవరించాలనే తలంపు సమ్రాట్ అశోకునికి కలిగింది. ప్రభుత్వాధికారులిచ్చే సమాచారం మీదే ఆయన ఆధారపడకుండా ఒక ప్రత్యేక సమాచార విభాగాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఈ సమాచార సేకరణ చేసే వ్యక్తులు ఆయా ప్రాంతాల్లోని సమస్యల్ని ఒక లిఖిత పత్రం రూపంగా అశోకునికి సమర్పించేవారు. ప్రజల అవసరాలకి సంబంధించిన వార్తల్ని సేకరించి వాటిని అశోకునికి ఒక పత్రిక రూపంగా అందించేవారు. అలాగే..ఆయా ప్రాంతాల సమాచారం రాజధానిలో అందరికీ అందాలని తన దర్బారు బైట సమాచారాన్ని రాయించేవాడు. ఇలా ఒక ప్రాంతం విశేషాల్ని మరో ప్రాంతానికి అందేలా చూశాడు. వార్తాపత్రికలకు తొలిరూపం ఇచ్చిన వ్యక్తిగా అశోకుడు చరిత్రలో నిలిచాడు.

నేడు మనకు అక్కడక్కడ కొన్ని నీతి వాక్యాలు కనిపిస్తుంటాయి. ఆ నీతి వాక్యాలకు అశోకుని శిలాశాసనాలే మూలం. అలాగే కొన్ని విద్యాసంస్థలు రోజువారీ వార్తావిశేషాలను పాఠశాల బైట బ్లాక్ బోర్డులపై వ్రాయటం మనం చూస్తుంటాము. ఇలాంటి గోడపత్రికలకు కూడా అశోకుడే మూలపురుషుడు కావటం విశేషం.

సేకరణ : **బుద్ధభూమి బృందం**

# అశోకుడంటే....



* అశోకుడంటే భారతదేశపు ఆత్మ
* అశోకుడంటే భారతదేశపు శోభ
* అశోకుడంటే భారతదేశపు మకుటం
* అశోకుడంటే ధర్మభేరి మ్రోగించినవాడు
* అశోకుడంటే ధర్మశంఖం పూరించినవాడు
* అశోకుడంటే అస్పృశ్యతను ఖండించినవాడు
* అశోకుడంటే ప్రజల హృదయాలు గెలిచినవాడు
* అశోకుడంటే దాన ప్రాధాన్యత గ్రహించినవాడు
* అశోకుడంటే శిరచ్ఛేద శిక్షలను రద్దు చేసినవాడు
* అశోకుడంటే దాన రుచి అనుభూతి పొందినవాడు
* అశోకుడంటే తన తప్పు తాను తెలుసుకున్నవాడు
* అశోకుడంటే తన తప్పు తాను సరిదిద్దుకున్నవాడు
* అశోకుడంటే కుల అంతరాలను నిరసించినవాడు
* అశోకుడంటే భారతదేశ కీర్తిపతాకగా నిలిచినవాడు
* అశోకుడంటే దేవానాం ప్రియగా పేరుగాంచినవాడు
* అశోకుడంటే కళింగ యుద్ధంతో కళ్లు తెరిచినవాడు
* అశోకుడంటే బుద్ధజ్యోతిని లోకానికి అందించినవాడు
* అశోకుడంటే సర్వమానవ సమానతను చాటినవాడు
* అశోకుడంటే బోధివృక్షాన్ని శ్రీలంకకు పంపినవాడు
* అశోకుడంటే మూడవ బౌద్ధ సంగీతి జరిపించినవాడు
* అశోకుడంటే ధర్మ పరిమళాలు దశదిశలా వెదజల్లినవాడు
* అశోకుడంటే ప్రపంచ మేధావుల ప్రశంసలు పొందినవాడు
* అశోకుడంటే కత్తి కంటే కరుణ గొప్పదని తెలుసుకున్నవాడు
* అశోకుడంటే అంధ విశ్వాసాలు ప్రబలకుండా చూసినవాడు
* అశోకుడంటే గొప్ప పరిపాలనా దక్షుడుగా కీర్తి గాంచినవాడు
* అశోకుడంటే భారతావనిలో ధర్మగంగ ప్రవహింప జేసినవాడు
* అశోకుడంటే దేవతలకు ప్రియమైన వాడిగా కీర్తించబడినవాడు
* అశోకుడంటే నేటి పాలకులకు సైతం ఆదర్శ పాలన చేసినవాడు
* అశోకుడంటే ప్రపంచ చక్రవర్తుల మధ్య దివ్యతేజమై వెలుగువాడు
* అశోకుడంటే భారత జాతీయ జెండాలో ధర్మచక్రమై వెలుగువాడు
* అశోకుడంటే భారతదేశ చరిత్రలో నెంబర్‌వన్ హీరోగా నిలిచినవాడు
* అశోకుడంటే ప్రపంచ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడినవాడు
* అశోకుడంటే భారతావనికి ఎనలేని కీర్తి ప్రతిష్టలు ఆర్జించిపెట్టినవాడు
* అశోకుడంటే భిక్షువుల పాదాలకు శిరస్సు ఆనించి నమస్కరించినవాడు
* అశోకుడంటే అందరూ విద్యావంతులు కావడానికి అవకాశం కల్పించినవాడు



* అశోకుడంటే భారతదేశపు గౌరవం
* అశోకుడంటే భారతదేశపు ధర్మరత్నం
* అశోకుడంటే మతసామరస్యానికి ప్రతీక
* అశోకుడంటే పంచశీల పాటించినవాడు
* అశోకుడంటే ధర్మచక్రవర్తిగా భాసిల్లినవాడు
* అశోకుడంటే ధర్మసత్రాలను కట్టించినవాడు
* అశోకుడంటే త్రిరత్నాలను శరణువేడినవాడు
* అశోకుడంటే మద్యపానాన్ని నిషేధించినవాడు
* అశోకుడంటే యజ్ఞబలులు చేయవలదన్నవాడు
* అశోకుడంటే ధర్మాసుపత్రులను కట్టించినవాడు
* అశోకుడంటే ధర్మసామ్రాజ్యం స్థాపించినవాడు
* అశోకుడంటే కపట భిక్షువులను ఏరిపారేసిన వాడు
* అశోకుడంటే చెరువులు, బావులు, తవ్వించినవాడు
* అశోకుడంటే నిత్యం బోధివృక్షాన్ని ఆరాధించిన వాడు
* అశోకుడంటే పెద్ద పెద్ద రహదారులు వేయించినవాడు
* అశోకుడంటే దేశ దేశాలకు ధర్మాన్ని వ్యాప్తి చేసినవాడు
* అశోకుడంటే సత్యాహింసల పాలనకు ఆదర్శప్రాయుడు
* అశోకుడంటే కష్ట కాలంలో సైతం ధర్మాన్ని వీడనివాడు
* అశోకుడంటే రహదారుల ప్రక్కన చెట్లు నాటించినవాడు
* అశోకుడంటే 84 వేల బౌద్ధ స్థూపాలను నిర్మించినవాడు
* అశోకుడంటే ధర్మాన్ని నాలుగు పాదాల నడిపించినవాడు
* అశోకుడంటే కన్నబిడ్డలను సంఘానికి దానం చేసినవాడు
* అశోకుడంటే భారతావనిలో మానవతను పండించినవాడు
* అశోకుడంటే ప్రపంచానికి ఆదర్శపాలకుడుగా నిలిచినవాడు
* అశోకుడంటే బుద్ధుని ధర్మచక్రాన్ని దశదిశలా నడిపినవాడు
* అశోకుడంటే మానవ హృదయాలలో ప్రేమలు పూయించినవాడు
* అశోకుడంటే తుదిశ్వాస వీడేవరకు భిక్షువులకు దానం ఇచ్చినవాడు
* అశోకుడంటే ఖైదీలను ప్రేమతో శిక్షించి పరివర్తన తెప్పించినవాడు
* అశోకుడంటే విపశ్యనతో శీల, సమాధి, ప్రజ్ఞల బలాన్ని పొందినవాడు
* అశోకుడంటే భారత జాతీయ చిహ్నామైన నాలుగు సింహాలలో దర్శనమిచ్చేవాడు
* అశోకుడంటే తనవారే తనకు వ్యతిరేకులైనా ధర్మబలంతో తట్టుకుని నిలిచినవాడు
* అశోకుడంటే 100 కోట్ల బంగారు నాణాలను బౌద్ధవిహారాలకు దానం చేసినవాడు
* అశోకుడంటే వృద్ధాప్యం, అనారోగ్యం చుట్టు ముట్టినా ధైర్య స్థైర్యాలతో నిలిచినవాడు
* అశోకుడంటే అంతఃపుర కుట్రలు దెబ్బతీసినా కుప్పకూలిపోక సింహంలా నిలిచినవాడు

**-శ్రీకృష్ణార్జునబోధి,** సెల్ నెం. *98481 99098*

# ధర్మరాజ్యం

-బొర్రా గోవర్ధన్

"ఉచితం....ఉచితం....ఉచితం... ఛీ..ఛీ... వెధవది ఉచిత పథకాలకు అలవాటైపోయాం..." అంటూ చేతిలోని పేపర్ విసిరి నాపరాయి బల్ల మీద పడేశాడు కిష్టప్ప.

కిష్టప్ప అసలు పేరు రామకృష్ణ. మేము వాణ్ణి చిన్నప్పటి నుండి 'కిష్టప్ప' అని పిలుస్తాం. వాడు మా గురువుగారి కొడుకు. నేను చిన్నప్పుడు వాళ్ళింట్లోనే ఉండి చదువుకున్నాను. నేను వాడికంటే రెండేళ్ళు పెద్ద. అందుకే నన్ను వాడు 'ఒరేయ్ అన్నాయ్' అని పిలుస్తాడు.

వాడు హైదారాబాద్‌లో స్థిరపడ్డాడు. చూడాలనిపించి మొన్ననే వచ్చాడు. మేమిద్దరం ఉదయం పదిగంటల సమయంలో పెరట్లో విస్తరించిన అశోక (నరమామిడి) చెట్టుక్రింద కూర్చున్నాం.

"ఏమిట్రా అంత విసురు" అన్నాను నవ్వుతూ.

"చూడరా అన్నాయ్! ఇంజనీరింగ్ విద్యార్థులకు పూర్తి ఫీజు ప్రభుత్వమే కట్టేస్తుందట. ఉచిత చదువు... ఉచిత కరెంటు... ఉచిత బియ్యం... వడ్డీలేని రుణాలు.... ఉచిత వైద్యం...ఛీ... అంతా ఉచితమే. జనాన్ని సోంబేరుల్లా తయారు చేస్తున్నారు. ప్రభుత్వ సొమ్ముతో ప్రజలకి పందేరం చేస్తున్నారు. వెధవ ఓట్ల రాజకీయం" అన్నాడు ముఖం ఇంతేసి చేసుకుని.

"నీవంతగా అసహనానికి గురికావలసిన పని లేదు, ప్రజా సంక్షేమం ప్రభుత్వ కర్తవ్యం అంతే!"

"అంటే... మా దగ్గర వేలకు వేలు టాక్స్ రూపంలో గుంజుకుని ప్రజలకి పందేరం చేయడమా?"

"నీకు జీతం ఎంతరా?"

"నలభై ఐదు వేలు"

"నీ జీతం ఒక్క నీ పొలం పన్ను, నీ ఇంటిపన్ను, నీ వృత్తి పన్నుల నుండి తీసుకున్నదే అనుకుంటున్నావా? నీకు జీతం ఇచ్చేది ప్రజలే. ప్రజల సొమ్మే!"

"అయితే మాత్రం... ఇలానా?"

"అరే కిష్టప్పా... ఒకప్పుడు ప్రజల నుండి వసూలుచేసిన డబ్బంతా... రాజులు చక్రవర్తులూ... తమ విలాసాలకీ, తమ దండయాత్రలకే వాడుకునేవారు... ప్రజల సొమ్మంతా ప్రభువులు ఇలా దిగమింగేసేవారు. విలాస భవనాలు... విశాలమైన కోటలు నిర్మించుకునేవారు".

"అది రాచరికం. రాజరికంలో రాజు తన ఇష్టం వచ్చినట్లు చేసుకునేవాడు."

"కానీ.. ఇప్పుడు అలా కుదరదు... ఇది ప్రజాస్వామ్యం.. ప్రజల సొమ్ము ప్రజలకే..."

"కాదనను... మరీ ఇంతగానా..."

"నీవేం కంగారు పడకు... నీవు వాడుకునే విద్యుత్తు మీద, గ్యాస్, పెట్రోల్, డీజిల్‌ల మీద నీకూ ప్రతినెలా ఎంతో సబ్సిడీ వస్తూనే ఉంది..."

"అయితే... 'ఉచిత' లిస్టులో నేనూ ఉన్నానన్న మాట..."

"ఉత్తగా కాదు... గట్టిగానే ఉన్నావ్"

"నిజం చెప్పాలంటే... ఈ సంక్షేమ పథకాలకు శ్రీకారం చుట్టిన వాడెవరో తెలుసా?"

"తమిళనాడులో యం.జి.ఆర్, తెలుగునాట ఎన్టీఆర్"

"నీ బొంద, వీళ్ళు నిన్న మొన్నటి వాళ్ళు, మౌర్య చక్రవర్తి అశోకుడు"

"అంటే ఈ ఉచితాల కార్యక్రమం అశోకుడి దన్నమాట..."

"ఉచితం ఉచితం అనీ దాన్ని మరీ అంత చులకన చేయకు. అది సంక్షేమం. ప్రజల ఇబ్బందులు తొలగించడానికి జరిగే ఒక ప్రయత్నం... సమాజానికి ఉపయోగపడే కార్యక్రమాల్ని ప్రభుత్వం పనిగట్టుకు చేయడమే సంక్షేమం. ప్రజల సంక్షేమాన్ని కోరుకున్నవాడు అశోకుడు. ప్రభుత్వం కూడా ప్రజలకు జవాబుదారీ అని చెప్పిన మహానుభావుడు..."

నా ఆవేశాన్నంతా ఓపిగ్గా విన్నాడు కిష్టప్ప.

ఇంతలో గేటు తీసిన చప్పుడు వినిపించింది. ఇద్దరం అటుకేసి చూశాం.

చెమటలు కక్కుకుంటూ వస్తున్నారు సీతాపతిగారు.

"ష్.. రామచంద్రా...! ఇంతకు ముందెప్పుడన్నా ఇలాంటి దుస్థితి విన్నామా! చూశామా? భాద్రపద మాసంలో రోహిణిలో లాగా రోళ్ళు పగులుతున్నాయి... ఏమి ఎండా!... ఏమి ఎండా!...ష్... శ్రీరామచంద్రా!..." అనుకుంటూ, చెమట్లు తుడుచుకుంటూ వచ్చి మా పక్కనే ఉన్న కుర్చీలో కూర్చున్నారు.

నాపరాయి మీద పడి ఉన్న పేపరు తీసుకుని విసురుకుంటూ.

"ఈ నెల ఒక్క చుక్క వాన పడిందటండీ ఇదే కాల ప్రభావం... కలియుగం మొదట్లోనే ఇలా ఉంది. ఇక రాను రాను ఎలా ఉంటుందో" అన్నారు.

"కలియుగం తర్వాత... కాస్త గొంతు తడుపుకోండి" అంటు కిష్టప్ప మంచినీళ్ళు అందించాడు.

"ఏమోయ్ కిష్టప్ప! ఈ విసుగులో అడగటం మరచాను. అంతా క్షేమమేగా..." అన్నారు మంచి నీళ్ళగ్లాసు అందుకుంటూ.

ఉభయకుశలోపరి జరుగుతుంది...

సంఘమిత్ర మూడు గిన్నెలతో వచ్చింది.

"ఆఁ.. ఏమిటమ్మా స్పెషల్... మీ బాబాయి వచ్చాడుగా..." అన్నారు సీతాపతిగారు.

"ఏమీలేదు అంకుల్ పెరుగు, పొట్లకాయి" అంటు గిన్నెలు అందించింది.

"మంచిపని చేశారు. ఎండన పడి వచ్చినవారికి కాస్తంత ఊరట.." అంటూ గిన్నె అందుకున్నారు సీతాపతిగారు.

అదనంగా ఓ పెరుగు గిన్నె తిచ్చి. అక్కడే పెట్టి లోపలకి వెళ్ళిపోయింది సంఘమిత్ర.

ఉభయకుశలోపరి ముగిసింది.

"అస్సలు ఏవిటండీ! ఈ విచిత్రం వాన చినుకు లేదు. దేశం ఏమైపోవాలి. మనుషుల్లో రాక్షసత్యం పెరిగి పోతుంది. పాపాలు పేరుకు పోతున్నాయి. జనం ఇక్కడే నరకం చూస్తారు..." అన్నారు సీతాపతిగారు.

"నరకంలో వానలుండవన్నమాట" అన్నాడు వ్యంగ్యంగా కిష్టప్ప.

"నీ కొంటెతనం ఇంకా పోలేదు"

"పుట్టుకతో వచ్చింది సార్..."

"ఆఁ.. ఈ రామాయణంలో పిడకల వేట ఎందుకులే... మీరేదో చెప్పబోతున్నారు.. చెప్పండి" అన్నాడు కిష్టప్ప.

"పిడకల గురించి కాదు. రామాయణం గురించే... సాక్షాత్తూ శ్రీరామరాజ్యం గురించే"

"బాపు బాగానే తీశాడు. ముందు ఏదోలే అనుకున్నాను గాని నయనతార కూడా 'సీత' గా బాగానే నటించింది" అన్నాడు కిష్టప్ప.

"ఓరినీ... విషయాన్ని అప్పుడే అటెటో లాక్కుపోయాడు..." అని ఒక్క నవ్వు నవ్వి "నేను చెప్పేది శ్రీరాముని 'రామరాజ్యం' గురించి"

"ఓహో... త్రేతాయుగం నాటి గురించా?"

"ఔను! రాముని రాజ్యంలో నెలకు మూడు వానలు పడేవి. మనుషులు, పశువులు సుభిక్షంగా ఉండేవారు. కరువు కాటకాలు ఎరుగరు. ఇలాంటి విపరీతాలు ఎరగనే ఎరగరు" అన్నారు సీతాపతిగారు పెరుగు వడ్డించుకుంటూ.

ఆ మాటవిని కిష్టప్ప పెద్దగా నవ్వాడు.

సీతాపతిగారు వాడివంక అనుమానంగా చూశాడు.

"ఎందుకో అంతనవ్వు?" అన్నారు.

"కాదుసార్.. మీరు 'రామరాజ్యం' గురించి చెప్పారు. మావాడు 'అశోకరాజ్యం' గురించి చెప్పాడు. నేనేమో 'ఉచిత రాజ్యం' గురించి ఉడికి పోతున్నా" అన్నాడు.

"నీ ఉచిత రాజ్యాలు, మీ అన్నగారి అశోక రాజ్యాలు కావయ్యా. మానవాళికి రామరాజ్యం కావాలి" అన్నారు సీతాపతిగారు గిన్నె క్రింద పెడుతూ.

"అంటే నెలకు ముడూ వానలు పడాలన్నమాట" అన్నాడు కిష్టప్ప.

"ఓరి నీ వానలు వరదను పోనూ. రామరాజ్యం అంటే ఒక్క వానలే కాదయ్య కిష్టయ్యా! ఇంకా బోలెడు ఉన్నాయి" అన్నారు సీతాపతిగారు చేతులు బార్లా చాపి చూపిస్తూ.

"ఏమిటో సెలవియ్యండి?" అన్నాను.

"చెప్పేగా చాలా ఉన్నాయని. కరువులు ఉండవు. కాటకాలుండవు. రోగాల భయం ఉండదు. పెద్దవాళ్ళకు అగౌరవం ఉండదు. విచారించే వారుండరు. విద్యలేని వారుండరు. స్త్రీలను అగౌరవ పరచేవారుండరు. మోసం, దగా ద్రోహాలు ఉండవు. నిరపరాధులు శిక్షించబడరు, సమాజంలో శాంతి భద్రతలకు కొదవ ఉండదు. పాడి పంటలకు లోటుండదు..."

"అబ్బో ఇవ్వన్నీ ఉత్తగా చెప్పుకునే మాటలే. మానవజాతి చరిత్రలో ఇప్పటివరకు ఇలాంటి సమాజాలే రాలేదు" అన్నాడు కిష్టప్ప.

"అని నీవనుకుంటే సరిపోతుందా?" అన్నారు సీతాపతిగారు.

"లేదు సార్. మీరు అన్న విషయాలన్నీ రామాయణంలో ఉన్నాయి. కాదనను. రాముని పాలన 'ఇలా ఉంది' అని మీరు చెప్పిన మాటలన్నీ ఉన్నాయి. అయితే రామాయణం గాథలో ఎక్కడా అవి కనిపించవు..." అన్నాను.

"వక్రంగా చుస్తే ఏదైనా అలాగే ఉంటుంది. చూపును బట్టే రూపుంటుంది..."

"కాదనను. మీరే చెప్పండి నా దృష్టి ఎలాంటిదో..."

అంటూ ఉండగా సంఘమిత్ర టీ తీసుకు వచ్చింది.

"ఏమ్మా! టీ చరులం వచ్చామని ఇప్పటికి గుర్తించారన్నమాట" అన్నారు నవ్వుతూ సీతాపతిగారు.

"ఊఁ... కానీండి సార్... చల్లారిపోతుంది"

"ఏమిటి? టీ నా? చర్చా?"

"రెండూ. వాదోపవాదాలు ఇప్పుడే వేడినందుకున్నాయి" అన్నాడు కిష్టప్ప టీ కప్పునందుకుటూ.

సంఘమిత్ర వచ్చి కిష్టప్ప ప్రక్కన కూర్చొంది. "స్త్రీ గౌరవం చూద్దాం. రాముడు తన శత్రు సంహారం మొదలు పెట్టిందే 'తాటకి'తో. రాముడు చూస్తుండగా లక్ష్మణుడు ముక్కు చెవులు కోసిన శూర్పణఖ స్త్రీనే. లంకకు రక్షణగా ఉన్న సింహిక, లంకిణిలను రామాంజనేయులు కూల్చివేశారు. వారూ స్త్రీలే..." ఇక సీతను అనుమానించడం, అవమానించడం, చెప్పా పెట్టకుండా అడవుల్లో వదిలి పెట్టడం..." ఇవ్వన్నీ స్త్రీ గౌరవమేనా?"

"సీత విషయంలో ధర్మ సూక్ష్మం చాలా ఉంది" అన్నారు సీతాపతిగారు.

"ఈ సూక్ష్మాలూ, మోక్షాలు కాదు.. విషయం నేరుగా చెప్పండి" అన్నాడు కిష్టప్ప.

"నేనేం వంకరగా లేను, నిటారుగానే ఉన్నా. రాక్షస స్త్రీలని చంపటం నేరమెలా అవుతుంది?"

"అంటే రాక్షసస్త్రీలు స్త్రీలు కాదా? అన్నాను.

సీతాపతిగారు ఏదో చెప్పబోయారు... దానికి సంఘమిత్ర అడ్డుపడి.

"ఆగండి అంకుల్. నాకో విషయం చెప్పండి. సింహిక, లంకిణిలు లంకకు రక్షకులు అన్నారు. అంటే లంకను కాపాడే 'రక్షణశాఖ' ఉద్యోగులన్న మాట. స్త్రీలకి లంకలో ఉద్యోగ అవకాశాలున్నాయన్న మాట. అంటే స్త్రీ పురుషులతో పాటు, మిలటరీ వ్యవహారాల్లో పాల్గొంటుందన్న మాట..."

"అబ్బో.. మా సంఘమిత్ర మాంచి పాయింట్ లాగింది" అన్నాడు కిష్టప్ప.

"స్త్రీ స్వేచ్ఛ ఉంది. అందుకే దాన్ని రాక్షస రాజ్యం చేశారు" అన్నాను.

"ఎవరు?" ప్రశ్నించారు సీతాపతిగారు.

"ఇంకెవరు? స్త్రీవాద వ్యతిరేకులు. స్త్రీ బానిసలా పడివుండాలనుకునేవారు.. రామరాజ్యం కావాలనుకునేవారు" అన్నాను కటువుగా.

సీతాపతిగారు మౌనం వహించారు.

"అలాగే... మోసం, దగా, వాలి వధ ఎంత మోసం, అలాగే....


ఖడ్గధారుడైన అశోకుడు

విభీషణుని దగ్గర 'మరణ రహస్యం' తెలుసుకుని రాముడు రావణున్ని చంపడం ఎంత దగా"

"మీరు అలా అనకండి. అవి వారి వారి శాపాలు.. శాపఫలాలు.. అలా అనుభవించాల్సిందే..." అన్నారు సీతాపతిగారు.

"ఆ విషయం అటుంచండి. ఇక్కడ నాకైతే రాముడు నిజమైన రాజకీయ నాయకునిగా కనిపిస్తాడు. రాజకీయం అంటేనే కుట్ర కదా!"

"మనమ్మాయి మరేదో కొత్తకోణం వెతికినట్టుంది" అన్నాడు కిష్టప్ప

"ఔను బాబాయ్! రాముడు రావణుని మీద గెలిచాడు. యుద్ధం చేసి గెలిచాడు. ఆ యుద్ధంలో ఎవరి సైన్యాన్ని తన తరపున దించాడు. కిష్కంధసైన్యాన్నీ, వానర సైన్యాన్నీ అంతేగానీ తన అయోధ్య సేనని మాత్రం కాదు. వాలి రాజ్యాన్ని సుగ్రీవునికిచ్చి, సుగ్రీవుని సైన్యంతో లంకను జయించాడు. ఇక్కడ తన రాజ్యసైన్యం ప్రమేయమే లేదు. ఇదే రాజకీయం కుట్ర... ఈనాడు

అమెరికా సామ్రాజ్యవాది చేస్తుంది ఇదే..” అంది.

“అయోధ్య సార్వభౌముడు- అమెరికా సామ్రాజ్యవాది ఒకటే అన్నమాట” అన్నాడు కిష్టప్ప సంఘమిత్రకి వంతగా.

“ఇక మీరన్నట్లు విద్యా విషయం చూద్దాం” అన్నాను సీతాపతిగారి వైపు తిరిగి.

ఆయన అదోలా నవ్వి “దానికెన్ని లెక్కలున్నాయో...”

“ఎన్ని లెక్కలున్నా అవేవీ మావి కాదు. వాల్మీకి రామాయణంలో ఉన్నవే. ఇక అసలు విషయానికి వద్దాం. రామరాజ్యంలో అందరికీ విద్య” అనడం విడ్డూరాల్లోకెల్లా విడ్డూరం.... ఎందుకంటే చదువుకుంటానని చెప్పిన' శూద్ర శంబుకుణ్ణి శిరచ్ఛేదం చేశాడు రాముడు” కాదంటారా! లేక ఇవి నా కల్పనంటారా?” అన్నాను.

“అయ్యబాబోయ్. ఇప్పుడు గానీ రామరాజ్యం హఠాత్తుగా వచ్చేస్తే... ఈ దేశంలో ఎంతమంది శూద్ర, పంచముల తలలు తెగిపడతాయో...ఒరేయ్... అమ్మడూ... నా తల కూడా...” అంటూ సంఘమిత్ర భుజాలు కుదిపాడు కిష్టప్ప.

“నీదే కాదు బాబాయ్, నాది కూడా. ఆనాడు స్త్రీ కూడా విద్యకు దూరమే” అంది బిక్కముఖం పెట్టి.

“బాబాయి- అమ్మాయిలు బాగానే నటిస్తున్నారు” అన్నారు సీతాపతిగారు.

“అంకుల్! మిగిలిన విషయాలు అటుంచండి. అసలు రామాయణంలో 'రామరాజ్యం' అనే మాట వచ్చింది ఈ విద్యా విషయంలోనే. నిజం చెప్పాలంటే మీరు చెప్పుకునే వానలు, దొంగలు, ఇంటికి తాళాలు... ఈ విషయాల ప్రస్తావన ఉందో లేదో కానీ, ఈ విద్యాపరమైన విషయంలోనే 'రామరాజ్యం' అనే ప్రస్తావన వచ్చింది.

“నీవు ఇవన్నీ ఎప్పుడు చదివావే అమ్మడూ....” అంటూ సంఘమిత్ర తల నిమిరి, “ఊc... చెప్పు...చెప్పు...” అన్నాడు కిష్టప్ప.

“ఊc... బాబాయ్. చెప్తున్నా, అయోధ్య సింహాసనం మీద రాముని చెప్పులు ఎక్కినప్పటి నుండే అయోధ్య ప్రభువు రాముడే. భరతుడు కేవలం ఒక ప్రతినిధి మాత్రమే. రావణ సంహారం తర్వాత రాముడు స్వయంగా పట్టాభిషిక్తుడవుతాడు. అప్పుడు కొన్నాళ్ళు గడిచింది. ఇంతలో అడవికి పోయిన ఒక బ్రాహ్మణ బాలుడు పాము కరచి చనిపోతాడు. అప్పుడు బ్రాహ్మణులందరికీ రాముడి మీద కోపం వస్తుంది.

“అసలిది రామరాజ్యమా?” అని.

“పాము కరిస్తే రాముడేం చేస్తాడు?” అన్నాడు కిష్టప్ప అయోమయంగా ముఖం పెట్టి.

“నాకు తెలిసి రామాయణంలో ఉంది ఇదే..బ్రాహ్మణులకు చావురానిది రామరాజ్యం. బ్రాహ్మణులు పాము కాటుకు గురికానిది రామరాజ్యం” దీనికి విరుద్ధంగా జరిగింది. కాబట్టి- అందరూ పొలోమని రాముని ఆస్థానానికి పోయి అడుగుతారు. “రామా నీ రాజ్యంలో ఒక బ్రాహ్మణుడు పాము కరిచి చనిపోయాడు. కాబట్టి నీ రాజ్యం రామరాజ్యం కాదు. బ్రాహ్మణ నివాస యోగ్యం కాదు. కాబట్టి మేమంతా నీ రాజ్యం ఖాళీ చేస్తున్నాం” అంటారు.

అప్పుడు రాముడు కంగారు పడిపోయి ఈ అరిష్టానికి కారణం ఏమిటని అడుగుతాడు.

“నీ రాజ్యం ఇంత అరిష్టదాయకం కావడానికి కారణం శూద్రుడైన శంబుకుడు చదువుకోవటమే” అంటారు.

వెంటనే రాముడు అడవికి పోయి, శూద్రశంబుకుని తల నరికి, తిరిగి రాజ్యంలో ధర్మాన్ని నెలకొల్పుతాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణులంతా "ఇప్పుడు ఇది రామరాజ్యం" అని రాముణ్ని కీర్తిస్తారు.

అంటే... అంకుల్ జాగ్రత్తగా ఆలోచించండి... వర్ణాశ్రమ ధర్మాల్ని కాపాడేదే "రామరాజ్యం" అని వాల్మీకి రామాయణంలో ఉంది. వానలు, వరదలు గురించి కాదు. రామాయణంలో ప్రజలంటే శూద్రులు, పంచములు కానేకాదు. అలాగే స్త్రీలు కూడా... బ్రాహ్మణ స్త్రీలకు మాత్రమే వైధవ్యం కలగనిది "రామరాజ్యం" అని ఉంది"

సంఘమిత్ర భుజాన్ని మెచ్చుకోలుగా గట్టిగా నొక్కాడు కిష్టప్ప.

సీతాపతిగారు కూడా ప్రశాంతంగా ఉండిపోయాడు.

ఇంతలో ఇంట్లోంచి నా శ్రీమతి కేకవేసింది. "దాన్ని కాస్త ఇటు పంపండి"

"ఆఁ...ఆఁ... వస్తున్నా..." అంటూ సంఘమిత్ర లేచింది.

"అమ్మా! ఇక చాలు. ఇంకేం తినలేం" అన్నారు సీతాపతిగారు.

"తినక తప్పదు సార్" అన్నాను.

"తిన్నాక ఇబ్బంది కూడా తప్పదు సార్" అన్నారు తిరిగి.

"తినకపోయినా తప్పదు..." అన్నాడు కిష్టప్ప.

"ఏమిటో? అది"

"తిప్పలు..."

"అంత తిప్పలు పడాల్సింది ఏమీ లేదు, ఒక చిన్న జున్నుగడ్డ మాత్రమే..." అంటూ వచ్చింది సంఘమిత్ర. బాదం ఆకులో ఉంచిన జున్ను గడ్డ నుండి యాలుకల వాసన ఘుమాయించి కొడుతుంది.



ఆ వాసన తినాలనిపిస్తుంది. అందరికంటే ముందుగా...ఊఁ.. కానీయండి అన్నాడు కిష్టప్ప.

అందరూ ఆకుల్లో వున్న జున్ను ముక్కల్ని అందుకున్నారు.

"అమ్మా 'రామరాజ్యం' గురించి అయ్యింది. ఇక నాన్న చెప్పిన 'అశోక రాజ్యం' ఉంది... అది కూడా సెలవిస్తే...." అన్నాడు కిష్టప్ప.

అబ్బో దాని గురించి బాగానే చెప్తారులే. రాజ్యం కోసం వందమంది అన్నదమ్ముల్ని పొట్టన పెట్టుకున్న మహా చక్రవర్తి కదా!" అన్నారు సీతాపతిగారు.

"అది నిజమో? కాదో తెలుసా?" అన్నాను.

"నిజమో కాదో నాకేం తెలుసు? మీ బౌద్ధ గ్రంథాల్లోనే ఉంది"

"ఆ గ్రంథాలు..." అని ఏదో చెప్పబోయాను.

"మీకు నచ్చితే ఒప్పుకుంటారు... లేదంటే ప్రక్షిప్తాలంటారు... ఇది మామూలేగా..."

"వందమంది సోదరులంటేనే నమ్మలేం..."

"పోనీ యాభైమంది... కనీసం పదిమంది.. మీ సంశయం 'సంఖ్య'లోనా 'చంపడం' లోనా?"

"రెండింటిలో..."

"కానీండి... తా మునిగిందే గంగ..." అన్నారు సీతాపతిగారు ఎద్దేవాగా!

"అంకుల్! నాన్న అనవసరంగా సమర్థించుకుంటున్నాడు. శ్రీలంక అవదాన గ్రంథాల్లో మీరు చెప్పిందే వుంది. ఎంతమంది అనేది కాదు.

అశోకుడు తన సోదరుల్ని చంపి రాజ్యానికి వచ్చాడు. అలాగే... ఆ తర్వాత ఘోరమైన



ధర్మచింతనలో సమ్రాట్ అశోకుడు

కళింగ యుద్ధం కూడా చేశాడు. ఈ రెండు పనులే చేసినవాడిగా మిగిలిపోతే...అశోకుణ్ణి ఈనాడు మనం తలుచుకుని కూడా వుండేవాళ్ళం కాదు. ఇలాంటి ఘోరకృత్యాలు చేసిన రాజులు ఎందరెందరో వున్నారు. వాళ్ళలో అశోకుడు కూడా ఒకడిగానే మిగిలిపోయేవాడు..అశోకుని గురించి మనం చెప్పుకునేది..అతని రెండో జన్మ గురించి..." అంది.

వింటూ సీతాపతిగారు జున్ను తిన్న ఆకును మడిచి దూరంగా పారేసి వచ్చారు. కిష్టప్ప ఆ

ప్రక్కనే పెట్టేశాడు. నేను ఇంకా తింటూనే వున్నా.

"అంకుల్! అశోకుడు యుద్ధం తర్వాత మారాడు. సమగ్రంగా మారాడు. ప్రజలకు ఎన్ని మేళ్ళు చేశాడు? ఇన్ని ప్రజోపయోగ కార్యక్రమాలు చేసిన రాజు చరిత్రలో నాటికీ, నేటికీ లేడు. ఈ దేశ చరిత్రలనే కాదు...ప్రపంచ చరిత్రలో.."

"ఔను..జన్మభూమి, పచ్చనిచెట్లు...అని ఈనాడు మనం చెప్పుకునే కార్యక్రమం ఏనాడో అశోకుడు పాటించాడు. విచిత్రం ఏమంటే ఇదే విషయం మీద కెన్యా దేశానికి చెందిన డా॥వంగరి మత్తాయ్ అనే వ్యక్తికి నోబెల్ బహుమతి వచ్చింది. మన ప్రభుత్వాలు కూడా ఆ వ్యక్తి పేరు చెప్పుకున్నాయి. కానీ, అశోకుని పేరు చెప్పుకోలేదు. ఇదే దరిద్రం" అన్నాడు కిష్టప్ప.

"అశోకుడు కళింగ యుద్ధం తర్వాత సైన్యాన్ని పెంచలేదు. సైన్యంలో కొత్త ఉద్యోగుల్ని చేర్చుకోలేదు"

"ఉన్న సైన్యాన్ని రద్దు చేశాడా?" అన్నారు సీతాపతిగారు.

"అదీ చేయలేదు"

"ఆ సైన్యాన్ని ఊరికే తిండిపెట్టి మేపాడు"

"లేదు అంకుల్! అదీ కూడా చేయలేదు"

"అందర్నీ బౌద్ధభిక్షువుల్ని చేశాడా?"

"అది కూడా కాదు. ఆ సైన్యంతో ప్రజాసేవ చేయించాడు. రోడ్లు వేయించాడు. బావులు తీయించాడు. రైతుల కోసం కాల్వలు, చెరువులు తవ్వించాడు. నిజం చెప్పాలంటే ప్రపంచంలో తొలిసారిగా జాతీయ రహదారులు, హైవేలు నిర్మించాడు."

"చాలామంచి పని చేశాడు" అన్నాడు కిష్టప్ప.

"రాజ్యంలో వృద్ధులకి జీవన భృతి కల్పించాడు"

"అంటే వృద్ధాప్యపు పెన్షన్లు"

"శిక్షపడ్డ ఖైదీలలో వయస్సు మళ్ళిన వారిని విడుదల చేయించాడు, సత్ప్రవర్తన గలవారికి శిక్ష తగ్గించాడు."

"ఆగస్టు 15కి మన ప్రభుత్వం చేసే ఖైదీల క్షమాభిక్ష ఇదే"

"మనుషులకి, పశువులకి, పక్షులకీ ధర్మాసుపత్రులు కట్టించాడు"

"దేశం నలుమూలలా ఔషధ శాఖలు నిర్మించాడు. ఔషధ మొక్కల్ని నాటించాడు"

"108, 104 రథాలు ఒక్కటే తక్కువ" అని పెద్దగా నవ్వాడు కిష్టప్ప.

"రైతులకి కరువు సమయాల్లో పూర్తి పన్ను మినహాయించాడు. సాలుసరి కట్టే పన్నుల్ని తగ్గించాడు. ఇవన్నీ ఒకెత్తు...ఆయన స్వయంగా ఎన్నో దానధర్మాలు చేశాడు. బౌద్ధుడే అయినా ఇతర మతాల పట్ల ఎంతో సహనంతో ఉన్నాడు. వారికీ ఆరామాలు, ఆలయాలు కట్టించాడు. వీటన్నింటి కంటే ఒక మహత్తర అంశం వుంది..." అని కొంచెం ఆగింది.

"సస్పెన్స్ ఎందుకు? చెప్పరా తల్లీ" అన్నాడు కిష్టప్ప.

బుద్ధుడు ఎలా తన బిడ్డని కూడా భిక్షువుని చేశాడో..అలాగే అశోకుడు కూడా తన బిడ్డల్ని భిక్షువులుగా చేసి బౌద్ధాన్ని దేశ దేశాలకు పంపాడు"

"అందులో నీవు కూడా వున్నావుగా..." అన్నాడు సీతాపతిగారు కల్పించుకుని.

"కిష్టప్పకి అర్థం కాలేదు..మా అమ్మడా?"

"అవును..మీ అమ్మడే..సంఘమిత్ర" అన్నారు.

"ఓ.. ఓ.. అశోకుని కూతురు పేరు సంఘమిత్ర కదా! తెలుసు నాకు తెలుసు ...అయినా గుర్తు రాలేదు" అన్నాడు కిష్టప్ప.

"ఒక మహా సామ్రాజ్యానికి సార్వభౌముడైన అశోకుడు...మీరన్నట్లు సోదరుల్ని, కళింగుల్ని చంపి వారి పచ్చినెత్తురు తాగిన అశోకుడు..ఈ ప్రపంచంలో తొలిసారిగా మరణశిక్షను రద్దు చేశాడు" అంది సంఘమిత్ర గర్వంగా.

"ఇప్పటికి కొన్ని దేశాలు ఈ శిక్షను రద్దు చేశాయి. అశోకుడు, బుద్ధుడు పుట్టిన మన దేశంలో ఇంకా రద్దు కాలేదు. ఇదీ విచిత్రమే.." అన్నాడు కిష్టప్ప.

"అంకుల్! ఇప్పుడు చెప్పండి..ప్రజల కోసం పాటుపడిన రాజ్యం..రామరాజ్యమా? అశోకరాజ్యమా?"

రామరాజ్యాన్ని గూర్చి నేనేమీ చెప్పలేను. తప్పునీ చెప్పను, ఒప్పునీ చెప్పను-కానీ అశోక రాజ్యం అమరమైనది అని మాత్రం ఒప్పుకుంటాను. అంత గొప్ప మానవతామూర్తి ఈ దేశంలో పుట్టడం మనకు గర్వకారణం" అన్నారు సీతాపతిగారు.

"అయితే...మీకు మరో విషయం... పాలించబడే జనాన్ని ఈ రోజున మనం 'ప్రజలు' అంటున్నాం. పాలితుల్ని ఇలా 'ప్రజలు' అని పిలవడం ఎందువల్ల వచ్చిందో చెప్పగలరా?"

"ప్రజలంటే జనం..పీపుల్.." అన్నాడు కిష్టప్ప తేలిగ్గా.

"నాకు తెలిసి 'ప్రజ'లంటే 'కుమారుడు' 'బిడ్డ' అని అర్థం. రామాయణంలో రాముణ్ణి 'కౌసల్యా సుప్రజా రామా' అని నిద్రలేపుతాడు విశ్వామిత్రుడు" అన్నాడు సీతాపతిగారు.

"ఔను అంకుల్..సు..ప్రజ అంటే 'మంచి కుమారుడు' అనే అర్థం. మరి జనాన్ని 'ప్రజ' అనడం అశోకునితోనే ప్రారంభం అయ్యింది.

"అబ్బో..సంఘమిత్రా! మీ నాయన ఎన్నింటిలో మొదటివాడే.." అన్నాడు. కిష్టప్ప.

"అన్నింటిలో..." పాలితులైన ప్రజలు రాజుకు 'కన్నబిడ్డలు'తో సమానం అన్నాడు అశోకుడు. అప్పటినుండి జనానికి 'ప్రజలు' అనే పేరు స్థిరపడింది" అని సీతాపతిగారివైపు తిరిగి-

"అంకుల్ మీకు మరో విషయం చెప్పాలి. రాముడు రాజయ్యాక ఎన్నో యుద్ధాలు చేశాడు. అశ్వమేధయాగం చేశాడు. ఈ యాగం కోసం ప్రజల నుండి ఎన్నో బంగారు నాణాలు అందుకున్నాడు. నిలువెత్తు సీత విగ్రహాన్ని చేయించాడు"

"అవును..అవును..లవకుశ సినిమాలో వుంది" అని మధ్యలో అడ్డు తగిలాడు కిష్టప్ప.

కానీ అశోకుడు వందకోట్ల బంగారు నాణాల్ని సంఘానికి దానం చేశాడు. చివరికి తాను తినే కంచాల్ని కూడా దానం చేశాడు. అందుకే అశోకుణ్ణి 'ధర్మరాజు' అంటారు.

"ధర్మరాజు అనా?"

"ఔను! చరిత్రలో మనకి ఒకే ధర్మరాజు వున్నాడు. అది అశోకుడే"

"అయితే భారతంలో ధర్మరాజు"

"ఆయన రాజ్యం 'ధర్మం'గా పాలించాడు కాబట్టి 'ధర్మరాజు' అనే పేరు రాలేదు"

"ఔను! ఆయన అసలు పేరు యుధిష్టరుడు గదా!"

"ఔను బాబాయ్! యమధర్మరాజు కొడుకు కాబట్టి 'ధర్మజుడు' అంటారు. అంతేకానీ ఆయన ధర్మబుద్ధికి కాదు".

"పేరు ధర్మరాజు పెనువేపవిత్తు అని వేమన ఎప్పుడో తేల్చేశాడు కదా!"

"నిజం చెప్పాలంటే అశోక రాజ్యం ధర్మరాజ్యం, ప్రజా సంక్షేమ రాజ్యం. రామరాజ్యం వర్ణాశ్రమ ధర్మాల్ని కాపాడే రాజ్యం-అంతే.." అంది సంఘమిత్ర.

"మీ నాన్న నీకు ఏరికోరి తగిన పేరే పెట్టాడు..బౌద్ధాన్ని బాగానే ప్రచారం చేస్తున్నావు.. విజయోస్తు" అని సంఘమిత్రను దీవించారు సీతాపతిగారు.

❋

-సెల్ : *93906 00157*

# మౌర్యవంశ చక్రవర్తులు

-పామర్తి రవి

దేవానాం ప్రియ, ప్రియదర్శి ప్రజలు తమ చక్రవర్తి అశోకుని భక్తి భావాలతో పిలుచుకునే పిలుపులు అవి. క్రీ.పూ 273-232 సం॥ల మధ్యకాలంలో దక్షిణాన పెన్నానది మొదలు కొని హిమాలయాలు సైతం దాటి ఆఫ్ఘనిస్తాన్, పర్షియాలలో కొంతభాగం వరకు జనరంజకంగా పరిపాలించిన గొప్ప చక్రవర్తి 'అశోకుణ్ణి' ప్రజలు తమ హృదయాల్లో గౌరవభావంతో భక్తితో పూజించుకునేవారు. సుమారు 132 సం॥లు భారతదేశాన్ని పరిపాలించిన మౌర్య సామ్రాజ్యంలో అత్యధిక భూభాగాన్ని ఒకే గొడుగు క్రిందకు తెచ్చి ప్రజా రంజకంగా పరిపాలించాడు అశోకుడు. వాయువ్య దిక్కున ఆఫ్ఘనిస్తాన్, పర్షియా పశ్చిమ ప్రాంతం ఆగ్నేయ దిశన బెంగాల్ అస్సాం సరిహద్దుల వరకు, దక్షిణాన తమిళనాడు మినహా దాదాపు మిగిలిన ప్రాంతం మొదలుకుని ఉత్తరాన హిమాలయాలను దాటి బెలూచిస్తాన్‌ల వరకు సువిశాల సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేశాడు సమ్రాట్ అశోకుడు. సామ్రాజ్య విస్తరణ కాంక్షతో రగిలిపోతూ భయంకరమైన యుద్ధాలు చేసి చివరకు కళింగ తెగ నాయకుడు కీమరాజుతో జరిగిన యుద్ధం తరువాత పరివర్తన చెంది ధర్మకాంక్షతో సద్ధర్మపాలన కొనసాగించిన గొప్ప చక్రవర్తి అశోకుడు అనేది జగమెరిగిన సత్యం.

భారతదేశ చరిత్ర తెలిసిన నాటి నుండి నేటి వరకు ఏ చక్రవర్తి, రాజు, పాలకుడూ అందించని నీతివంతమైన పరిపాలన చేయటానికి ప్రధాన కారణం అశోకుడు బౌద్ధాన్ని హృదయానికి హత్తుకుని బుద్ధుని బోధనలను ఆచరణలో పెట్టడమేనని చరిత్ర ఆధారాలతో సహా తెలియచేస్తుంది.

'యధారాజా తధా ప్రజ' అన్నట్లు రాజు ఎంత నీతివంతుడైతే ప్రజలు అంత ధర్మబద్ధమైన జీవితాన్ని గడుపుతారు అనటానికి ఆనాటి అశోకుని రాజ్యమే చారిత్రక ఆధారం.

ఒక గొప్ప సామ్రాజ్యం, మౌర్య వంశం, మౌర్య చక్రవర్తులు గురించిన ఆధారాలు మనకు పుష్కలంగా లభించక పోవటం మన దురదృష్టమే అనుకోవాలి. అదృష్టం కొద్దీ 2వ శతాబ్దంలో వ్రాయబడిన 'అశోకావదానం' శ్రీలంకలో లభించిన పాళీ భాషలో రచింపబడిన 'దీప వంశం' 'మహా వంశం' అశోకుని శాసనాలు బౌద్ధ గ్రంధాలు వీటితో పాటు ఆ కాలంలో రచించబడిన మెగస్తనీస్- ఇండిక, కౌటిల్యుని అర్థశాస్త్రాల ద్వారా మౌర్యుల గురించిన సమాచారం మనకు లభించింది. బౌద్ధ మార్గంలో ప్రయాణం చేస్తూ ధర్మబద్ధమైన, శీలవంతమైన పాలన సాగిస్తూ సుమారుగా 42 సంవత్సరాలు భారత్‌లో అత్యంత భూభాగాన్ని పాలించాడు అశోకుడు.

## అశోకుడు-మౌర్య వంశం- కొన్ని ముఖ్య విషయాలు

| | |
|---|---|
| 1) మౌర్య వంశస్థాపకుడు............ | చంద్రగుప్త మౌర్యుడు |
| 2) మౌర్యసామ్రాజ్య స్థాపన కొరకు... ఆక్రమించిన రాజ్యాలు | నందవంశం పాలనలోని మగధ సామ్రాజ్యం, ఆ నాటికి అనైక్యంగా వున్న మహాజన పదాలు. |
| 3. రాజ్యంలో ప్రధానమైన భాషలు.... | పాళి, సంస్కృతం, ప్రాకృతం |
| 4) ముఖ్యమైన మతాలు............... | వైదిక, జైన, బౌద్ధం. |
| 5) మౌర్య సామ్రాజ్య రాజధాని నగరం.. | పాటలీపుత్రం (ప్రస్తుతం బీహార్ రాజధాని పాట్నా) |
| 6) సామ్రాజ్యాధినేత.................... | సమ్రాట్ లేదా చక్రవర్తి |
| 7) మొదటి చక్రవర్తి.................. | చంద్రగుప్త మౌర్యుడు |
| 8) ఆఖరి చక్రవర్తి..................... | బృహద్రథుడు |

9) ప్రభుత్వ లక్షణం............... కేంద్రీకృతమైన రాజ్యాధికారం దైవనిర్ణయం అని కౌటిల్యుని అర్థశాస్త్రంలో వుంది.

10) రాజ్యం, విభాగాలు............ (పూర్తి ఆధారాలు లభించ లేదు. లభించినంత వరకు) రాజ్యాన్ని పాలనా సౌలభ్యం కొరకు మండలాలుగా విభజించేవారు. (ప్రస్తుతం మన రాష్ట్రాల వలె) 6 ప్రధాన మాండలికాల ఆధారాలు లభించాయి.

అవి : 1. ఉత్తరాపదం-రాజధాని-తక్షశిల 2. దక్షిణాపదం-రాజధాని-సువర్ణగిరి 3. కళింగ పదం-రాజధాని-తోసలి 4. అవంతీపురం-రాజధాని-ఉజ్జయిని 5. సురాష్ట్ర/సౌరాష్ట్ర-రాజధాని-గిర్నార్ 6. ప్రాత్యపదం-రాజధాని-పాటలీపుత్రం. పాటలీపుత్రం మౌర్యసామ్రాజ్యానికి ప్రాత్యపదం. మాండలికానికి ఉమ్మడి రాజధానిగా వుండేది.

**11) రాజ్యపరిపాలనా విధానం. కొన్ని ముఖ్య విషయాలు**

1. రాజు తరువాత మహామంత్రి ముఖ్య పాలకుడు. మంత్రి పరిషత్(మంత్రిమండలి)ని ఏర్పాటుచేసి పరిపాలన నిర్వహించేవాడు. మహామంత్రి, మంత్రి పరిషత్‌ను కలిపి 'మంత్రినోమంత్రి పరిషదమ్మక' అని వ్యవహరించేవారు.

2. మంత్రినోమంత్రి పరిషదమ్మకకు పరి పాలనలో సహాయాన్ని అందించటానికి కొందరు ముఖ్య ఉద్యోగులు వుండేవారు. వీరిలో సన్నిదాత-కోశాధికారి, సమాహర్త-కలెక్టరు. కార్మిక-గుమస్తాలు ముఖ్యులు

3. మాండలికాలను పరిపాలించడానికి 'కుమార' లేదా 'ఆర్యపుత్ర' అనబడే ప్రధాన మండలి పాలకుడు వుండేవాడు. ఇతనికి సలహాలు, సహాయం చేయటానికి 'మహామట్ట' అనే మంత్రిమండలి వుండేది. ప్రస్తుతం మన రాష్ట్ర శాసనసభ లాంటిది.

4. కేంద్రీకృత రాచరిక వ్యవస్థ ఐనప్పటికీ మంచి పరిపాలన అందించటానికి పరిపాలనను గ్రామ స్థాయి వరకు క్రమపద్ధతిలో వికేంద్రీకరించారు.

5. రాజ్యాన్ని మండలాలుగాను, మండలాలను జిల్లాలు/పరగణాలుగా వీటిని గ్రామాలుగా విభజించారు. మహామంత్రి రాజ్యంలో ఉన్నతస్థాయి పాలనాధికారి అయితే 'గోప' గ్రామస్థాయిలో ఆఖరి పాలనాధికారి.

6. ఏ చక్రవర్తి నిర్వహించని ఉన్నతమైన పరిపాలన అశోకుడు నిర్వహించాడు. రాజ్యం ధర్మమార్గంలో ఉంచటానికి 'ధర్మమహామాత్రలను' నియమించాడు. రాజ్యంలో ధర్మసూత్రాలను అమలు చేయటం వీరి బాధ్యత. ధర్మాన్ని ఖండాంతర వ్యాప్తి చేశాడు.

7. వృద్ధులను, స్త్రీలను, పిల్లలను తప్పు చేసినప్పుడు వారికి విధించే శిక్షలను తగ్గించాడు. 2200 సంవత్సరాల క్రితమే ప్రజాసంక్షేమానికి పెద్దపీట వేశాడు అశోకచక్రవర్తి.

8. రోడ్లు వేయటం, బావులు త్రవ్వటం, చెట్లు నాటడం, మనుషులకు, పశువులకు ఆసుపత్రులు ఏర్పాటు చేయటం లాంటి సంక్షేమ కార్యక్రమాలను అశోకుని పాలన నుండే నేటి ఆధునిక ప్రభుత్వాలు ఆదర్శంగా తీసుకున్నాయి.

9. ఇకపై యుద్ధం చేయనని, ఆటవికులతో సైతం మైత్రీభావంతో వుంటానని అశోకుడు చెప్పిన శాంతిమార్గమే నేటి ఐక్యరాజ్యసమితి అలీన విధానం ఏర్పాటుకు మూలం.

**12) మౌర్య సామ్రాజ్య వైశాల్యం**

సుమారుగా 36 లక్షల కిలోమీటర్లు. హిమాలయాలను దాటి సరిహద్దులు విస్తరించాయి.

**13) రాజ్యంలో జనాభా**

నాటి ప్రపంచ జనాభాలో దాదాపు 3వ వంతు జనాభా మౌర్య సామ్రాజ్యంలో వుండేవారు. సుమారుగా 5 కోట్లమంది జీవించేవారని ఒక అంచనా.

**14) ద్రవ్య చలామణి**

'పానా' లేదా 'పాణా' అని పిలిచే వెండి నాణాలను ద్రవ్యంగా చలామణి చేసేవారు.

**15) రాజ్యం ఉనికి**

క్రీ.పూ. 322 సం॥లో స్థాపించబడి క్రీ.పూ.137 సం॥లో పరిసమాప్తమయ్యింది. 137 సంవత్సరాలపాటు కొనసాగింది.

**16) రాజ్య పతన కారణం**

పుష్యమిత్రుని సైనిక తిరుగుబాటు.

**17) మౌర్య సామ్రాజ్య పతనం**

మగధ సామ్రాజ్యంతోపాటు మహాజన పదాలనన్నింటినీ జయించి చంద్రగుప్తమౌర్యుడు రాజ్యస్థాపన చేశాడు. అశోకుని కాలంలో రాజ్యవైభవం మహోన్నత స్థాయికి చేరింది. అశోకుని మరణానంతరం కుణాలుని సారధ్యంలో రాజ్యం ముక్కలుగా విడిపోయింది. దక్షిణాన కళింగులు, తక్షశిల, సౌరాష్ట్రాల్లో తిరుగుబాటు ప్రకటించి స్వతంత్రులైనారు. క్రమేణా మౌర్య సామ్రాజ్యం బీటలువారి పతనం వైపుకి దారి తీసింది. ఆఖరి చక్రవర్తియైన బృహద్రదుని కాలంలో పుష్యమిత్రుడనే సేనాపతి చక్రవర్తి మీద తిరుగుబాటు చేసి మౌర్యవంశాన్ని అంతం చేసి సుంగవంశాన్ని స్థాపించాడు.

**మౌర్యవంశ చక్రవర్తుల పాలనాకాలం**

| చక్రవర్తి | పాలనాకాలం (క్రీ.పూ) | పాలించిన కాలం |
|---|---|---|
| చంద్రగుప్తమౌర్యుడు | 322-298 | 25 సం॥లు |
| బింబిసారుడు | 297-272 | 26 సం॥లు |
| అశోకుడు | 273-232 | 43 సం॥లు |
| కునాలుడు | 232-224 | 09 సం॥లు |
| దశరథుడు | 224-215 | 10 సం॥లు |
| సంప్రాత | 215-202 | 14 సం॥లు |
| శాలిసూక | 202-175 | 13 సం॥లు |
| శతధన్వాన్ | 195-187 | 09 సం॥లు |
| (పూర్తి ఆధారం లభ్యం కాలేదు) | | |
| బృహద్రదుడు | 187-185 | 03 సం॥లు |

(సమాచారం పూర్తిగా లభించనందున చక్రవర్తులు వారి కాలం విషయంలో భిన్నాభిప్రాయాలు వున్నాయి)

మౌర్య చక్రవర్తులందరిలో అశోక చక్రవర్తి పరిపాలన ప్రజలకు ప్రీతిపాత్రమైనది. బౌద్ధధర్మ ప్రభావం ఇతని పాలనలో ప్రస్ఫుటంగా కనిపించి ప్రజలు శాంతిప్రియులు, దయామయులుగా జీవించటానికి ఎంతో దోహదపడింది. బుద్ధుని బోధనలను విన్న చక్రవర్తులైనా, చోరులైనా, మహరాణులైనా, వేశ్యలైనా, పండితులైనా, పామరులైనా వాటిని తమ జీవితాల్లో పండించు కునేవారు. చరిత్రలో మనకు ఎన్నో ఆధారాలు ఈ విషయాన్ని ధృవీకరిస్తాయి. అలాగే చండ

అశోకుడు శాంతికాముకుడై రాజ్యాన్ని ధర్మబుద్ధితో పరిపాలించి అత్యధిక భూభాగాన్ని ఎక్కువకాలం ప్రజాభీష్టంగా పరిపాలించి ఆచంద్రార్కం చరిత్రలో గొప్ప వ్యక్తిగా నిలిచిపోయాడు. చరిత్ర వున్నంతవరకు అశోకుడు మనకు కనిపిస్తూనే వుంటాడు. ప్రజలు ఆదరిస్తూనే వుంటారు. దేశాన్ని రాష్ట్రాలుగా, జిల్లాలుగా, మండలాలుగా, గ్రామాలుగా విభజించడం, మంత్రిమండళ్ళు, శాఖలు, ఉద్యోగులు ఇవన్నీ నాటి అశోకుని పాలన నుండి స్వీకరించినవే. ఐక్యరాజ్యసమితి, నానాజాతి సమితి లాంటి శాంతికాముక సంస్థలన్నీ అశోకుని వారసత్వమే అని ఆనందంగా చెప్పుకోవచ్చు. నేటి ఆధునిక కాలంలో ప్రభుత్వాలు చేయలేని అనేక బృహత్తరమైన సంక్షేమ కార్యక్రమాలు అశోకుడు అమలు చేశాడు.

అశోకుడు అందించిన నీతివంతమైన, ధర్మబద్ధమైన, శీలవంతమైన, శాంతి కాముకమైన పరిపాలనకు ప్రధాన కారణం అశోకుడు బౌద్ధాన్ని స్వీకరించడమేనని ఎన్నిసార్లయినా చెప్పుకోవచ్చు

నేటి ప్రపంచాన్ని వణికిస్తున్న ఉగ్రవాదం అశాంతికి హేతువైన సామ్రాజ్యవాదం, కరువైపోతున్న మానవత్వం, తరిగిపోతున్న దయ, కరుణ, మైత్రి లాంటి మానవీయ లక్షణాలకు పరిష్కారానికి అతి సులువైన పద్ధతి బౌద్ధమార్గం. నేటి పాలకులు బౌద్ధమార్గాన్ని అనుసరిస్తే అశోకుడందించిన ఉత్తమ పరిపాలనను ప్రజలకు అందించి ప్రపంచ శాంతిని సాధించవచ్చు. దీనికి బౌద్ధమే శరణు. ❋

*–రచయిత సెల్ : 94908 34124*

## సాంచీలో బౌద్ధ విశ్వవిద్యాలయానికి శంకుస్థాపన

**వా**రణాసి సమీపంలోని సాంచీ బౌద్ధక్షేత్రంలో బౌద్ధ విశ్వవిద్యాలయానికి శ్రీలంక ప్రెసిడెంట్ రాజపక్స 2012 సెప్టెంబర్ 21వ తేదీ శుక్రవారం శంకుస్థాపన చేశారు. రాజపక్స వెంట భూటాన్ ప్రధానమంత్రి జిగ్మేవై-థిన్లే, మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శివరాజ్ సింగ్ చౌహాన్, గవర్నర్ రామ నరేష్ యాదవ్ వున్నారు. శంకుస్థాపన తరువాత రాజపక్స శాంతి సామరస్యాల మీద ఉపన్యసించారు.

శాంతి అహింసలకు గాంధీ చేసిన సేవలను, భారతదేశంలో బౌద్ధ పునరుద్ధరణానికి అంబేద్కర్ చేసిన సేవలను ప్రశంసించి, శాంతి సాధన అనేది భారతీయ శ్రీలంకేయుల ఉమ్మడి కార్యమని చెప్పారు. సాంచీ స్థూపం ఒక అద్భుతమని దానికి పూజలు జరిపారు. బోధివృక్షం శాఖలను నాటారు.

ఇక్కడ రూపుదాల్చనున్న ఈ బౌద్ధ విశ్వవిద్యాలయంలో బౌద్ధ అధ్యయనాలను, ఇండో-ఐరాపా భాషలను సంస్కృతంతో కలిపి, వీటి నుండి జనించిన ఆధునిక భాషలను (Buddhist and Indic studies) అధ్యయనం చేయడం జరుగుతుంది.

## అశోక దీపావళి

**మ**హాయాన సంప్రదాయానికి చెందిన నేపాల్‌లోని నేవార్ ప్రజలు దీపావళిని ఎంతో ఘనంగా జరుపుకుంటారు. అశోకుడు బౌద్ధదీక్ష తీసుకున్న రోజుకు గుర్తుగా వీరు ఈ పండుగను చేసుకుంటారు. బౌద్ధ విహారాలను ఆ రోజున దీపాలతో అలంకరిస్తారు. భారత దేశంలో కాలంతో లయమైన ఎన్నో అపురూప బౌద్ధ గ్రంథాలు ఈ నేవార్ ప్రజల బౌద్ధ విహారాల నుండే రాహుల్ సాంకృత్యాయిన్ సేకరించి ఆధునిక ప్రపంచానికి అందించారు.

*(ది.6-11-2102 హిందూ పత్రిక సౌజన్యంతో)*

# అశోకుడు- గిరిజన సంక్షేమం

**అ**శోకుడు గొప్ప చక్రవర్తి మాత్రమే కాదు. మహోన్నత మానవతావాది. ఆయన ప్రజల్ని తన కుటుంబంగా భావించాడు. తాను ఒక 'బహు కుటుంబీకుణ్ణి' అని ప్రకటించుకున్నాడు. ఆయన చేసిన ప్రజా సంక్షేమ కార్యక్రమాలు ఈనాటికీ ఆదర్శనీయమే. ఆయన ఆలోచనలు ఎంత గొప్పవో ఈ విషయం ఋజువు చేస్తుంది.

అడవుల్లో జీవించే గిరిజనుల్ని 'ఆటవికులు'గా నేటికీ భావిస్తూనే ఉన్నాం. వారి అమాయకత్వాన్ని నాగరికులు సొమ్ము చేసుకుంటూనే ఉన్నారు. ఈ విషయంలో ఆమెరికావారు, బ్రిటీషువారు, చివరికి భారతీయులూ అందరిదీ ఒకే దారి. ప్రభుత్వాలపై ఎన్నో గిరిజన పోరాటాలు వచ్చాయి. ప్రపంచ ప్రసిద్ధి పొందిన అలెక్సీహెలీ 'ఏడు తరాలు' (Roots) నవల ఇందుకు ఒక చక్కని తార్కాణం. బిర్సా ముండా పోరాటం, అల్లూరి సీతారామరాజు పోరాటం, భారత కాలంలో ఏకలవ్యుని వీరోచిత జీవితం ఇవ్వన్నీ ఆటవిక గిరిజన ప్రజా జీవనానికి చెందినవే.

బుట్టెడు 'ఉప్పు' నిచ్చి, బుట్టెడు చింతపండు తెచ్చుకొని గిరిజన అమాయకత్వాన్ని దోపిడీ చేసిన ప్రాంతం ఆనాటి కళింగ, నేటి శ్రీకాకుళం ప్రాంతంలోని గిరిజన ప్రాంతం. ఈ నాగరికుల దోపిడీకి వ్యతిరేకంగా సాగిందే శ్రీకాకుళ గిరిజన పోరాటం.

ఈనాడే కాదు... అశోకుని కాలంలో కూడా ఆ కళింగ (ఆంధ్రా, ఒరిస్సా) ప్రాంతంలో ఎంతోమంది గిరిజనులుండేవారు. వారిని ఆనాటి నాగరిక సమాజం అసలు మనుషులుగానే చూసేవారు కాదు. పశువుల్లా వేటాడేవారు. బానిసలుగా పనులు చేయించుకునేవారు. అశోకుడు కళింగను జయించాక గిరిజనుల స్థితిగతుల్ని గమనించి ఒక అధికార ఆజ్ఞ జారీ చేశాడు. ఇది 13వ శాసనంలో ఉంది.

ఇలా :-

"మగధ దేశంలో ఏ ప్రాంతంలో అయినా ఆటవికులను చంపటం నిషేధం. ఆయా ప్రాంతాల్ని (ముఖ్యంగా కళింగ) పాలన చేసే పాలనాధికారులకు, దండనాయకులకు, ప్రభువులకు ఇది నా విన్నపం. ఆటవికుల ఎడల దయతో మెలగాలి. వారిని కూడా 'నా' బిడ్డలలాగే ఎంచాలి. వారికి సౌఖ్యం కలగజేయడానికి కృషి చేయాలి. దుఃఖపెట్టే ఉద్దేశ్యం ఎవ్వరికీ ఉండరాదు. ఇది మీరంతా తప్పక పాటించాల్సిన నా ఆజ్ఞ. వారికి మన పట్ల విశ్వాసం కలిగించాలి. ముఖ్యంగా రాజు పట్ల విశ్వాసం కలిగించాలి. వారికి ధర్మోపదేశాలు చేసి వారిని ధమ్మ మార్గాన్ని అవలంబించేలా చేయండి. అలా చేస్తే వారంటే చక్రవర్తికి ప్రేమ అనీ, వారికి ఇహపరాల్లో సుఖశాంతులు దొరుకుతాయని చెప్పండి. ఆయా ప్రాంత అధికారులు నా ఈ ఆజ్ఞల్ని త్రికరణశుద్ధిగా నెరవేరిస్తే నేను కృతార్థుడను అయినట్లే..."

ఇదీ అశోకుని శాసనం. బహుశ... గిరిజనులను గురించి తొలిగా పట్టించుకొన్న మొట్టమొదటి వ్యక్తి అశోకుడేనేమో! ❋

–సేకరణ : **బుద్ధభూమి బృందం**

| | |
|---|---|
| **చందా దారులకు మనవి** | చందాకాలం ముగిసినవారు చందా పునరుద్ధరణ కోసం పత్రిక సం॥ర చందా రు. 150/–లు మనియార్డరు ద్వారా పంపగలరు. మనియార్డరు పత్రంపై మీ చిరునామా డోర్ నెం., పిన్‌కోడ్, సెల్ నెం. తప్పని సరిగా రాయగలరు. బుద్ధభూమి సంచిక ప్రతినెల 5వ తేదీలోపు పోస్ట్‌లో పంపించడం జరుగుతుంది. –సం. |

# అమ్మకానికి అశోకుని తల

- కస్తూరి శివభార్గవి

**తూ**ర్పు దిక్కు నుంచి సూర్యుడు తన వెలుగు రేఖలను వెదజల్లుతూ పుడమితల్లికి సంతోషాన్ని కలిగించడానికి మెల్లమెల్లగా ఆకాశంలో ప్రయాణం చేస్తున్నాడు. దూరంగా గుర్రపుడెక్కల చప్పుడు వినబడుతుంది. సమ్రాట్ అశోకుడు అతని మంత్రి యశుడు ఇద్దరూ ఉదయ వ్యాయామాన్ని పూర్తి చేసుకొని కోటవైపు రాజమార్గం గుండా వస్తున్నారు. 'బుద్ధం శరణం గచ్ఛామి' 'ధర్మం శరణం గచ్ఛామి' 'సంఘం శరణం గచ్ఛామి' అంటూ త్రిరత్నాలు ప్రచారం చేస్తూ వస్తున్న ఒక భిక్షు సంఘం ఎదురు పడింది. వాళ్ళను చూడగానే అశోకుడు తన గుర్రపు వేగాన్ని తగ్గించి గుర్రాన్ని దిగాడు. భిక్షు సంఘానికి ఎదురు వెళ్ళాడు. మంత్రి యశుడు కూడా సమ్రాట్‌ను అనుసరించాడు.

ఆ భిక్షు సంఘాన్ని సమీపించగానే ప్రధాన భిక్షువు పాదాలకు తలవంచి అశోకుడు నమస్కరించాడు. భిక్షు సంఘం కదిలి వెళ్ళి పోయింది. అది చూసిన మంత్రి యశుడు తొట్రుపాటుతో "మహారాజా! మీది పవిత్రమైన జలాలతో అభిషిక్తమైన శిరస్సు. అది నిత్యము మకుట ధారణతో అందరి నమస్కారాలను స్వీకరించాలి గానీ ఎటువంటి వారికైనా తల వంచకూడదు" అన్నాడు.

ఆ మాటలు వినగానే అశోకుడు చిరునవ్వు నవ్వి ముందుకు కదిలాడు. యశుడు ఆ చిరునవ్వును తనకు ప్రశంసగా భావించి సమ్రాట్‌ను అనుసరించాడు.



కొద్దిరోజుల అనంతరం సమ్రాట్ అశోకుడు మాంసపు కొట్టు నుంచి గొర్రె, మేక లాంటి కొన్ని జంతువుల తలలను తెప్పించాడు. వాటితో పాటు ఒక అనామకుడైన మనిషి శిరస్సు కూడా తెప్పించాడు. వాటన్నింటిని భటులకిచ్చి అమ్ముకు రమ్మన్నాడు. భటులు వాటిని తీసుకువెళ్ళి అమ్మకానికి పెట్టారు. జంతువుల తలలన్నీ అమ్ముడు పోయాయి. కానీ మనిషి తల మాత్రం ఎవరూ కొనలేదు. ఆ విషయాన్ని సమ్రాట్‌కు చెప్పగా సమ్రాట్ ఆ శిరస్సును ఎవరికైనా ఉచితంగా ఇవ్వమని చెప్పాడు. మరల భటులు ఊరంతా తిరిగి ఆ శిరస్సును ఇవ్వడానికి ప్రయత్నించారు. ఎవరూ తీసుకోవడానికి సమ్మతించలేదు.

ఆ విషయాన్ని చక్రవర్తికి తెల్పారు.

అప్పుడు అశోకుడు "అది అనామకుని శిరస్సుని భావించి ఎవరూ తీసుకోవడానికి అంగీకరించలేదు. చక్రవర్తినైన నా శిరస్సు విక్రయిస్తే కొంటారా?" అని అడిగాడు.

అందుకు భటులు జవాబు చెప్పడానికి సంశయిస్తూ చివరికి ధైర్యాన్ని తెచ్చుకొని, "మహారాజా ఈ లోకంలో పక్షుల, జంతువుల తలలనే కొంటారు. మానవుని శిరస్సును మాత్రం ఎవరూ తీసుకోరు. అది సామ్రాట్టుదైనా, సేవకుడిదైనా, సామాన్యుడిదైనా" అని పలికారు.

అప్పుడు అశోకుడు పక్కనే ఉన్న తన మంత్రి యశుని వైపు సాలోచనగా చూచి "ప్రకృతిలో పక్షుల, జంతువుల శిరస్సు కంటే నిరుపయోగమైన ఈ శిరస్సును వంచి ఒక జ్ఞాని పాదాలకు నమస్కరించినంత మాత్రాన దీని గౌరవం తగ్గుతుందా?" అన్నాడు. యశుడు మారు మాటాడలేదు. చక్రవర్తి ఔన్నత్యానికి సంతోషపడ్డాడు.

-రచయిత్రి ఫోన్ : 08648-256320

# అశోక రాజ్యమే బుద్ధ భారతి

-ఎస్. టాంగ్

ప్లేగు భయంకరమైన వ్యాధి; సోకితే తుడిచిపెట్టుకు పోతారు. అలాంటిదే మరొక వ్యాధి వుంది. అది అంత భయంకరమైనది కాకపోయినా ప్రజలను పీల్చి పిప్పి చేస్తుంది. అదే ఆకలి జబ్బు పేదరికం. ఆహారం లేకపోతే ఆకలి జబ్బు వస్తుంది. అసమాన ఆర్థిక వ్యత్యాసాల నుంచి ఆకలి జబ్బు పుడుతుంది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సలహామండలి (గ్రూప్ ఆఫ్ మినిస్టర్స్) సమాలోచన జరిపి ఆకలి జబ్బు నివారణ చర్యలు చేపట్టింది. ఒక దెబ్బకు రెండుపిట్టలు అన్నట్లు, ఆకలి జబ్బుకు, త్రాగునీటి కొరతకు ఆల్కహాల్ (సారా) ను ప్రజలకు అందుబాటులోకి తెచ్చింది. పట్టణాల్లో, పల్లెల్లో ఊరూ వాడా, గల్లీల్లో సందుల్లో, పాన్‌డబ్బాల్లో కిరాణా దుకాణాల్లో బెల్టుషాపుల్లో సారా అమ్మే ఏర్పాట్లు చేసింది. ప్రజలు సారా త్రాగి విచక్షణా జ్ఞానం కోల్పోయి మత్తులో జోగాడుతూ ఏది మంచో, ఏది చెడో తెలుసుకోలేని పరిస్థితిలో వున్నారు.

మనదేశంలో వేల సంఖ్యలో భాషలున్నాయి. ఈ భాషల మధ్య సహనం, సంయమనం లేదు. ఒక భాష మరొక భాష కన్న గొప్పదిగా భావించేటట్లు చేసింది ప్రభుత్వం. సంస్కృతం గొప్ప భాషగా భావించబడితే ఎరుకల, ఏనాది (యానాది) వారి భాష తుచ్ఛంగా, నీచంగా భావించబడుతోంది. పద్దెనిమిది భాషలనే ప్రభుత్వం గుర్తించడం వల్ల భాషల మధ్య జగడం జరుగుతోంది.

భారతదేశంలో నివసించే వారందరిలో జాతీయ భావనలేదు. జాతీయ భావ దారిద్ర్యం ప్రజల దారిద్ర్యంలో, పేదరికంలో ఒక భాగమయింది.

రాజులు లేక పోయినా, రాజ్యాధికార పోకడలున్నాయి. ఒక ఎమ్.ఎల్.ఏ. గాని, మంత్రి హోదాలో వున్నవారు గాని వారి నియోజక వర్గానికి రాజు, ఒక సామంత. అలాగునే పంచాయతీకి ప్రెసిడెంటు; పెద్ద వ్యాపారస్తులైన వారికి ఒక వ్యాపార సామ్రాజ్యముంటుంది. పరిశ్రమలు నడిపే పరిశ్రమ అధిపతులు కూడా అంతే.

ప్రపంచ జనాభాలో ఏడవవంతు అనగా 14.30 శాతం జనాభా కలిగిన భారతదేశం ప్రజలు దీనావస్థలో వున్నారు. ప్రభుత్వాలు పైకి డాంబికాలు పలుకుతున్నాయి.

ప్రభుత్వ పరిపాలన అస్తవ్యస్తంగా వుంది. ప్రభుత్వంలో భయంకర ప్రకంపనలు, యుద్ధ వాతావరణం నెలకొని వుంటుంది. ప్రజాస్వామ్య వాతావరణం పూజ్యమయింది. ప్రభుత్వ చర్యలు ప్రజావ్యతిరేక నిర్ణయాలకు నెలవైంది.

ఇది భారతదేశం యొక్క పరిస్థితి. అనాగరిక ప్రపంచాన్ని గుర్తుకు తెస్తోంది. ప్రజలకు మనస్తాపం కలిగించే అసభ్య పదజాలం ప్రభుత్వాధినేతలు ఉపయోగిస్తున్నారు (barbarism) మానవ జీవితానికి అవసరమైన నిత్యావసర వస్తువుల సరఫరా విషయాలో ప్రజలను ప్రభుత్వం బాధలకు గురిచేస్తోంది.

మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూలు ఆశించిన రాజ్యం ఇది కాదు.

ఇది రామరాజ్యమో, రావణరాజ్యమో, ఎల్.కె. అద్వానీ, సోనియాగాంధీల రాజ్యమో తెలియడం లేదు.

ఇటువంటి దుర్భర దుస్సహన, భీకర ప్రభుత్వాల నుంచి బయటపడే మార్గం లేదా? లేకేమి! ఉంది.

ఈ నేపథ్యంలో సామ్రాట్ అశోకుడుని అధ్యయనం చేయవలసిన అవసరం చాలా వుంది.

సామ్రాట్ అశోకుడు ఈ దేశాన్ని పరిపాలించిన గొప్ప చక్రవర్తి. ఆయనకు ప్రియదర్శిన్ అని దేవుళ్ళకు ప్రియమైనవాడు (Beloved of the Gods) అని వాడుకలో వుంది. ఆయన క్రీ.పూ 273 నుంచి 232 వరకు రాజ్యపాలన చేసినట్లు చరిత్ర. అంటే ఇప్పటికి 2285 (2012+273) సంవత్సరాల పూర్వం చరిత్ర ఆ రోజుల్లో రాజులకు అసలు పేరుతో పాటు బిరుదులు కూడ వుండేవి. అసలు పేరు అశోక. దేవానం ప్రియ అని, దేవానం ప్రియదర్శి అని, రాజా అశోక్ అని ఆయనే పెట్టుకున్నారు. ఆ రోజుల్లో మహారాజా, రాజాధిరాజా ఇత్యాది బిరుదులు లేవు.

భట్టోజి దీక్షిత్ అనే రచయిత దేవానాం ప్రియ అంటే మానసికరోగి అని (fool) మూర్ఖుడు, తెలివి తక్కువవాడు(dunce) అనే అర్థ వివరణ ఇచ్చాడు. కాని, శబ్దార్థం ఏమిటంటే ప్రేమతో, దయతో చూసేవాడని.

అశోకుడు యువరాజుగా పట్టాభిషిక్తుడయినా నాలుగు సంవత్సరాలకు సింహాసనాన్ని అధిష్టించాడు. ప్రతి సంవత్సరం పట్టాభిషేక మహోత్సవం జరుపుకునేవాడు. అ సందర్భంగా ఖైదీలను విడుదల చేయించేవాడు.

భారతదేశం స్వాతంత్ర్య మహోత్సవాలు జరుపుకుంటోంది. ఎర్రకోట నుంచి ఉపన్యాసం తప్ప ఆ రోజు గుర్తుంచుకునే విషయం ఏమీ ఉండదు.

అశోకుని వృత్తాంతం తెలియదానికి చారిత్రకాధారాలు లభ్యమయినాయి. కొండల మీద చెక్కిన శాసనాలు, రాతి స్తంభాలపై చెక్కిన శాసనాలు, కొండగుహలలో చెక్కిన శాసనాలు తెలియజేస్తున్నాయి. ఇప్పటివరకు కొండల మీద చెక్కడాలు శాసనాలు(Rock Inscription of edicts 14) రాతిస్తంభాల మీద చెక్కడాలు (Pillar Inscriptions 7) కొండగుహల్లో చెక్కినవి 4, వీటిని శిలాస్తంభాలని, శిలాఫలకాలని కూడా చెప్పబడ్డాయి.

వీటి ద్వారా విలువైన విషయాలు తెలుస్తాయి. ఆశోకుడు విజయాన్ని "ధమ్మవిజయ" మని, మంగళాన్ని "ధమ్మమంగళ"మని, దానాన్ని "ధమ్మదాన" మన వ్యవహరించాడు.

యజ్ఞయాగాలలో జంతుబలిని ఒక శాసనం ద్వారా కట్టడి చేశాడు. ఎద్లకు విత్తులు కొట్టరాదని శాసించాడు. రాజుగారి వంటశాలలో ప్రతిరోజు కూర కొరకు వధిస్తున్న పశువులను ఆపు చేశాడు. పశువుల కొరకు ఆస్పత్రులను ఏర్పాటు చేశాడు. జంతువుల యెడల, ప్రతి ప్రాణి యెడల ఆయనకు గల కరుణ, దయ నిరూపించుకున్నాడు.

ప్రజలందరూ తన బిడ్డలని వారి యోగక్షేమములే ప్రధానమని ఒక శాసనంలో అశోకుడు తెలియజేశాడు.

ప్రజల యోగక్షేమాలను కట్టుదిట్టంగా అమలు పర్చటానికి అంతకు ముందెన్నడూ లేని ఒక సృష్టి చేశాడు. అతడే "ధర్మమహామాత్ర" ఈ విధానాన్ని తన వారసులందరూ అమలు పర్చాలని శాసనంలో పేర్కొన్నాడు.

రాజుగారికి ప్రజల విషయం తెలియపరిచే విధానంలో ఒక పెను మార్పును శాసనం ద్వారా చేశాడు. రాజుకు ఇరవై నాలుగు గంటలు, తాను ఎక్కడున్నా భోజనం చేస్తున్నా, వనవిహారం చేస్తున్నా, విహార మందిరాల్లో వున్నా ప్రజల విషయం తనకు తెలియజేయాలని, అది తనకు పవిత్రమైన కార్యంగా భావిస్తానని, అది యావత్ ప్రపంచ మానవాళికి శ్రేయోదాయకంగా భావిస్తున్నానని, ఇది జీవరాశికి తాను ఋణం తీర్చుకోవటంగా నమ్ముతున్నానని ఈ శాసనం చిరకాలం పాటించాలని శాసనంలో పేర్కొన్నాడు.

అశోకుడు బుద్ధగయ సందర్శించిన అనంతరం ఆయన "బిక్షుగాటి" దశ నుంచి బౌద్ధం యెడల అవగాహన పెంచుకుని బౌద్ధధర్మ ప్రచారానికి పూనుకున్నాడు. ఆయన బౌద్ధ ధర్మ ప్రచారానికి వినియోగించిన పద్ధతులు అశోక చరిత్రలో ఒక విశిష్టస్థానాన్ని ఆక్రమించటమేగాక, నేటికి కూడా ఆ పద్ధతులనే అనేక మతాలు అవలంబిస్తున్నాయి. అన్ని మతముల యెడల సమధర్మం, సహనం పాటించాడు. ప్రజలకు బోధించవలసినదిగా అందుకు నియమించిన ప్రభుత్వోద్యోగులను శాసించాడు. దేవతలకు ప్రీతి పాత్రుడయినాడు. ప్రజారంజకుడయినాడు.

ప్రపంచంలోని వివిధ దేశాల నుంచి ఔషధ మొక్కలను తెప్పించి, వాటిని పెంచి, పోషించి ఔషధముల తయారీకి తద్వారా రోగచికిత్సలకు వైద్య శాలలను ఏర్పాటు చేసిన ఘనత అశోకుడిది.

ఇప్పుడు మనం ఔషధములను దిగుమతి చేసుకుంటున్నాము. భారతీయుడు (ఆంధ్రుడు) సుబ్బారావు విదేశాలకు వెళ్ళి పరిశోధనలు చేసి టెట్రాసైక్లిన్, ఫోలిక్ యాసిడ్‌లను కనుగొన్నాడు అలాంటి సౌకర్యాలు ఈ దేశంలో లేవు.

అశోకుడ్ని గురించి చెప్పాలంటే డాక్టర్ బాబాసాహెబ్ బి.ఆర్.అంబేద్కర్ లాంటి విద్యావేత్తలకు సాధ్యమవుతుందే దక్క, సామాన్య రచయితలకు అశోకుడు రోడ్లు వేయించెను, రోడ్ల కిరువైపుల చెట్లు నాటించెను, బావులు త్రవ్వించెను, సత్రములు కట్టించెను లాంటి విషయాలకు మాత్రమే పరిమితమౌతారు.

అశోకుని సామ్రాజ్యం చాల విశాలమైంది అంత పెద్ద సామ్రాజ్యాన్ని ఎలా నిర్వహించాడు, ప్రభుత్వ విధానాలు, ప్రభుత్వోద్యోగులు, ఆర్థిక వనరులు ఎలా సమకూర్చుకున్నాడు. బౌద్ధాన్ని ఎలా ప్రచారం చేశాడు. బౌద్ధ బోధనలకు అవలంబించిన విధానాలు వగైరాలు చాలా విస్తృతమైనవి.

ఒక ముఖ్యమైన విషయం : తాను బౌద్ధం అవలంబించి ప్రజలకు ప్రచారం చేశాడు. ప్రజలు అవలంబించారు. తన కుటుంబ సభ్యులు సంఘమిత్ర, మహేంద్రలను బౌద్ధప్రచారానికి విదేశాలకు పంపాడు. బౌద్ధ సంఘ నియమావళిని అతిక్రమించినవారు శిక్షార్హులని శాసనం చేశాడు. బిక్షువులు అతిక్రమించినట్లయిన తెల్లని దుస్తులు ధరింపజేయబడుదురని శాసనం. ఆయన ప్రభుత్వోద్యోగులు విరివిగా, క్రమం తప్పక దేశం నలుమూలల తిరిగేవారు (టూర్స్).

భారతదేశ చరిత్రలో అశోక చక్రవర్తి చరిత్ర విశిష్టస్థానాన్ని ఆక్రమించి వుంది. ఈ చరిత్ర ప్రజలకు, ప్రజల జీవన విధానానికి, ప్రభుత్వానికి, ప్రభుత్వ నిర్వహణకు, ఆర్థికశాఖకు, అంతర్జాతీయ సంబంధాలకు- అన్నిటికీ సంబంధించినది. అలాంటి ముఖ్యమైన చరిత్ర పాఠ్యపుస్తకాలలో ప్రవేశపెట్టబడలేదు. అశోకుడు ఎప్పుడు పుట్టాడు. అనేది ముఖ్యం కాదు. తన సామ్రాజ్యాన్ని ఎలా పరిపాలించాడు అన్నది ముఖ్యం.

ఆంధ్రదేశంలో ఈ విషయానికి సంబంధించి ఒక మంచి వాతావరణం నెలకొని వుంది. మాన్యులు, అమాత్యవర్యులు డొక్కా మాణిక్య వరప్రసాదరావు విద్యావేత్త. అలాంటివారు ఈ విషయంలో శ్రద్ధ తీసుకోవాలి. కానీ అవాంతరాలు వున్నాయి. ప్రభుత్వోద్యోగాలలో వున్నవారు ఈ విషయంలో ఒక నోట్ (Note) ద్వారా మంత్రివర్యుల దృష్టికి తీసుకొని వెళ్లి దానికి కావలసిన గవర్నమెంట్ ఆర్డర్(G.O) వెలువడే రీతిలో కృషి చేయాలి. క్రింది ఆఫీసర్లకు అశోకుడంటే ఎవరో తెలియకపోతే మంత్రివర్యులకు ఏమి తెలియజేస్తారు. ఇది పెద్ద చిక్కుప్రశ్న.

కనుక విద్యావేత్తలు, చరిత్రకారులు పాఠ్య పుస్తకాలను తిరగ రాయాలి. మామిడిపూడి వెంకటరంగయ్యలాంటి చరిత్రకారులు కూడా అశోకుడ్ని విస్మరించారు. బహుశః అతిపెద్ద

వారికి కూడా అంతరంగంలో కుత్సితబుద్ధులు, రాగద్వేషాలు ఉన్నాయేయో అనిపిస్తుంది.

ఇలాంటి చెడ్డగుణాలు లేని మనిషి, విద్యావేత్త ఒకరున్నారు. ఆయనే దామోదర రాజనరసింహ. ఆంధ్రదేశ ప్రభుత్వంలో ఆయన డిప్యూటీ ముఖ్యమంత్రిగా వ్యవహరిస్తున్నారు. ఆయన తెలుగు అకాడమీ అధ్యక్షులు. ఈ దేశానికి ఈ ప్రజలకు అత్యవసరమైన అశోక చక్రవర్తి చరిత్రను సమగ్రంగా అలాంటివారి దృష్టికి తీసుకురావలసిన అవసరం ఎంతైనా వుంది. ఇది ఎవరు చేస్తారు?

ప్రభుత్వోద్యోగాలలో నియమింపబడేవారికి రాష్ట్రస్థాయిలో, కేంద్ర ప్రభుత్వ స్థాయిలో పరీక్షలు నిర్వహించబడతాయి. ఈ రెండు తరహా పరీక్షలలో అశోకుడ్ని గురించి ఒక తప్పనిసరి పశ్నాపత్రం (compulsory subject) నిర్వహించాలి. కేంద్రస్థాయిలో ఉత్తీర్ణులైన వారికి లభించిన మార్కులను బట్టి ఐ.ఏ.ఎస్., ఐ.పి.ఎస్., ఐ.ఎఫ్.ఎస్., ఐ.ఆర్.ఎస్ స్థాయిలో ఉద్యోగాలు ఇవ్వాలి. రాష్ట్రస్థాయిలో వారికి అదేవిధంగా గ్రూప్ 1, 2, 3,4 ఉద్యోగాలు ఇవ్వాలి. అతి తక్కువ క్రింది స్థాయిలో కూడ అశోకుడ్ని గురించి తెలిసి వుండాలి.

ప్రభుత్వం సారనాథ్‌లోని అశోక చక్రం స్తంభంపై గల నాలుగు సింహాల గుర్తుతో సరిపెట్టుకోవటమే గాక అహింసామూర్తిగా మహాత్మాగాంధీ బొమ్మ కర్సెన్సీనోట్లపై ముద్రిస్తున్నారు. మంచిదే! అహింసను బోధించిన బుద్ధుడు, అహింసను దేశ విదేశాలకు ప్రచారం చేసిన అశోకుడు గుర్తుకురాకపోవడం ఆశ్చర్యం, దుఃఖించతగింది. ఎందుకు ఈ విచక్షణ? అశోకుడ్ని గురించి అధ్యయనం చేయకపోవడం గాని లేక చరిత్రను వక్రీకరించడం గాని అయివుండాలి.

అశోక చక్రవర్తి పరిపాలనకు సంబంధించిన విషయాలన్నిటిని సమగ్రంగా లోతుగా అధ్యయనం చేసి ఆచరిస్తే మానవాళి సుఖసంతోషాలతో వర్ధిల్లుతుంది.

రీసెర్చి స్కాలర్స్‌కు ఈ పని ఎందుకు అప్పగించడం లేదు? అశోకుడ్ని వెలికి తీయడం విద్యావేత్తలకు, రాజకీయ నాయకులకు ఇష్టం లేదు. శ్రీనాధుడు, భక్త పోతన, భక్త రామదాస్, విశ్వనాథ, శ్రీశ్రీలపై పరిశోధనలు జరిపి డాక్టరేట్లు తీసుకుంటారు. విశ్వవిద్యాలయాల్లో డాక్టరేట్లు అమ్ముకుంటారు- కొనుక్కుంటారు.

అశోకుడి కాలంలో అశోక సామ్రాజ్యంపై ఇతర దేశాలు దండెత్తలేదు. అశోకుడు సామ్రాజ్య విస్తరణ కాంక్షతో ఇతర దేశాలపై దండెత్తలేదు. ఎంతటి గొప్పరాజనీతి. ఈ సూత్రం ప్రతి పౌరుడి హృదయంలో స్థిరంగా వుంది. నిర్భయంగా వున్నారు.

జవహర్‌లాల్‌నెహ్రూ అలీన విధానం, పంచశీలనే పేరుతో భారత భూభాగం చుట్టూ వున్న పొరుగు దేశాలతో మైత్రి జరిపినా, స్నేహం చేసినా యుద్ధాలు తప్పలేదు. అంటే ప్రజలను బౌద్ధం వైపు మరల్చకుండా తాను బౌద్ధం అవలంబించకుండా ఇతరులకు మాత్రం బౌద్ధ ధర్మం ఉపదేశిస్తే వారు నమ్ముతారనుకోవటం భ్రమ.

బౌద్ధధర్మాన్ని అర్థం చేసుకోవాలి. ఆచరించాలి. అప్పుడే ఇతరులకు విశ్వాసం కలుగుతుంది. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, స్పీకర్లు, డిప్యూటీ స్పీకర్లు, ప్రధాన, ముఖ్యమంత్రులకు, ఇతర మంత్రివర్యులకు, రాజకీయ పార్టీల నాయకులకు బౌద్ధధర్మం తెలియదు. బౌద్ధధర్మం తప్ప ఇతర మతాలు తెలుసు. పక్కింటికూర రుచి. అశోకుడు అంతకన్నా తెలియదు.

మనదేశ ఔన్నత్యానికి, ప్రజల యోగక్షేమాలకు, సుఖశాంతులకు అశోకుని మార్గదర్శకంగా తీసుకుని ఆ దిశగా ప్రభుత్వాలు, ప్రభుత్వాధికారులు, ప్రజాప్రతినిధులు కృషి చేసిననాడు భారతదేశం బుద్ధభారతిగా (బుద్ధదేశం) అదే అశోక రాజ్యంగా ప్రవర్ధమానమౌతుంది. ఇది చేయకుండా ఎన్ని పథకాలు ప్రవేశపెట్టినా నిష్ప్రయోజనాలే. కనుక 'బుద్ధభారతి' పథకం ప్రవేశపెట్టాలి. ❋

-రచయిత సెల్ : *92904 13847*

# అశోకుడు-పర్యావరణం

-ఉపాసక **వి.వి.కృష్ణారావు**

**భా**రతదేశ చక్రవర్తుల్లో కొంతమంది బౌద్ధ ధర్మాన్ని ఆచరిస్తే మరి కొంతమంది వైదిక ధర్మాన్ని అనుసరించారు. వైదిక ధర్మాన్ని ప్రోత్సహించని, ఆచరించని రాజులు గాని చక్రవర్తులు గాని యావత్ సమాజాన్ని గురించి ఆలోచించకుండా కేవలం ఒకటి రెండు వర్ణములకు మాత్రమే పరిమితమయ్యారు. (బ్రాహ్మణ, క్షత్రియులు) అందుకు భిన్నముగా బౌద్ధ ధమ్మాన్ని ఆచరించిన చక్రవర్తులు సమాజంలోని అన్నివర్గాల వారిని సమాదరించారు, వారిలో ప్రధముడు అశోక చక్రవర్తి.

ఉపగుప్తుడను బౌద్ధ భిక్షువు నుండి బౌద్ధాన్ని స్వీకరించిన తరువాయి బౌద్ధ ధర్మమును భారత భూభాగములోనే కాక మన ప్రక్క దేశములైనటువంటి శ్రీలంక, మయన్మార్, ఉత్తర ఆఫ్రికా మొదలగు దేశాలకు మాన్య భిక్షువులతో పాటు తన కుమారుడు, కుమార్తెను సైతం బౌద్ధ ధమ్మ ప్రచార కార్యమునకు వినియోగించిన ధీరోదాత్తుడు అశోకుడు. ఈయన పరిపాలనా కాలంలో భారత దేశమంతటా 84,000 స్థూప, చైత్యములు నిర్మాణం కావింపబడి వాటిపై బుద్ధ ధర్మసారమును శిలాఫలకములపై, స్థంభములపైన గుహ ఆలయాలపైన చెక్కించాడు. ఇంత గొప్ప కార్యములను నిర్వహించుటకు అతనికి ధర్మముపై వున్న అపారమైన అనురక్తే కారణం.

ఉత్తమమైన రాజ్యపాలనతో పాటు ప్రజాసంక్షేమ పధకాలు పర్యావరణం, పచ్చుదనం కోసం పాటుపడిన తొలి చక్రవర్తి కూడా అశోకుడే. రహదార్లకు ఇరుపక్కల కొన్ని లక్షల మొక్కలను ఒక సతతహరిత ఛత్రం లాగా నాటించాడు. ఈ ఫల వృక్షముల వలన పాదచారులు సేదతీర్చుకొనేవారు. నాడు ఎక్కువమంది పాదచారులే కదా! ఈ వృక్షములు ప్రజలకు ఎంతో మేలును చేకూర్చేవి.

వందలకొలది చెరువులను త్రవ్వించినాడు. ఈ చెరువుల వలన భూగర్భజల మట్టములు క్షీణించకుండా వుండి వృక్షసంపద మరియు భూగర్భంలో నీటి వనరులు సమృద్ధిగా వుండేటట్లు చర్యలు తీసుకొన్నాడు.

ప్రజలకు ప్రాణాధారమైన మంచినీరును అందించటానికి బావులను త్రవ్వించాడు.

నీరు ద్రవరూపంలో వున్న బంగారం అంటే అతిశయోక్తి కాదు. ప్రజలకు వాటివలన సాగునీరు త్రాగునీరు సమృద్ధిగా అందించిన అపర భరీరధుడుగా మనం అశోకుని గుర్తింపవచ్చును.

ప్రజలకు మరియు పశువులకు ఆరోగ్య పరిరక్షణ కోసం తన పరిపాలనా కాలంలో వైద్యశాలలను విరివిగా స్థాపించి (కట్టించి) ప్రజల యొక్క ఆరోగ్య పరిరక్షణకు ఎంతగానో కృషి చేసినాడు.

రహదార్లు వెంట యాత్రికుల సౌకర్యార్థం అనేకమైనటువంటి అతిధి గృహములను నిర్మింపజేసి యాత్రికులకు వసతి సౌకర్యాలను కల్పించినాడు.

అశోకుని కాలంలోనే మొట్టమొదటిగా జాతీయ రహదారుల నిర్మాణం జరిగింది. తక్షశిల నుండి పాటలీపుత్రం వరకు ఉజ్జయినీ నుండి సువర్ణగిరి(పరగుడి) పట్టణాలను పాటలీపుత్రం కలుపుతూ అశోకుడు రహదార్లు నిర్మింపజేశాడు. ఈ రహదార్ల అభివృద్ధి మూలంగా ప్రజలకు రవాణా సదుపాయం మెరుగై ప్రజలు ఒకచోట నుండి మరొకచోటకు సులభంగా

ప్రయాణించడానికి మార్గం సులభ సాధ్యమైంది.

పై వాటితోపాటుగా అనేక ప్రాంతాలలో ఉద్యాన వనాలను ఔషధ మొక్కల కేంద్రాలను నెలకొల్పి ప్రజలకు అనారోగ్య సమస్యలకు గురైనప్పుడు ఈ ఔషధ కేంద్రాలు ప్రజలకు అందుబాటులో వుండేటట్లు ఇవి నెలకొల్పబడ్డాయి.

"నా రాజ్యంలో ప్రజలందరూ నా కన్నబిడ్డలతో సమానం. నా బిడ్డలపరంగా నేను ఆశించినట్టే నా ప్రజలు అన్నివిధాలుగా సుఖశాంతులు పొందాల"ని భావించి పై ఆదర్శాలను మాటల రూపంలో కాకుండా కార్యరూపంలో పెట్టిన గొప్ప పరిపాలనాదక్షుడు అశోకుడు. 'దేవానాంప్రియ' (దేవతలకు ఇష్టమైనవాడు) ప్రియదర్శిని అనే బిరుదులు రెండు ప్రత్యక్షముగా అమరి ప్రజల హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోయిన ఒకే ఒక పాలకుడు అశోక చక్రవర్తి మాత్రమేనని చెప్పుకోవచ్చు.



ఇంతటి ఘనకీర్తికి కారణమైన అతడు భారతదేశాన్ని ఏకఛత్రాధిపత్యంగా పరిపాలన చేసి, బౌద్ధధమ్మవ్యాప్తితో పాటు ఆచరణీయమైన బౌద్ధునిగా పలు ప్రజాహిత కార్యక్రమాలు, పర్యావరణ పరిరక్షణ లాంటి కార్యక్రమాలను అశోకుడు అమలు చేశాడు. ఈ ప్రజాహిత సంస్కరణలు లేదా కార్యక్రమాలు (పనులు) వలన ఇతని పరిపాలనా కాలం చరిత్రలో ఒక సువర్ణ అధ్యాయంగా చెప్పుకోవచ్చు. చరిత్ర పుటలలో నిలిచిపోయే రాజుల జాబితాలో అశోకుడి పేరు ఒక్కటి మాత్రమే ఉజ్వల తారలా ప్రకాశిస్తూ వుంటుంది అని వ్యాఖ్యానించిన హెచ్.జి.వెల్స్ అనే చరిత్రకారుడి ప్రశంస ఒక్కటి చాలు అశోకుని కాలం స్వర్ణయుగం అనటానికి. ఈ వృక్షాలను నాటించే పనిని అశోకుడు తన పరిపాలనా కాలంలో అమలుపరిచి ప్రజల మన్ననలను పొందినందు వలన ఆ తరువాత వచ్చినటువంటి చక్రవర్తులు, రాజులకు అశోకుడు ఆదర్శప్రాయుడుగా మిగిలినాడు.

పర్యావరణ కాలుష్యం కోరలలో చిక్కుకుని వ్యవసాయానికి కావలసినటువంటి సాగునీరు, ప్రజలకు అవసరమైనటువంటి త్రాగునీరు లభించక సతమతమౌతున్న ప్రస్తుత పరిస్థితుల్లో వేల సంవత్సరాల క్రితమే అశోకుడు అమలు చేసిన మొక్కల పెంపకం వంటి కార్యక్రమాలను మన ప్రభుత్వాలు చేపట్టి అమలు పరచవలసిన అవసరం ఎంతైనా వుంది. ప్రస్తుత ప్రభుత్వాలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పై (Social forests) వన సంరక్షణ సమితుల ద్వారా మొక్కల పెంపకం, ఉద్యానవనాల పెంపకం చేపట్టినప్పటికీ పూర్తిస్థాయిలో దృష్టి సారించడం లేదు. వీరి కార్యక్రమాలు పాక్షిక స్థాయిలోనే కొనసాగుతున్నాయి. ఇప్పటికైనా మన ప్రభుత్వాలు నిద్ర మేల్కొని ప్రజలకు మేలు చేకూర్చేటటువంటి అశోకుడు అమలుచేసిన విధానాలను ఆదర్శంగా తీసుకొని పటిష్టంగా అమలు చేయవలసిన అవసరం ఎంతైనా వుంది.

ప్రజలు కూడా ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురు చూడకుండా ప్రతి ఇంటి ముంగిట ఒక మొక్కను నాటి వాటిని పరిరక్షించుకొని తద్వారా మనకు అవసరమైన ప్రాణవాయువును మరియు పర్యావరణ సమతుల్యతను కాపాడుకోవలసిన బాధ్యత ప్రతి ఒక్కరి మీద వున్నది.

-రచయిత సెల్ : *96663 92109*

పద్యాలు

# అశోక చక్రవర్తి

-తియ్యగూర సీతారామిరెడ్డి

ఆ॥వె॥ **అం**ధకార వైరి యపరాద్రికవ్వల
జనిన నంధమైన జగము భంగి
బోధి గానకున్న బలుయవిద్య మునిగి
యంధ తమస మతులు యగుట నిజము!

కం॥ మోహితుడై వసు కాంక్షా
వాహిని జిక్కినట్టి క్రూర వశుడగు శోకున్
మహిత హిత బోధి సోకిన్
మోహము వదలగ యశోక మానసుడయ్యెన్

తే॥గీ॥ విజయదశమి నాడున్ ధర్మ విజయుడయ్యే
దేవమానవ ప్రియవర్తి పావన నవ
ధర్మ వైతాళిక కుహూరుత గళవర్తి,
శాంతవర్తి, ఘన యశోక చక్రవర్తి!

తే॥గీ॥ నేల నాలుగు చెరుగుల మేలు గలగ
ధర్మపుత్రుల బంపుచు, ధర్మ చక్ర
వర్తనంబు జేసిన చక్రవర్తి సుపరి
వర్తి, సమవర్తి, సద్ధమ్మస్ఫూర్తి మూర్తి!

తే॥గీ॥ "సూర్యచంద్రులు వెలుగుచున్న వరకు
నాప్రజలు నా కుమారులు నా మనుమలు
ధర్మ ధారణ చేయుచూ దివిన భువిన
సుఖముగా నుండు గాక! అశోకులగుచు"



కం॥ అని దీవించ, శిలాశా
సనముల్ వ్రాయించ, ధర్మ సంరక్షణకై
ఘన సంఘ విహారముల్
పనివడి నిర్మించ పారమిగ భావించెన్

ధర్మచక్రం

సీ॥ దివ్యమై, మోక్షగంతవ్యమై, భవ్యమై, బోధి సంభావ్యమగుచు
భాగ్యమై, సంబోధి భోగమై, ఆస్రవ మృగ్యమై, మునిజన యోగ్యమగుచు
నిత్యమై బోధి సంస్తుత్యమై, నిర్వాణ సత్యమై సాధనకృత్యమగుచు
బోధియై సద్ధర్మ వేదియై హేతుప్రమోదియై యమృత స్వాది యగుచు

తే॥గీ॥ సంప్రజన్య సంక్రాంతుల సంచరించు
సర్వమంగళ చక్రంబు సర్వత్రాణ
జయద యమల చక్రము బుద్ధజ్ఞాత ధర్మ
చక్రమిది మారుని దునుము ఆయుధమ్ము!

❋

-సెల్ : 94913 36258

# మౌర్య సామ్రాజ్యం-అశోకుడు-కాలగణన

| కాలం : క్రీ.పూ. | విషయం-సంఘటనలు | ఆధారం |
|---|---|---|
| 327-22 | భారతదేశంపై అలెగ్జాండర్ దండయాత్ర | ఆరియన్ |
| 325 | అలెగ్జాండర్‌ను చంద్రగుప్తుడు కలుసుకొనుట | ప్లూటార్క్ |
| 323-22 | చంద్రగుప్తుని నాయకత్వంలో పంజాబ్ వారు గ్రీకుల్ని ఎదిరించుట | జస్టిన్ |
| 321 | చంద్రగుప్తుడు చక్రవర్తిగా అభిషిక్తుడు | |
| 311-306 | సెల్యూకస్ చంద్రగుప్తుల సంధి | |
| 306 | సెల్యూకస్ సిరియా చక్రవర్తి అగుట | |
| 305 | సెల్యూకస్ భారత భూభాగంలోని రాజ్యాల్ని చంద్రగుప్తునికి ఇచ్చుట | |
| 304 | అశోక జననం | |
| 297 | బిందుసారుడు చక్రవర్తి అగుట | |
| 272 | ప్రియదర్శి పేరుతో అశోకుడు చక్రవర్తి అగుట | |
| 269 (1వ పా.సం॥)* | అశోకుడు రాజ్యాభిషిక్తుడగుట | |
| 261 (9వ పా.సం॥) | కళింగ విజయం/బౌద్ధ స్వీకరణ | 13వ శిలాశాసనం |
| 259 (11వ పా.సం॥) | మృగయా వినోదం మాని.. తీర్థయాత్రలు చేయడం. | 3వ శిలా శాసనం<br>1వ చిన్న శిలా శాసనం<br>13వ శిలా శాసనం |
| 257 (13వ పా.సం॥) | 3,4 శిలా శాసనాల నిర్మాణం | 3,4 శిలా శాసనాలు |
| 257 (13వ పా.సం॥) | బరాబరలో ఆ జీవకుల కోసం 1,2 గుహల నిర్మాణం | బరాబరు గుహ శాసనాలు |
| 257 (13వ పా.సం॥) | ధమ్మపాలనకోసం 5వ సం.ఒకసారి పరిషత్తు జరగాలని ప్రకటన | 3వ శిలా శాసనం |
| 256 (14వ పా.సం॥) | 14 శిలాశాసనాలు కళింగులకోసం ఒక ప్రత్యేక శిలా శాసనం (2వ శాసనం) | 5వ శిలా శాసనం |
| 256 (14వ పా.సం॥) | ధర్మ మహామాత్రల్ని నియమించుట | 5వ శిలా శాసనం |
| 255 (15వ పా.సం॥) | కపిలవస్తులో బుద్ధుని స్థూప పునరుద్ధరణ | నిగ్లీవా స్తంభశాసనం |
| 254 (16వ పా.సం॥) | కళింగలోని నాగరిక ప్రజల కోసం 1వ ప్రత్యేక శిలా శాసనం | 1వ లఘు శాసనం |

| కాలం : క్రీ.పూ. | విషయం-సంఘటనలు | ఆధారం |
|---|---|---|
| 250 (20వ పా.సం॥)* | బరాబరులో ఆ జీవకుల కోసం 3వ గుహ నిర్మాణం | 3వ బరాబరు గుహశాసనం |
| 249 (21వ పా.సం॥) | లుంబినీ, కొణకముని(లుంబిని దగ్గర) యాత్ర, స్తంభాల నిర్మాణం | నిగ్లీవా రుమ్మందేహి స్తంభ శాసనాలు |
| 243 (27వ పా.సం॥) | 6వ స్తంభ శాసనం | 6వ స్తంభ శాసనం |
| 247 (28వ పా.సం॥) | 7వ స్తంభ శాసనం | 7వ స్తంభ శాసనం |
| 240 (30వ పా.సం॥) | మిగిలిన శిలా శాసనాల నిర్మాణం | |
| 232 (38వ పా.సం॥) | అశోకుని మరణం | మహావంశ |

* పా.సం॥ అంటే పాలనా సంవత్సరం.

అశోకుడు 72వ ఏట మరణించాదు కాబట్టి క్రీ.పూ.304లో పుట్టి వుండాలి. పై పట్టిక 1910లో బేతపూడి లక్ష్మీకాంతారావు గారు రాసిన 'అశోకుని చరిత్రము' గ్రంథం నుండి.

# అశోకుడు పంపిన ధమ్మ ఉపదేశకులు

అశోకుడు మొగ్గలిపుత్త తిస్స సలహా మేరకు వివిధ ప్రాంతాలకు పంపిన బౌద్ధ ధమ్మ ఉపదేశకుల వివరాలు శ్రీలంకు చెందిన 'మహావంశ' గ్రంథంలోని 12వ అధ్యాయంలో ఇలా వుంది

| **ఉపదేశకులు** | **ప్రదేశాలు** |
|---|---|
| 1. మధ్యంతిక..................... | కాశీర, గాంధార దేశాలు |
| 2. మహాదేవ....................... | మహిష మండలం (మైసూరు) |
| 3. రక్షిత......................... | వనవాసి (ఉత్తర కర్ణాటక) |
| 4. యవనధర్మ రక్షిత............ | అపరాంతకం(బొంబాయికి ఉత్తరంగా వున్న సముద్ర తీరప్రాంతం) |
| 5. మధ్యమ, 6. కశ్యప, 7.మాలికాదేవ | హిమాలయ పర్వత ప్రాంతం |
| 8. దుందుభిన్నోస్స, 9.సాహస దేవ | హిమాలయ పర్వత ప్రాంతం |
| 10. సోనా, 11. ఉత్తర | సువర్ణభూమి (పెగు) |
| 12. మహాధర్మ రక్షిత.............. | మహారాష్ట్ర |
| 13. మహారక్షిత.................... | యవన దేశానికి |
| 14. మహా మహేంద్ర, 15.ఇత్తియ | సింహళానికి |
| 16. ఉత్తియ, 17.సంబల, 18.భద్రశిల | సింహళానికి |

❋ అశోకుడు నిర్మించిన సాంచి స్థూపంలో ఒక పాత్రలో మొగ్గలిపుత్త తిస్స మధ్యమ, కస్యపుల అస్తికలు వున్నాయి. ఆ పాత్రలపై వీరి పేర్లు వున్నాయి.

❋ అలాగే దుందుభిన్నోస్స తర్వాత హిమాలయ ప్రాంతాలకు ధమ్మ ఉపదేశానికి వెళ్ళిన 'గొట్టి పుత్తుని' అస్తికలు కూడా వేరే పాత్రలో వున్నాయి.

–సేకరణ :**బుద్ధభూమి బృందం**

# అశోకుని శాసనాలు-కనుగొన్న ప్రదేశాలు

అశోకుని శాసనాలు ఇప్పటివరకు 42 ప్రదేశాల్లో లభించాయి. వీటిలో భారతదేశంలో 36, నేపాల్‌లో 2, పాకిస్తాన్‌లో 2, ఆఫ్ఘనిస్తాన్‌లో 2, 1750లో మొదటగా కౌశాంబిలో బయటపడ్డాయి. అప్పటినుండి క్రమంగా ఏ ప్రదేశాల్లో ఏయే శాసనాలు లభించాయో ఈ క్రిందిపట్టిక ద్వారా తెలుసుకోవచ్చు. ఈ సమాచారం పాఠకులకు ఎంతో ఉపయోగకరంగా వుంటుంది. కొన్ని శాసనాలు ప్రస్తుతం అవి దొరికిన ప్రదేశాల్లో లేవు. వాటి సమాచారం పట్టిక క్రింద పాదసూచికల్లో చూడొచ్చు.

| క్రమ సంఖ్య | సంవత్సరం | ప్రదేశం | దేశం | రాష్ట్రం | జిల్లా | శాసన స్వరూపం | శాసనం సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| 1. | 1750 | కౌశాంబి (కోసల) | ఇండియా | ఉత్తర ప్రదేశ్ | అలహాబాద్ | పెద్ద స్తంభ శాసనాలు | 1 నుండి 6 వరకు |
| 2. | 1750 | మీరట్ | ఇండియా | ఉత్తర ప్రదేశ్ | ఢిల్లీ దగ్గర | పెద్ద స్తంభ శాసనాలు | 1 నుండి 6 వరకు |
| 3. | 1750 | కౌశాంబి (కోసల) | ఇండియా | ఉత్తర ప్రదేశ్ | అలహాబాద్ | చిన్న స్తంభ శాసనం | 1 |
| 4. | 1750 | కౌశాంబి (కోసల) | ఇండియా | ఉత్తర ప్రదేశ్ | అలహాబాద్ | చిన్న స్తంభ శాసనాలు | 1 నుండి 4 వరకు |
| 5. | 1784 | లౌరియా(అరెరాజ్) | ఇండియా | బీహార్ | ప.చంపారన్ | పెద్ద స్తంభ శాసనాలు | 1 నుండి 6 వరకు |
| 6. | 1785 | తోప్రా(ఢిల్లీ తోప్రా) | ఇండియా | హర్యానా | అంబాలా | పెద్ద స్తంభ శాసనాలు | 1 నుండి 7 వరకు |
| 7. | 1785 | బరాబర కొండ | ఇండియా | బీహార్ | గయ | గుహ శాసనం | అజీవకులకోసం నిర్మించింది |
| 8. | 1822 | గిర్‌నార్ | ఇండియా | గుజరాత్ | జునాగర్ దగ్గర | పెద్ద శిలా శాసనాలు | 1 నుండి 14 వరకు |
| 9. | 1834 | లౌరియా(నందనగర్) | ఇండియా | బీహార్ | ప.చంపారన్ (మాతియ దగ్గర) | పెద్ద స్తంభ శాసనాలు | 1 నుండి 6 వరకు |
| 10. | 1836 | షాబాజ్‌గరి | పాకిస్తాన్ | వాయువ్య ఫ్రాంటీరియర్ | పెషావర్ మార్దన్ దగ్గర | పెద్ద శిలా శాసనాలు | 1 నుండి 14 వరకు |

| క్రమ సంఖ్య | సంవత్సరం | ప్రదేశం | దేశం | రాష్ట్రం | జిల్లా | శాసన స్వరూపం | శాసనం సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| 11. | 1837 | దౌలి | ఇండియా | ఒరిస్సా | పూరి | పెద్ద శిలా శాసనాలు | 1 నుండి 16 వరకు |
| 12. | 1839 | సహస్రాం | ఇండియా | బీహార్ | షాబాద్ | చిన్న శిలా శాసనం | 1 |
| 13. | 1840 | బైరాట్ [1] | ఇండియా | రాజస్తాన్ | జైపూర్ (దగ్గర) | చిన్న శిలా శాసనం | 1 |
| 14. | 1850 | జౌగడ | ఇండియా | ఒరిస్సా | గంజాం | పెద్ద శిలా శాసనాలు | 1 నుండి 16 వరకు |
| 15. | 1860 | కాల్సీ | ఇండియా | హిమాచలప్రదేశ్ | పోంటా (దగ్గర) | పెద్ద శిలా శాసనాలు | 1 నుండి 14 వరకు |
| 16. | 1863 | సాంచీ | ఇండియా | మధ్యప్రదేశ్ | విదిషా | చిన్న స్తంభ శాసనం | 1 |
| 17. | 1871 | రూప్‌నాధ్ | ఇండియా | మధ్యప్రదేశ్ | జబల్‌పూర్ (స్లీమన్‌బాద్ దగ్గర) | చిన్న స్తంభ శాసనం | 1 |
| 18. | 1882 | సొపర [2] | ఇండియా | మహారాష్ట్ర | తానా | పెద్ద శిలా శాసనాలు | 8,9 |
| 19. | 1889 | మాన్‌సెహ్రా | పాకిస్తాన్ | వాయువ్య ప్రాంటీరియర్ | హజారా | పెద్ద శిలా శాసనాలు | 1 నుండి 14 వరకు |
| 20. | 1891 | బ్రహ్మగిరి | ఇండియా | కర్ణాటక | చిత్రదుర్గ | చిన్న శిలా శాసనాలు | 1,2 |
| 21. | 1891 | జైతింగరామేశ్వర్ | ఇండియా | కర్ణాటక | చిత్రదుర్గ | చిన్న శిలా శాసనాలు | 1,2 |
| 22. | 1891 | సిద్ధాపుర | ఇండియా | కర్ణాటక | చిత్రదుర్గ | చిన్న శిలా శాసనాలు | 1,2 |
| 23. | 1895 | నిగ్లివా | నేపాల్ | లుంబినికి 13 మైళ్ళ వాయువ్యంగా | రుమ్మిందేహి | స్తంభశాసనం | 1 |
| 24. | 1895 | లుంబిని | నేపాల్ | | రుమ్మిందేహి | స్తంభ శాసనం | 1 |
| 25. | 1902 | రాంపూర్వా | ఇండియా | బీహార్ | ప. చంపారన్ | పెద్ద స్తంభ శాసనాలు | 1 నుండి 6 వరకు |

| క్రమ సంఖ్య | సంవత్సరం | ప్రదేశం | దేశం | రాష్ట్రం | జిల్లా | శాసన స్వరూపం | శాసనం సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| 26. | 1904 | సారనాథ్ | ఇండియా | ఉత్తరప్రదేశ్ | వారణాసి | చిన్న స్తంభ శాసనం | 1 |
| 27. | 1915 | మస్కి | ఇండియా | కర్ణాటక | రాయచూర్ | చిన్న శిలా శాసనం | 1 |
| 28. | 1929 | ఎర్రగుడి | ఇండియా | ఆంధ్రప్రదేశ్ | కర్నూలు (గుత్తి దగ్గర) | చిన్న శిలా శాసనాలు | 1,2 |
| 29. | 1929 | ఎర్రగుడి | ఇండియా | ఆంధ్రప్రదేశ్ | కర్నూలు | పెద్ద శిలా శాసనాలు | 1 నుండి 14 వరకు |
| 30. | 1931 | గవీ మఠం | ఇండియా | కర్ణాటక | రాయచూర్ (కొప్పల దగ్గర) | చిన్న శిలా శాసనం | 1 |
| 31. | 1931 | పాల్కి గుండు | ఇండియా | కర్ణాటక | రాయచూర్ (గవీమఠం దగ్గర) | చిన్న శిలా శాసనం | 1 |
| 32. | 1953 | రాజులమండ్ గిరి | ఇండియా | ఆంధ్రప్రదేశ్ | కర్నూలు | చిన్న శిలా శాసనాలు | 1,2 |
| 33. | 1954 | గుజర్రా | ఇండియా | మధ్యప్రదేశ్ | దాటియా | చిన్న శిలా శాసనం | 1 |
| 34. | 1958 | షరీ-ఇ-కునా [3] | ఆఫ్ఘనిస్తాన్ | దక్షిణ ఆఫ్ఘన్ | కాందహార్ దగ్గర | చిన్న శిలా శాసనం | 4 |
| 35. | 1961 | అరౌరా | ఇండియా | ఉత్తరప్రదేశ్ | మీర్జాపూర్ | చిన్న శిలా శాసనం | 1 |
| 36. | 1967 | బహాపుర్ | ఇండియా | ఢిల్లీ | శ్రీనివాసపురి దగ్గర | చిన్న శిలా శాసనం | 1 |
| 37. | 1969 | లగ్‌మాన్ [4] | ఆఫ్ఘనిస్తాన్ | జలాలాబాద్ దగ్గర | జలాలాబాద్ దగ్గర | చిన్న శిలా శాసనం | 1 |
| 38. | 1975 | పాన్గురారియా | ఇండియా | మధ్యప్రదేశ్ | సెహోర్ | చిన్న శిలా శాసనం | 1 |
| 39. | 1977 | నిట్టూర్ | ఇండియా | కర్ణాటక | బళ్ళారి | చిన్న శిలా శాసనం | 1 |

| క్రమ సంఖ్య | సంవత్సరం | ప్రదేశం | దేశం | రాష్ట్రం | జిల్లా | శాసన స్వరూపం | శాసనం సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| 40. | 1978 | ఉద్దెగోలం | ఇండియా | కర్ణాటక | బళ్ళారి | చిన్న శిలా శాసనం | 1 |
| 41. | 1989 | సన్నతి[5] | ఇండియా | కర్ణాటక | గుల్బర్గా | చిన్న శిలా శాసనాలు | 2 |
| 42. | 1989 | సన్నతి[6] | ఇండియా | కర్ణాటక | గుల్బర్గా | పెద్ద శిలా శాసనాలు | 12,14 |



**పాద సూచికలు :**

1. ఈ బైరాట్ శాసనం ప్రస్తుతం కలకత్తాలోని ఇండియన్ మ్యూజియంలో వుంది.
2. ఈ సొపర శాసనం ప్రస్తుతం బొంబాయిలోని వేల్స్ యువరాజు మ్యూజియంలో వుంది.
3. ఇది రెండు భాషల్లో (గ్రీకు, అరామయిక్) వున్న ద్విభాషా శాసనం.
4. ఇది ఖరోష్టి విధానంలో వున్న అరామయిక్ భాషలో వున్న శాసనం.
5. ఈ శాసనం ప్రస్తుతం హైదరాబాద్‌లోని భారత పురావస్తుశాఖ కార్యాలయంలో వుంది.
6. ఇది కూడా హైదరాబాద్ లోని భారత పురావస్తుశాఖ కార్యాలయంలో వుంది.



# అశోకునిపై ఆంగ్ల గ్రంథాలు - వివరాలు

**Legend of king Asoka**

రచన : **జాన్ యస్.స్ట్రాంగ్** ప్రచురణ : మోతీలాల్ బనారసీ దాస్, న్యూఢిల్లీ.

---

**Asoka**

(The search for India's last Emperor)

రచన : **ఛార్లెస్ అలెన్** ప్రచురణ : లిటిల్ బ్రౌన్స్ బుక్స్ గ్రూపు - 2012

---

**Asoka**

(The Buddhist Emperor of India)

రచన : **విన్సెంట్ ఆర్థర్ స్మిత్** ప్రచురణ : ఆసియన్ ఎడ్యుకేషనల్ సర్వీస్, సి-2/15, ఎస్.డి.ఏ, న్యూఢిల్లీ-110016 పేజీలు : 278, వెల : రు.365/-

---

**The Edicts of King Asoka**

ఆంగ్లం : **Ven.S.Dhammika** ప్రచురణ : బుద్ధిస్ట్ పబ్లికేషన్స్ సొసైటీ, శ్రీలంక

---

**Asoka 2300**

(Jagajjyoti : Asoka Commemoration Valume, 1997 A.D/2541 B.E)

Editor : **Hemendu Bikash Chowdhury**

**Bauddha Dharmankur Sabha**, Kalcutta-700 012.

---

**Asoka the Greate**

బుద్ధుని కాలంలో మగధరాజ్యం నుండి అశోకుని చివరి రోజుల వరకు, అశోకుడు వివిధ దశల్లో చేసిన ధమ్మవ్యాప్తిని సవివరంగా చిత్రించిన గ్రంథం.

ప్రచురణ : సమ్యక్ ప్రకాశన్, న్యూఢిల్లీ.

హిందీమూలం : **మధుకర్ పిప్లాయన్** ఆంగ్లానువాదం: **మోజెస్ మైఖేల్**

వెల : 200/- email : budharam@bol.net.in

---

**Asoka**

(beloved of the gods)

అశోకుని చరిత్రలో నిజానిజాల్ని ఆవిష్కరించిన అమూల్య గ్రంథం. అశోకుని శాసనాల్ని, అశోకుని చివరి రోజుల్ని, చరిత్రలో అశోకుని సమున్నతస్థానాన్ని చిత్రించిన అపూర్వగ్రంథం.

రచన : **ఎస్.వీరనారాయణరెడ్డి** వెల : రు.25/-

ప్రచురణ : ఆనంద బుద్ధవిహార ట్రస్టు, మహేంద్రా హిల్స్, సికింద్రాబాద్-26.

---

**అశోకుని చరిత్రము** (తెలుగు గ్రంథము)

రచన : **బేతపూడి లక్ష్మీకాంతారావు**

ముద్రణ : 1910 వెల : రు.1-4-0

---

మరిన్ని వివరాల కోసం.. **- బొర్రా గోవర్ధన్,** సెల్ : *93906 00157*

విజయవంతంగా ముగిసిన

# రాష్ట్ర బౌద్ధ సాహితీ సదస్సు

అక్టోబరు 20,21 తేదీలలో రాష్ట్రస్థాయి బౌద్ధ సాహితీ సదస్సు విజయవాడ-మంగళగిరి రహదారిలో గల కుంచనపల్లి గ్రామంలోని అరవింద హైస్కూల్ ఆవరణలో జరిగింది. ఈ సదస్సుకు రాష్ట్రం నలుమూలల నుండి 70 మందికి పైగా బౌద్ధ రచయితలు, ధమ్మ ప్రచారకులు, బౌద్ధమిత్రులు హాజరయ్యారు. ఈ సదస్సు నిర్వహణ కోసం ఏర్పడిన కమిటీకి అన్నపరెడ్డి బుద్ధఘోషుడు కన్వీనరు కాగా, హైదరాబాద్‌కు చెందిన పి.అబ్బాయి సారధ్యంలో సదస్సు అత్యంత స్ఫూర్తిదాయకంగా, విజయవంతంగా ముగిసింది. బుద్ధభగవానుడు బ్రతికున్న కాలంలోనే బౌద్ధాన్ని అందిపుచ్చుకుని, బౌద్ధ చరిత్రలో ప్రముఖ స్థానం సంపాదించిన తెలుగునేలపై బౌద్ధాన్ని పునరుద్ధరించాలనే మహోన్నత లక్ష్యంలో భాగంగా ఈ సదస్సు నిర్వహించినట్లు నిర్వాహకులు ప్రకటించారు.

20వ తేదీ శనివారం ఉదయం 9.30 గం॥కు వివిధ ప్రాంతాల నుండి వచ్చిన ప్రతినిధులు తమను తాము సభకు పరిచయం చేసుకున్నారు. 10 గంటలకు ధమ్మాచార్య అన్నపరెడ్డి బుద్ధఘోషుడు, ధర్మమిత్ర రవీంద్రుడు, ఉపాసిక సరోజిని గార్లు బుద్ధ ప్రతిమ వద్ద జ్యోతి వెలిగించి బుద్ధవందనం ఆలాపించటంతో సదస్సు కార్యక్రమాలు మొదలయ్యాయి. ఈ సందర్భంగా 'బౌద్ధులు ఆచరించే బుద్ధవందనం ఒక ప్రార్థన లేక పూజ వంటిది కాదని, మానవజాతికి వెలుగుదివ్వె వంటి బోధనల్ని అందించిన మహోపాధ్యాయుడైన బుద్ధుని స్ఫూర్తిని మననం చేసుకోవటమే దీని అసలు వుద్దేశం' అని బుద్ధఘోషుడు క్లుప్తంగా వివరించారు. అనంతరం బుద్ధుని ఔన్నత్యాన్ని తలంచుకుంటూ సభ రెండు నిమిషాలపాటు అరియ మౌనాన్ని పాటించింది. కృష్ణాజిల్లా బియస్‌ఐ అధ్యక్షురాలు మట్టా ఝాన్సీరాణి వక్తలకు, సభికులకు ఆదరపూర్వకంగా స్వాగతం పలికారు. ప్రజా గాయకులు కంచర్ల కాశయ్య, పొట్లాబత్తుని లక్ష్మణరావు బౌద్ధ గీతాలను శ్రావ్యంగా ఆలపించారు. 10.15 గంటలకు 'బౌద్ధ సాహిత్య భూమిక-ప్రాధాన్యాలు' అనే అంశాన్ని వివరిస్తూ ఆచార్య బుద్ధఘోషుడు గారి ప్రారంభోపన్యాసం సాగింది. రెండు రోజులపాటు జరగబోయే సదస్సులో కేంద్రీకరించాల్సిన వివిధ అంశాలను ఆయన వివరించారు.

టీ విరామం తర్వాత 10-50 గం॥లకు ప్రారంభమైన సమావేశానికి బియస్‌ఐ రాష్ట్ర అధ్యక్షులు బి.కట్టయ్య గారు అధ్యక్షత వహించారు. 'వర్తమాన బౌద్ధ సాహిత్యం- తీరు తెన్నులు' అనే అంశంపై రెండు గంటలపాటు సాగిన సమాలోచనలో మొదట తెలుగు బౌద్ధ సాహిత్య పుట్టుపూర్వోత్తరాల గురించి అన్నపరెడ్డి బుద్ధఘోషుడు వివరించారు. అనంతరం ఈ చర్చలో శ్రీయుతులు బొర్రా గోవర్ధన్, శ్రీకృష్ణార్జుబోధి, టి.సీతారామిరెడ్డి, జి.నవీన్, డా॥వావిలాల సుబ్బారావు తదితరులు తమ అమూల్యమైన అభిప్రాయాలను సభాముఖంగా వివరించారు.

భోజన విరామం తరువాత మధ్యాహ్నం 2-30 గం॥లకు బౌద్ధ రచయితల శిక్షణా శిబిరం ప్రారంభమైంది. బౌద్ధ సాహిత్యంలో వివిధ రచనా ప్రక్రియలను, అనువాదాలను సాధన చేస్తూ రచనా కౌశలాన్ని మెరుగుపర్చుకొనే లక్ష్యంతో ఈ కార్యక్రమం నిర్వహించబడింది. దీనికి డి.చంద్రశేఖర్ సారధ్యం వహించగా- బుద్ధభూమి వర్కింగ్ ఎడిటర్ గోలి సీతారామయ్య, బౌద్ధ కధా రచయిత బొర్రా గోవర్ధన్, దేవరపల్లి హరిప్రసాద్‌లు క్రియాశీల పాత్ర పోషించారు. మొదట గోలి సీతారామయ్య గ్రాంధికంలో గల బౌద్ధ సాహిత్యం నుండి ఎంపిక చేసిన కొన్ని పేరాలను సభికులకు అందించి, వాటిని సరళమైన వాడుక భాషలోకి మార్చమని కోరారు. ఇందుకు

అవసరమైన మార్గదర్శక సూత్రాలను ఆయన క్లుప్తంగా వివరించారు. అనంతరం బొర్రా గోవర్ధన్ ప్రాచీన బౌద్ధ సాహిత్యం నుండి సేకరించిన చిన్న కథలను క్లుప్తంగా వివరించారు. ఆ కథల సారాంశం ఆధారంగా స్వయంగా కథలను రూపొందించే అభ్యాసాన్ని ఆయన రచయితలకు అందించారు. ఆ తరువాత దేవరపల్లి హరిప్రసాద్ ఇంగ్లీషులో వున్న బౌద్ధానికి చెందిన జెన్ కార్టూన్ కథలను తెలుగులోకి అనవదించమని, అందుకు అవసరమైన నమూనాలను సభికులకు అందించారు.

ఈ మూడు రకాల అభ్యాసాలను అందుకున్న రచయితలు, యితర బౌద్ధమిత్రులు ఈ ప్రక్రియలో ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు. గతంలో ఎన్నడూ రచనలు చెయ్యని కొందరు ఈ రచనా ప్రక్రియలో ఆసక్తికరంగా పాల్గొనటం ప్రత్యేకించి చెప్పుకోదగింది. తాము ఎంచుకున్న ప్రక్రియను పూర్తిచేసిన కొందరు ఆనాటి సాయంత్రానికి వారి రచనల్ని నిర్వాహకులకు అందించారు. వాటిని మరుసటిరోజు నోటీస్‌బోర్డులో అందరికీ అందుబాటులో వుండేట్లు ప్రదర్శనకు పెట్టడం జరిగింది.

సాయంకాలం 4 గంటలకు 'బౌద్ధంలోని వివిధ అంశాలను వర్తమాన సమస్యలకు అన్వయించటం' అనే అంశంపై ఐదు బృందాలుగా విడిపోయి భిన్నమైన సమస్యలపై చర్చను చేపట్టారు. కులసమస్య–బౌద్ధం', 'నేటి సమాజంలో పెరిగిపోతున్న హింసాప్రవృత్తి–పరిష్కారాలు', 'క్షీణిస్తున్న మానవ సంబంధాలు–బౌద్ధం సూచించే పరిష్కారాలు', 'పిల్లల పెంపకంలో బౌద్ధం మార్గదర్శకత', 'నిరక్షరాస్యులకు గ్రామీణ ప్రజలకు బౌద్ధాన్ని ఎలా బోధించాలి?' అనే అంశాలను ఈ బృందాలు చర్చించాయి. ఈ చర్చలో పాల్గొన్న బృందాలకు ఝాన్సీరాణి, శ్రీకృష్ణార్జునబోధి, డా॥పి.సత్తెయ్య, పి.అబ్బాయి, ధర్మమిత్ర రవీంద్రుడు నేతృత్వం వహించారు. చర్చల అనంతరం తిరిగి సమావేశమైన సభలో ఆయా బృందాల ప్రతినిధులు తమ చర్చల సారాంశాన్ని సభికులకు వివరించారు. ఈ మొత్తం చర్చా కార్యక్రమాన్ని విశాఖపట్టణానికి చెందిన డా॥మాటూరి శ్రీనివాస్ అత్యంత చాకచక్యంతో మైత్రీ పూర్వక వాతావారణంలో వివరించారు.

సాయంత్రం 7 గంటలకు ప్రముఖ రచయిత కె.రాజేశ్వరరావు రచించిన (ఈ సంచికలో ఏకపాత్రను ప్రచురించాం) **మౌర్య అశోకుడు** ఏకపాత్రను విశ్వశాంతి కళాపరిషత్ మంగళగిరి వారి నిర్వహణలో ప్రజాకళాకారుడు సందుపట్ల భూపతి ప్రదర్శించాడు. అశోకుని వేషధారణ, వాచకం, అభినయాలు ఎంతో కళాత్మకంగా వున్నాయని ప్రతినిధులు భూపతిని అభినందించారు.

రాత్రి 8 గం॥లకు రొక్కాల గణపతిరావు, ఆర్.రాజన్ గార్ల సారధ్యంలో **'జగజ్జ్యోతి'** నాటికను ప్రదర్శించారు. బుద్ధుని జీవిత కథలోని కీలక ఘట్టాలతో కూడిన ఈ ప్రదర్శన ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది. ఐదు పాత్రలతో ఈ నాటికను నడిపించడం ఎంతో విశేషం. శుద్ధోధనుడు మరియు అంగులీమాలుడుగా కడలి కృష్ణారావు, బుద్ధుడుగా మంగం సత్యనారాయణ, చెన్నుడు మరియు కసాయి కన్నడుగా కొంతేటి శాంతారావు నటించారు. టెక్నికల్ ఎఫెక్ట్స్‌ను జి.రవీంద్రకుమార్ అందించారు. కేవలం రెండురోజుల సమయంలోనే ఈ నాటికను సిద్ధం చేసి ప్రదర్శించిన నటుల్ని, రచన, సంగీతం, నేపథ్యగానం, వ్యాఖ్యానం నిర్వహించిన ఆర్.గణపతిరావు(రాయపూర్)ని, దర్శకత్వం వహించిన ఆర్.రాజన్(నగరం)లను సభికులు ఎంతగానో అభినందించారు.

21వ తేదీ ఉదయం 9–30 గం॥లకు సదస్సు 2వ రోజు కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. మొదటగా అన్నపరెడ్డి బుద్ధఘోషుడు అధ్యక్షతన జరిగిన సమావేశంలో తమను బౌద్ధం వైపు మరల్చిన రచనలు, అనుభవాల గురించి సభ్యులు ఒక్కొక్కరుగా వచ్చి మాట్లాడారు. మొదటినుండి చివరివరకూ ఎంతో ఆసక్తికరంగా జరిగిన ఈ కార్యక్రమంలో వక్తలు వ్యక్తం చేసిన గాఢమైన

అనుభూతులు సభికుల హృదయాలను కదిలించాయి. ఇంకా ఎందరో సభ్యులు మాట్లాడటానికి ముందుకొచ్చినా సమయాభావం వల్ల అందరికీ అవకాశం లభించలేదు.

తరువాత జరిగిన 'బౌద్ధసాహిత్యం-మన కర్తవ్యాలు' అనే చర్చా కార్యక్రమానికి గీతం యూనివర్శిటీ ప్రొఫెసర్ డా॥ సి.ప్రజ్ఞ అధ్యక్షత వహించారు. ఏ సాహిత్యానికైనా ప్రజలను ప్రభావితం చేసే లక్షణం, ప్రజా జీవితాల్ని ప్రతిబింబించే లక్షణం వుంటాయని, బౌద్ధసాహిత్యం ఈ రెండు లక్షణాలను సమృద్ధిగా పెంపొందించుకోవాలని ఆమె సూచించారు. అనంతరం బౌద్ధ సాహిత్య ఉద్యమాన్ని ముందుకు నడిపేటందుకు సారధ్యం వహించగల ఒక కమిటీని సదస్సు ఏకగ్రీవంగా ఎన్నుకున్నది. ఈ కమిటీకి దేవరపల్లి హరిప్రసాద్ కన్వీనరుగా, శ్రీ యుతులు పి.అబ్బాయి, శ్రీకృష్ణార్జునబోధి, డి.చంద్రశేఖర్, డా॥మాటూరి శ్రీనివాస్, జి.నవీన్, సిహెచ్. శ్రీనివాస్, మట్టా ఝాన్సీరాణి సభ్యులుగా ఎంపికయ్యారు. తరువాత బుద్ధభూమి పత్రిక పబ్లిషర్ రేకా కృష్ణార్జునబోధి పత్రిక వర్తమాన స్థితిగతులను వివరించి, పత్రిక నిర్వహణలో సహకారం అందిస్తున్న వారికి కృతజ్ఞతలు తెలుపుతూ, యికముందు కూడా యిటువంటి సహకారాన్ని అందించవలసిందిగా కోరారు.

చివరిగా-ఎస్.టాంగ్ అడిగిన వెంటనే సదస్సు నిర్వహణకు అరవింద స్కూల్ ప్రాంగణాన్ని, ప్రతినిధులకు వసతి సౌకర్యాన్ని అందించటానికి అంగీకరించి, అడగకుండానే ఎంతో ఔదార్యంతో అందరికీ టీ టిఫిన్లు, భోజనాలు ఏర్పాటు చేసిన చాగంటి వెంకటరెడ్డి గారికి, స్కూల్ ప్రిన్సిపాల్ శ్రీమతి ఇంద్రాణి గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేశారు. అలాగే ఈ సదస్సును విజయవంతం చేయడంలో ముందుండి నడిపించిన నిర్వాహకులకు, మైత్రీపూర్వక వాతావరణంలో సదస్సులో పాల్గొన్న ప్రతినిధులకు, అరవింద స్కూల్ సిబ్బందికి కృతజ్ఞతలు తెలిపారు. ❋

## బుద్ధభూమికి విరాళమిచ్చిన దాతలు

| | |
|---|---|
| **జి.నవీన్ గారు,** విశాఖపట్నం (గతంలో 1,000) | రూ. 10,000/- |
| (వ్యవస్థాపక కార్యదర్శి : బౌద్ధపరిషత్, విశాఖపట్నం) | |
| **బుర్రా రత్నరాజు గారు,** ప్రిన్సిపల్, SVRM కళాశాల, నగరం | రూ. 5,000/- |
| **డా॥పి.డి.సత్యపాల్ గారు,** విశాఖపట్నం (గతంలో 1000) | రూ. 5,000/- |
| **అట్లూరి లవకుమార్ గారు,** విజయవాడ | రూ. 2,000/- |
| **యల్లాప్రగడ సీతాపతి గారు,** నగరం (రేపల్లె) | రూ. 2,000/- |
| **డా॥కె.చక్రపాణి గారు,** విజయవాడ | రూ. 1,500/- |
| **కలువకొల్లు శ్రీనివాసరావు గారు,** మంగళగిరి | రూ. 1,000/- |
| **చిలకా వెంకటేశ్వరరావు గారు,** మంగళగిరి | రూ. 1,000/- |
| **ప్రొ॥ అబ్దుల్ నూర్‌బాషా గారు,** మంగళగిరి | రూ. 1,000/- |
| **డా॥కె.శ్యామ్‌సుందర్ గారు,** కరీంనగర్ (గతంలో 1,100) | రూ. 1,000/- |
| **డి.రవీంద్రుడు గారు,** హైదరాబాద్ | రూ. 1,000/- |
| **దోవారి నాంచారయ్య గారు,** మచిలీపట్నం | రూ. 1,000/- |
| **డా॥లంకా వెంకటేశ్వర్లు గారు,** ఏలూరు | రూ. 1,000/- |
| **డా॥మాటూరి శ్రీనివాస్ గారు,** విశాఖపట్నం (గతంలో 5500) | రూ. 600/- |
| **డా॥కె.సుధాకరరావు గారు,** పాడేరు | రూ. 500/- |
| **జి.వెంకటేశ్వరరావు గారు,** కాకినాడ | రూ. 500/- |
| **ఎం.గణపతిరావు గారు,** విశాఖపట్నం (గతంలో 500) | రూ. 500/- |
| **బి.వి.రాఘవులు గారు,** విశాఖపట్నం (గతంలో 500) | రూ. 500/- |
| **కె.అర్జునరావు గారు,** విజయనగరం (గతంలో 500) | రూ. 500/- |
| **డా॥బి.సత్తెయ్య గారు,** హైదరాబాద్ | రూ. 500/- |
| **డా॥జి.లక్ష్మీనారాయణ గారు,** గుడివాడ | రూ. 500/- |
| **డా॥ఎన్.వెంకటేశ్వర్లు గారు,** హైదరాబాద్ | రూ. 500/- |

*బుద్ధభూమిలో వెలువడే రచనల్లోని అభిప్రాయాలు ఆయా రచయితల స్వంత అభిప్రాయాలు మాత్రమే. వాటన్నిటితో సంపాదకవర్గం ఏకీభవించుతున్నట్లుగా భావించనక్కరలేదు.*

Printed Published and Owned by Rekha Krishnarjuna Rao
D.No.11-450/C1, NCC Road, Mangalagiri-522 503, Guntur Dt.
Printed at Kala Jyothi Process Pvt.Ltd.,D.No.1-1-60/5,
RTC X Roads, Musheerabad, Hyderabad-500 020.
Editor : B.Bodhachaitanya

## అశోకునిపై వచ్చిన ఆంగ్ల గ్రంథాలు
































కర్ణాటకలోని కనగళహళ్ళి బౌద్ధ స్తూపం వద్ద లభించిన
అశోకుని రాతి శిల్పం



విశాఖ వాస్తవ్యులు శ్రీ గొంది నవీన్-లక్ష్మీదేవి దంపతుల కుమారుడు చి॥చైతన్య-రజనీల వివాహం
28-4-2012న శనివారం రాత్రి 7 గంటలకు BHPV కళ్యాణమండపంలో జరిగింది.
వివాహానికి ముందు పూజ్య భిక్షు నాగబోధి వధూవరులచే బుద్ధవందనం చేయిస్తున్న దృశ్యం.



చి॥చైతన్య-రజనీల వివాహ సందర్భంగా వరుడు తల్లిదండ్రులు శ్రీ గొంది నవీన్-లక్ష్మీదేవి
మరియు వధువు తల్లిదండ్రులు మండా నరసన్న-విజయకుమారి
వివాహం జరిపించిన శ్రీ జె.యస్.రఘుపతిరావు.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A105 |
| పుస్తకం పేరు | బుద్ధ భూమి |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 143 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |